# మన రాజ్యాంగము

పర్సా వేంకటేశ్వరరావు
బి. ఏ., యల్. యల్. బి., హెచ్. సి. ఎస్.

ప్రచురణ:
ఆంధ్ర సారస్వత పరిషత్తు
హైదరాబాదు.

# విషయసూచిక

# పీఠిక

భారత రాజ్యాంగమునుగురించి యెన్ని గ్రంథములు వెలువడి నను మంచిదే, కోట్లకొలది భారతీయులు తమ దేశ రాజ్యాంగ పద్ధతి లోని ముఖ్య విషయముల నెరిగియుండవలెను. ఇది ప్రతి పౌరుని విధి.

మన రాజ్యాంగము ౨౬ నవంబరు ౧౯౪౯ లో భారతీయ పార్లమెంటులో శాసనమయ్యెను. ౨౬ జనవరి ౧౯౫౦ లో దేశ మంతటికిని వర్తించునట్టిదయ్యెను. ఈ రాజ్యాంగములో ౨౨ భాగ ములు, ౮ అనుబంధములు కలవు. ౩౯౫ సూత్రములు (ఆర్టికల్సు) కలవు. మూలమంతయు ఇంగ్లీషులో కలదు. ఇంతటి పెద్ద గ్రంథమును తెలుగులో ఉన్నదున్నట్లుగా నెవరును అనువదించినట్లు కాన రాదు. హిందీలో మాత్రి మనువదించినారు. కాని యందలి సాంకే తిక పదసృష్టి హిందీ మాతృభాషగా కలవారికిని నర్థమగునని తలచు టకు వీలులేదు. అనేక సంస్కృత పదముల యథార్థములను నూకి వేసి తమ "యిష్ట"లను స్థాపించినారు హిందీవాదులు. భారత దేశానికి సంక్ర మించిన చిక్కులలో భాషా సమస్యయు దానిలో తీవ్రమైన సాంకేతిక పదసృష్టియు చేరియున్నది. ఒక్కొక్క భాషాజను లొక్కొక్క విధ ముగా సాంకేతిక పదసృష్టిని చేయుచుండిన పూర్వము హిబ్రూల మత నిబంధనలో తెలిపిన "బేబిల్" కథవంటిదిగా పరిణమించును. అయితే అజ్ఞానదృష్టిగా హిందీవాదులు సృష్టించిన పదములు సరికానిదైన తక్కిన భాషలవారేల స్వీకరింతురు. హిందీభాషాసామ్రాజ్య నిరంకుశత్వమును తక్కినభాషలవారొప్పుకొనరు.

మన తెలుగులోకూడ శాస్త్రీయసాంకేతిక పదసృష్టినిచేసి మద్రాసు విద్యాపీఠమువారును, ఆంధ్రపత్రికవారును, బెజవాడలో శ్రీ దిగవల్లి శివరావుగారును ముద్రించియున్నారు అన్నియు లోప భూయిష్టములైనవి. ఆంధ్ర సారస్వత పరిషత్తువారి యాశయ ములలో సైన్సులుకాని ఆర్థిక రాజకీయ న్యాయాది శాస్త్ర

ములకు సంబంధించిన సాంకేతికములను సరిగా, విద్వజ్జనాంగీకార యోగ్యముగా నిర్ణయించుటయు చేరినది. కాని దాని యేర్పాటింకను కాలేదు. మన పత్రికలు కొన్నికొన్ని మారులు భాషను పాడుచేయు చున్నవి. తప్పుడు పదాలకు దొంగనాణెములువలె "చలామణి" అయి పోయినది.

ఈ రాజ్యాంగములో ఫెడరల్, యూనిటరీ, రిపబ్లిక్, డెమాక్రటిక్, సుప్రీంకోర్టు వంటి పదాలు చాలా కలవు. మరియు వోటు సంబంధములో సింగిల్ ట్రాన్స్ఫరబుల్ వోటువంటి పదాలు చాలా కలవు. ఈ వోటు చిక్కులు నా వంటి లెక్కలు ఎక్కాలు రానివాన్ని తబ్బిబ్బులు చేయునట్టివి. ఇంతవరకు మన తెలుగులో "వోటు" అను గ్రంథమొక్కటే యనుకొందును. దానిని పూజ్య శ్రీ గాడిచర్ల హరి సర్వోత్తమరావుగారు 30 ఏండ్లకుముందే ప్రకటించియుండిరి. ఎన్నికలు సమీపిస్తున్నవి. మంచిమంచి బి. ఏ. లకే పై రాజ్యాంగ లక్షణ విలక్షణాలు సరిగా తెలియనప్పుడు ప్రైమరీ చదువుకొన్నవారు సంతకములు లావక్షరములతో గీకుటకు నేర్చుకొన్నవారు, అదియురాక ముద్రలొత్తువారు ఏమి తెలిసికొని వోటు నియ్యగలరు. భారత రాజ్యాంగము భారతీయ ప్రజలందరి అనుమతి పొందిన శాసనముగా భావింపబడు చున్నది. అట్టి సందర్భములో ప్రతి పౌరుడు తన వోటు విలువను గుర్తింపక లంచములకో, మోసాలకో, బలవంతమునకో, మొగమోటమునకో, తన వోటును దుర్వినియోగము చేసిన "కాంచెవు పెంటలేరి తినుకుక్కుటమున్ నిను కందిగింజగా దంచు త్యజించినంతనె యుహా యపకీర్తియె నీకు రత్నమా" అన్నట్లుగా మన కిచ్చిన రత్నము విలువ తెలియక గాజుముక్కయని పారవేసుకొనిన వారమగుదుము. వోటు నుపయోగించుకొనుట పవిత్ర కార్యము, దానిని వ్యభిచరించుట క్షమింపరాని తప్పగును!

శ్రీ పర్సా వేంకటేశ్వరరావుగారు (హెచ్. సి. యస్.) ఈ గ్రంథమును తెలుగు వారి యుపయోగమునకై రచించినారు. ఇది యింత

వరకే వెలువడవలసి యుండెను. స్వతంత్ర భారతదేశపు ప్రప్రథమపు ఎన్నికల సందర్భములోనియ్యది వచ్చుటచేత దీని విలువ హెచ్చినది. గ్రంథకర్తలగు శ్రీ రావుగారీరచన నుత్తమముగా మెచ్చుకొనునట్లుగా ఉపయుక్తమగునట్లుగా రచించినారు. భారతీయ రాజ్యాంగములోని మూడవభాగము మన దేశ శాసనములందేకాదు ప్రపంచ శాసనములందెల్లను మకుటాయమానమైనట్టిది. ఆ భాగమును నొక యవసరమునుబట్టి తెనుగులోని కనువదింప ప్రయత్నించి రెండు సూత్రాలనువదించువరకు కుక్కిరిబిక్కిరియై తుదకు ప్రకరణము ముగియు వరకు "అయ్యవారిని (వినాయకుని) చేయబోయి కోతినిచేసె" నన్న సామెతకు గురియగుదునని తెలివితెచ్చుకొని వదలివేసితిని. అట్టి కఠిన శాసనములోని విషయములను శ్రీ రావుగారు సులభశైలిలో చక్కగా నవగాహనమగు రీతిగా నాకర్షణీయముగా రచించినారని యుపచార వాక్యముగా కాక సత్యమునే చెప్పుచున్నాను.

ఈ సందర్భములో భారతీయ రాజ్యాంగములోని విశిష్టతలను గురించి దాని కాధారమైన వెనుకటి ఘట్టములనుగురించి కొన్ని వాక్యాలలో నివేదించుకొనుచున్నాను.

క్రీ. శ. ౧౭౫౭ లో ఇంగ్లీషువారు ప్లాసీ యుద్ధమును మోసముతోను, మద్రాసీ సైన్యాలతోను గెలిచి బెంగాలుదేశమునంతయు పరిపాలించుకొనిరి. ఆనాడు మన కత్తి వంగిపోయెను. మరల క్రీ. శ. ౧౮౫౭లో భారతీయులు మహా విప్లవమును స్వాతంత్ర్యమునకై లేవదీసి పోరాడి ఓడిపోయిరి. ఆనాడు మన కత్తి విరిగెను. భారతదేశము పూర్తిగా ఇంగ్లీషువారికి దాస్యము నంగీకరించెను. క్రీ. శ. ౧౮౮౫—లో అఖిలభారత జాతీయ కాంగ్రెసు స్థాపితమయ్యెను. అదే భారతీయ జాతీయతకు నాంది. నాటినుండి జాతీయ భావవికాసము దినదినాభివృద్ధి గాంచెను. యూరోపు ఖండములో ఫ్రాన్సులో జాతీయ ఫ్రెంచి విప్లవము (౧౭౮౯) నుండియు; జర్మనీలో బిస్మార్కు కాలము నుండియు, ఇటలీలో మాజినీ, గారిబాల్డీ (౧౮౫౭ ప్రాంతము) కాలము

నుండియు, తుర్కీలో ౧౯౧౯ లో కమాల్‌పాషా కాలమునుండియు, రష్యాలో టాల్‌స్టాయి, లెనిన్ (౧౯౦౦ తర్వాత) కాలమునుండియు, అమెరికా (యు. ఎస్. ఏ) లో దాని స్వాతంత్ర్య సమర విజయము (౧౭౭౬) నాటి నుండియు ఐర్ దీవిలో ౧౯౭౦ ప్రాంతమునుండియు నేర్పడెను.

ఈ లెక్కచొప్పున మన మేమంత తీసికట్టుగా లేము. మన మింగ్లీషు వారికి దాసులమైయుండినను రష్యాలో జార్ నిరంకుశ చక్రవర్తుల రాక్షసత్వాలకు జార్ దేశీయ ప్రజలు గురియై బాధపడినంత పడలేదు.

తుదకు ౧౯౪౭ ఆగష్టు ౧౫ నాడు భారత దేశము స్వతంత్ర దేశమయి స్వయముగా తనకు నచ్చిన రాజ్యాంగ విధానమునేర్పాటు చేసుకొనెను. దాస్యబాధ నొందిన దేశముకాన ప్రజాధికారముల కగ్ర స్థానమిచ్చెను. మన రాజ్యాంగ విధానములోని మూడవ యధ్యాయములో ప్రజాధికారములను సుస్పష్టముగా విపులముగావివరించినారు. ఇంగ్లండున కిట్టి రాజ్యాంగమే లేదుకాని యచ్చట రాజకీయాచారములకు ప్రాముఖ్యముండుటచే నివన్నియునందు కార్యరూపమున నున్నవి. ఫ్రెంచివారు, అమెరికావారును, ఐర్ వారును నిరంకుశత్వమువల్లను, పరాధీనతవల్లను బాధపడిన వారుకాన వారు తమ రాజ్యాంగ విధానములో ప్రజాధికారములకు నిబంధించి యుంచిరి. వారివలెనె మనమును దాస్యవిముక్తిని పొందినందున వారి నాదర్శముగా నుంచుకొని వారి నిబంధనల నాధారపరచుకొని ప్రజాధికారములను నిబంధించినాము. ఇంగ్లీషువారి రాజకీయ విధానములలో బెరిగి యలవాటుపడినందున మన రాజ్యాంగ విధానము ఇంగ్లీషు విధానము ననుసరించినది.

మనదెట్టి రాజ్యము అన్నది బాగుగా తెలుసుకొనవలెను. రాజ్యాంగ విధానారంభమందే ఇండియా ప్రభుత్వము (Sovereign-democratic Republic) స్వతంత్ర ప్రజాతంత్రవై రాజ్యమని చెప్పినారు. ఇంగ్లీషు లోని రిపబ్లికు పదమునకు హిందీలో గణరాజ్య

మన్నారని వినవచ్చినది. కాని మన ప్రాచీనులు రిపబ్లికులను (రాజులేని రాజ్యాలను) వైరాజ్యములనిరి. బుద్ధభగవానుని కాలమునకు పూర్వమే ఉత్తర హిందూస్థానమందు ఒకటికాదు రెండుకావు బహువైరాజ్యము లేర్పడి యుండెను. బుద్ధుని కాలమందు ప్రబలి అగ్రరాజ్యములై యుండిన లిచ్ఛవిక, కునింద, మాళవ ప్రముఖ వైరాజ్యముల చరిత్ర ప్రఖ్యాతమై నట్టిదేకదా. అది 2500 ఏండ్లనాటి కథ. మరల యీనాడు మన దేశ మాతయు వైరాజ్య సిద్ధిపొందినది.

ఇట్టి రిపబ్లికు యొక్క రాజ్యాంగ స్వరూపము నేటి రాజకీయ పరిభాషలో చెప్పవలసి నప్పుడు మనది కొంత ఫెడరల్ (సమాఖ్య) యనియు కొంత యూనిటరీ (ఏకైక) యనియు చెప్పవలెను. మన దేశమును ఇండియన్ యూనియన్ అనుటచేతను, పౌరత్వము భిన్న సంస్థానములకు భిన్నములుకాక ఏకైక భారతీయ పౌరత్వమగుటచేతను న్యాయస్థాన విధానము లొకటే యగుటచేతను, సివిల్ క్రిమినల్ మొదలగు శాసనములు దేశమునకంతయు నొకే తీరునను డుటచేతను, అసాధారణ పరిస్థితులలో కేంద్రమునకే సంపూర్ణాధికారములు సంక్రమించు నిబంధనలుండుటచేతను యూనిటరీ విధానమతికినది. కాని తక్కిన విషయములందంతటను మన దేశమునకు ఫెడరల్ విధానము నిర్ణయమైనది.

మన రాజ్యాంగ నిర్మాతలు, ఇంగ్లండు, రష్యా, ఫ్రాన్సు, అమెరికా, ఐర్, మున్నగు దేశాల విధానముల దృష్టిలోనుంచుకొన్న వారగుటచే పైవాటిలోని ఛాయలు పలుమారు మన విధానమందేర్పడినవి. మన ప్రెసిడెంటు (అధ్యక్షుడు) అమెరికావంటివాడే కాని యితడు ప్రజా ప్రతినిధులగు మంత్రుల మాట వినువాడే! అనగా ఇంగ్లండు రాజువలె శాసనబద్ధుడైనవాడు. మనసుప్రీంకోర్టు (గరిష్టన్యాయస్థానము) మరల అమెరికా ననుకరించెను. కాని మన కోర్టుకే ఎక్కువ యధికారాలున్నవి. ఇదివరలోని ప్రీవికౌన్సిల్ అధికారాలను కలిగి పైగా రాజ్యాంగ విధాన సక్రమాచరణ విచారణను, ముఖ్యముగా ప్రజాధికార సంరక్షణను, చేయునట్టిది. అది సర్వతంత్ర స్వతంత్రమైనట్టిది.

బహు ఫెడరల్ విధానాలలో స్థిరత్వమునకు ప్రాముఖ్యమిచ్చి వారు. మన విధానములో సట్టి పట్టింపు లేదు. (దీనినే ఇంగ్లీషులో Flexible అందురు.) అవసరమగునపుడో రాజ్యాంగవిధానమున మార్పులు చేయుట కంగీకరించినారు. ఇవి సంగ్రహముగా తెలుపదగిన మన రాజ్యాంగ విశిష్టతలు. మన శాసనసభలు ఇంగ్లీషువారి రెండు పార్లమెంటు శాఖల యను కరణములు. రెండు సభలుండుట యవసరమాయన్నది సాఢింగ్లండులో చర్చితమగుచున్నది. లార్డ్సు శాఖ అనవసరమని వాదించుచున్నారు. అటు మన రాజ్యాంగములో రెండు శాసన సభల యవసరము కానరాదు. ఋగ్వేద కాలములో రాజును శాసనబద్ధముగా చేసినట్టివి సభ, సమితి యను రాజకీయ చర్చాసంఘములు. ఈ రెండును ప్రజాపతియొక్క కవల పిల్లలని మన ప్రాచీనులు వర్ణించిరి.

బుద్ధునికాలములో, వైరాజ్యములందును, గణములందును, బుద్ధానంతరము బౌద్ధ సంఘములందును ప్రజా ప్రతినిధుల యెన్నికలు, వోట్లు, సభాచర్చలు, అధికసంఖ్యాకచ్ఛందముచే విషయనిర్ణయ మగుచుండెను. బౌద్ధసభల యెన్నికలలో వోట్లను శలాకలనియు, ఛందములనియు పేర్కొనిరి. పాణినీయములో రాజసభను పరిషత్ అనిరి. అందలి సభ్యులను పారిషద్యులు (iv. 4,4..) అనిరి. రాజసభతో కూడిన రాజును (King in Council) పరిషద్వలుడనిరి. (v. 2, 112) అధ్యక్ష, వ్యావహారిక, ఔపాయికవంటి రాజకీయ పదములును పాణినీయమందు కలవు.

ఇట్లెత్తిచూపుట యేలసనగా మనకు ప్రాచీనమందు శాసన సభలు, ఎన్నికలు, గరిష్ఠసంఖ్యానిర్ణయము, రాజ్యాంగ వ్యవస్థ మున్నగునవి దేశమంతట కాకున్నను కొన్ని తావులందుండెనని నిరూపించుటకే! శ్రీ వేంకటేశ్వరరావుగారు రచించిన యీ గ్రంథమందు మొదటి ౨౮ పుటలలో ఇంగ్లీషువారి దేశాక్రమణము, వారి పరిపాలనము, మన ముక్తిమార్గము సంక్షేపముగా నవసరమున్నంత తెలిపి

నారు. తక్కిన ప్రకరణాలలో రాజ్యాంగవిధాన ముఖ్యాంశములను సులభముగా నర్థమగునట్లు వెల్లడించినారు.

ఈ గ్రంథము రాజ్యాంగముయొక్క అనువాదము కాదు. ఇది దాని చక్కని సమీక్ష.

దీనిని రచించిన శ్రీ వేంకటేశ్వరరావు గారు తెనుగులోని రాజకీయ వాఙ్మయమునకు సహాయము చేసినారు. దీనిని ప్రకటించిన ఆంధ్రసారస్వతపరిషత్తువారు పాఠకుల ప్రశంసలకు పాత్రులైనారు.

౧౫-౨-౫౧ సురవరము ప్రతాపరెడ్డి.

# ఉపోద్ఘాతము

సనాతన ఆర్యధర్మములకు వేదము లాధారమైనట్లు ఆధునిక రాజకీయ పౌరజీవనమునకు రాజ్యాంగవిధానము మూలకందము. శాసనబద్ధమైన మనసంఘములో సక్రమముగ నడచుకొనవలెనన్న రాజ్యాంగవిధాన మూలసూత్రములను సమగ్రముగ తెలుసుకొన వలెను. సకలశాసనములు సర్వాధికారములు నియమములు, నిబంధనలు రాజ్యాంగవిధానముపై ఆధారపడి, అందుండి ఉత్పన్నమగుచున్నవి. అధ్యక్షుడు, మంత్రిమండలి, గవర్నర్లు, రాజప్రముఖులు, ఉద్యోగస్థులు, సామాన్యపౌరులు, న్యాయమూర్తులు అందరు రాజ్యాంగవిధానమునకు లోబడినవారై ప్రమాణస్వీకారము జేయుచున్నారు. ప్రజల ఐహికజీవనము రాజ్యాంగవిధాన మహాత్వముచే ఆవరింపబడియున్నది. "నావిష్ణుః పృథ్వీపతిః"అను ధర్మసూత్రములో రాజ్యాంగవిధానము పృథ్వీపతిస్థానము నాక్రమించి విష్ణుత్వము నొందినది. అధ్యక్షుడు, ప్రధాని మున్నగువారు దాని ఆదేశముల పాలించు కార్యకర్తలుమాత్రమే. కార్యకర్తలు అయిదుసంవత్సరముల కొకపరి మారుచుందురు; కాని రాజ్యాంగవిధానమునకు, యుగధర్మమునకువలె కొంత శాశ్వతత్వముగలదు.

భారతదేశములో 15. ఆగస్టు 1947లో నూతనయుగారంభమైనది. ఇది స్వతంత్ర పరిజాయుగము. అంతకుపూర్వముది పారతంత్ర్యయుగము. గాంధీమహాత్ముడు, యీ నూతనయుగమునకు కర్త—యుగపురుషుడు. భారతజాతీయ పితయని సగర్వముగ నతనిని మనము పేర్కొనుచున్నాము.

ప్రస్తుత రాజ్యాంగమును భారత రాజ్యాంగపరిషత్తు సిద్ధము జేసినది. రాజ్యాంగము ఒక విధానము మాత్రమే. రాజ్యాంగము

యొక్క విజయము దానిని నడపించు వ్యక్తులపై నాధారపడియుండును. అట్టి వ్యక్తులు సమర్థులేగాక, స్వార్థరహితులుగూడ నై యుండవలెను. ఆ వ్యక్తుల నెన్నుకొనువారు ప్రజలు కావున ప్రజలు తమ యధికారములను, బాధ్యతలను చక్కగా గుర్తెరుంగవలెను. ప్రజలు తమ ప్రతినిధుల నెన్నుకొనుటలో నీరక్షీర వివేకన్యాయము పాటించిననో ప్రజాప్రభుత్వము సమర్థవంతమే గాక సౌఖ్యావహముగూడ నగును. స్వాతంత్ర్యము యొక్క పరమావధి ప్రజాసౌఖ్యము, దేశశాంతి.

మన రాజ్యాంగములోని ప్రధానాంశముల సంగ్రహముగ ప్రజలకు తెలియజేయుట యీ పుస్తకముయొక్క ఉద్దేశము. సమగ్రముగ తెలుసుకొనగోరువారు భారత రాజ్యాంగవిధానము, మూలమునే చదువవలెను. ఆంధ్ర సారస్వత పరిషత్తు, హైందరాబాదువారి ప్రవేశపరీక్ష విద్యార్థులకు, భారత రాజ్యాంగ విధానమును గూడ బోధించుట అవసరమని భావింపబడు చున్నందున, వారికీ గ్రంథము ఉపయుక్తముగ నుండగలదు.

గ్రంథరచనయందు పలువిధముల తోడ్పడిన శ్రీ దేవులపల్లి రామానుజరావుగారికి నా కృతజ్ఞతాపూర్వక ధన్యవాదములు.

పర్సా వేంకటేశ్వరరావు

హైదరాబాదు-(దక్కను) 24-5-1951 } ఆంధ్ర సారస్వత పరిషత్తు కార్యాలయము రాంకోటి - సుల్తానుబజారు.

# భారత రాజ్యాంగవిధానము

హిందూ దేశముతో వర్తకవ్యాపారములు సాగించుటకు ఇంగ్లాండు దేశమందు, ఎలిజబెత్తు రాణిగారి అనుజ్ఞతో, 12 డిసెంబరు 1600 సంవత్సరమున యీస్టుఇండియా కంపెనీ స్థాపించబడినది. ఈకంపెనీ, స్థాపనతో ఆరువేల మైళ్లదూరమందున్న అత్యల్ప భూభాగమగు ఇంగ్లాండునందుగల వర్తకజాతితో, రత్నగర్భ, విజ్ఞానఖనియగు భారత వర్షమునకు సంబంధము యేర్పడినది. ఈ కంపెనీ మొట్టమొదట తన వర్తకమునకు కావలసిన భూమిని స్థానిక పరిపాలకులనుండి కౌలుకు తీసికొన ప్రారంభించినది. మదార్సు, సూరతు పట్టణములను యీ విధముగానే కౌలుకు తీసుకొని అచ్చట సురక్షితములైన గిడ్డంగులను యేర్పరచి, వాటి రక్షణకొరకు కొంత సైన్యమును నియమించినది. తూర్పు తీరమునందు మచిలీపట్టణములో 1611లో ఒకఫ్యాక్టరీ స్థాపించబడినది. ఆనాడు మచిలీబందరు గోలకొండ రాజ్యమునకు ముఖ్యమైన రేవుపట్టణము. 1612లో సూరతునందు, 1639లో చెన్నపట్టణమందు యీ కంపెనీవారు కోటలనుగట్టుకొనిరి. హుగ్లీయందు కోటను నిర్మించుటకు 1640లో అనుజ్ఞనొంది 1690లో కలకత్తాయందు స్థావరమేర్పరచుకొనిరి. ఇంగ్లండు రాజగు రెండవ చార్లెసు రాజునకు వివాహకట్నముగ బొంబాయి పోర్చుగల్ రాజుచే నొసంగబడెను. ఆయన ఈపట్టణమును 1669లో కంపెనీవారికి సాలుకు 10 పౌనులఅద్దెకిచ్చెను.

ఈ విధముగా హిందూ దేశములో సమకూర్చుకొనిన స్థలములలో సివిలు, మిలటరీ, అధికారములను వినియోగించుటకు క్రమముగా

సీమ దేశపురాజునుంచి కంపెనీకి రాజ్యాధికారము సంక్రమించెను. గట్టి పునాదులపై ఆధారపడిన ఇంగ్లీషు రాజ్యసౌధమును హిందూదేశములో నిర్మించుటకు కావలసినట్టి సివిలు, మిలిటరీ యధికార సమన్వితమగు రాజ్యాంగమును మరియు అందుకు వలయు ఆదాయము వచ్చునట్టి యేర్పాట్లను గావించుటకును, ఈకంపెనీ డైరక్టరులు 1697వ సంవత్సరమున తీర్మానించుకొనిరి. 1688 తరువాత ఈ కంపెనీ బ్రిటీషుపార్లమెంటుకు చాలా ధనము అప్పుగానిచ్చి ప్రతిఫలరూపముగా హిందూస్థానముతో వర్తకముచేయు అనుమతితోపాటు రాజ్యాధికారమును వినియోగించు అనుజ్ఞనుకూడ పొందెను. తత్ఫలితముగా 1688 నుండి కంపెనీ వ్యవహారములను ఇంగ్లండు పార్లమెంటు సరిదిద్దుచు కంపెనీ పరిపాలనకు బాధ్యతవహించుచు వచ్చినది.

ఇండియాలో కంపెనీవారికిని, వీరి శత్రువర్గమునకును జరిగెడి యుద్ధములలో సంక్రమించిన సామగ్రులను కంపెనీవారు తీసుకొనునట్లును, బ్రిటీషుసేనలు సంగ్రహించు సామగ్రిని ఆంగ్లేయరాజు తన యిష్టానుసారము పంచిపెట్టుటకును 1758 లో కంపెనీకి అధికార పత్రమొసంగబడినది. ఈ యధికారపత్రము ననుసరించి భారతదేశములోని రాష్ట్రములవశపరచుకొనుటకును రాజులతో సంధిగావించుకొనుటకును తదితర విధముల రాజ్యవ్యాప్తి కార్యములను జేయుటకును అధికారము కంపెనీకి సంక్రమింపజేయబడినది. ఈ విధముగ 1765 సంవత్సరము వరకు కంపెనీ యొక్క వర్తకవ్యాపార వ్యాప్తికిని రాజ్యాక్రమణ కార్యకలాపాలకును, ఇంగ్లండు ప్రభుత్వ అధికార పత్రముతే ఆధారము. దీనికి ప్రతిఫలముగ కంపెనీ, ఇదివరకు పైన తెలిపినట్లు ప్రభుత్వమునకు విశేషధనము ఋణముగా నొసగుచు వచ్చినది.

కంపెనీ వర్తకము ఒక సంఘముచే (కౌన్సిలు) నిర్వహింపబడుచుండెడిది. సంఘాధ్యక్షుడు ప్రెసిడెంటని, గవర్నరని పిలువబడుచుండెను. బొంబాయి, మద్రాసు, కలకత్తా యీ మూడు ముఖ్య

పట్టణములలో వేరువేరు గవర్నర్లు నియమింపబడిరి. కాని 1861 వరకు, యిట్టి కంపెనీ గవర్నరుల పరిపాలనలో భారతీయులకు జోక్యము లేకుండెను. కావున అంతకు పూర్వపుపరిపాలనా విధానమునకు అప్రస్తుతము. 1861 లో హిందూదేశ కౌన్సిల్ల శాసనము గావింపబడినది. 1857 లో జరిగిన సైనికుల తిరుగుబాటునకు పిమ్మట హిందూదేశ ప్రజానాయకుల సమ్మతి కొంతవరకైనను తీసికొనినటుల నటింపక పోయినచో, ప్రభుత్వమును కొనసాగించుట దుర్ఘటమనియు, అశాంతి ప్రబలిపోవుననియు, నాటి ఆంగ్లేయ రాజకీయ వేత్తలు తలంచిరి. ఆ తలంపే 1861 సంవత్సరపు శాసనసభల శాసనము గావించుటకు ముఖ్యకారణము. 6 జూన్ 1861 తేదీన పార్లమెంటులో, పై శాసనమును ప్రతిపాదించుచూ, గావించిన యుపన్యాసము, ఆంగ్లేయ రాజనీతికి దర్పణముగా నున్నది.

"పలుతెరగుల భాషలు. వివిధ ఆచార వ్యవహారములు, రకరకముల మతములు గల వివిధ జాతుల ప్రజల కొరకు మనము శాసనములను గావింపవలసి యున్నది.

కొన్ని సంవత్సరములకు పూర్వము భారతీయులయందాంగ్లేయులకు గల అచంచల విశ్వాసము నేడు నశించి అవిశ్వాసము ప్రబలి పోయినది." 1862 నుంచి 1863 వరకు లార్డు ఎల్గిన్ వైస్రాయిగా నుండెను. ఈయన ఆంగ్లేయుల రాజనీతిని యీ విధముగా విశదమొనర్చినాడు. "సర్వాధికారము గలిగియున్న ప్రభుత్వ ప్రతినిధిగా, హిందూదేశమున శాంతి నెలకొల్పుట నావిధి. ఇందుకొరకు అపార సైన్యము, నా వశమున నున్నది. అవసరమైన యెడల ఈసైన్యమును అశాంతి నణగద్రొక్కుటకొరకును, అశాంతి కారకులగువారిని శిక్షించుటకొరకును వినియోగించుటకై వెనుదీయను."

బ్రిటిషువారి దండ నీతి ఫలితముగ, హిందూదేశమునందశాంతి ప్రబలి యుండెను. 1880 నుంచి 1884 వరకు లార్డు రిప్పన్

వైస్రాయిగ నుండెను. ఈ కాలమందే భారత జాతీయ కాంగ్రెసు ప్రారంభించబడినది. 1884 నుంచి 1888 వరకు లార్డు డఫ్రిన్ వైస్రాయిగా నుండి, "కాంగ్రెసు తన తీర్మానముల ద్వారా గోరుచున్న కోర్కెలు అమితముగ నున్నవి. వానిని అణగ ద్రొక్కవలయునని" అభిప్రాయపడెను. తమ రాజ నీతిజ్ఞతను కనబరచుచు ఆయన "నేడు పశుబలముద్వారా గావింపబడుచున్న ప్రభుత్వచర్యలకు భారతీయుల సలహా సంప్రదింపులతో ఆమోదముద్ర లభించిననాడు ప్రజానుమతిని పొందినవిగా పరిగణింపబడును. అందులకై భారతీయులకు శాసనసభలలో స్థాన మొసంగవలెనని" తలచెను.

ఈ ఉద్దేశ్యముతో 1892లో 1861నాటి శాసనసభల శాసనము సంస్కరింపబడినది. 1909లో మరికొన్ని సవరణలు గావింపబడినవి. అందు ప్రశ్నల నడుగుటకు నావకాశ మొసంగబడినది. ఆదాయవ్యయ శాసనమును విమర్శించుట కధికార మొసంగబడినది.

డిసెంబరు 1909లో పార్లమెంటులో సంస్కరణలు హిందూ దేశములో ప్రకటింపబడినవి. జనవరి 25 1910 తేదీన యీ సంస్కరణల శాసనము ననుసరించిన నూతన శాసనసభ నెలకొల్పబడినది.

భారతదేశమున ఆంగ్లేయులుచేసిన రాజ్యాంగ సంస్కరణలను వివరించుటకు ముందుగా ఆంగ్లరాజ్యస్థాపనాఫలితముగా భారతదేశమున కలిగిన పరిణామము యీ సందర్భములో మనము గమనించవలసి యున్నది. మన దేశములో బ్రిటీషుపరిపాలన సుస్థిరమగుటకు మూల కారణము దేశములోని అంతఃకలహాలేననుటకు నిస్సంశయము. మన దేశ పరిపాలకుల పరస్పర కలహాలను ఒక మంచి అవకాశముగా తీసుకొని బ్రిటీషువారు తమ ప్రభుత్వమును ఇక్కడ సురక్షితముగా స్థాపించిరి.

ఇంగ్లండు దేశములో ఉత్పత్తియైన సరకులను విక్రయించుటకు ఆంగ్లేషువారికొక మంచి అంగడి అవసరమయ్యెను. ఇందుకొరకు

ఇండియా వారికి చక్కగా ఉపయోగించెను, సామ్రాజ్యవాంఛలకన్న వర్తకవ్యాప్తి ఇంగ్లీషువారి ప్రధానాశయమై యుండెను.

భారత దేశములో ఇంగ్లీషువారి పరిపాలనవలన ఇక్కడి పరిశ్రమలకు తీవ్రమైనదెబ్బ తగిలినది. నిజానికి స్థానిక పరిశ్రమలు పూర్తిగా నశించినప్పుడు బ్రిటీషు సరకుల విక్రయమునకు అవకాశము లభించును. ఈ ఉద్దేశముతో బ్రిటీషుప్రభుత్వము ఇక్కడి పరిశ్రమలను నాశనము చేయుటకై సర్వవిధముల యత్నించినది. రాజకీయముగా తన పరిపాలనను స్థాపించుకొని ఆర్థికముగా, పారిశ్రామికముగా, వైజ్ఞానికముగా భారతదేశమును బ్రిటీషువారు అణచివేసిరి.

ఈ సత్యమును గ్రహించిన కొందరు దేశభక్తులు భారతదేశ స్వాతంత్ర్యముయొక్క ఆవశ్యకతను గ్రహించి దేశోద్ధరణకై కృషిని ప్రారంభించిరి. ఇట్టి మహనీయులలో రాజా రామమోహనరాయలు ముందెన్నదగినవాడు. మనదేశములో జాతీయోద్యమమునకు అంకురార్పణ రామమోహనరాయల కృషితోనే ప్రారంభమైనదని చెప్పవచ్చును. తరువాత భారతజాతీయ కాంగ్రెసు స్థాపన జరిగి, భారతదేశ పరిపాలనలో ప్రజలకు యెక్కువ సంబంధము కలిగించుటకై ప్రయత్నాలు చేయబడినవి. బ్రిటీషుపరిపాలనవలన మనదేశమునకు కలిగినఅనర్థకములనుగూర్చి గ్రంథరచనగావించిన దాదాభాయినౌరోజి, గోఖలే ప్రభృతులు భారతజాతీయకాంగ్రెస్‌లో ప్రధానపాత్రలను వహించిరి. క్రమక్రమముగా భారతజాతీయకాంగ్రెస్ ఒక మహాసంస్థగా రూపొందింది. లోకమాన్య బాలగంగాధరతిలక్, మహాత్మాగాంధీ, జవహర్లాల్ నెహ్రూ, సుభాష్‌చంద్రబోస్ మొదలైన మహానాయకుల నేతృత్వమున బ్రిటిష్ నిష్క్రమణకై కృషిగావించి, భారతదేశ స్వాతంత్ర్యమును సాధించినది.

ఒకవంక దేశస్వాతంత్ర్యమునకై అలజడివ్యాపించి, పోరాటము జరుగుచుండగా, మరొకవంక బ్రిటిష్‌వారు అప్పుడప్పుడు కొన్నిస్వల్ప

రాజ్యాంగ సవరణలను ప్రవేశపెట్టి, ప్రజలను సంతృప్తిపరచుటకై ప్రయత్నించిరి. ఈస్వల్పసంస్కరణలయొక్క స్వరూపమును యీ సందర్భమున మనము పరిశీలించుట అవసరము.

# భారత రాజ్యాంగ విధానము

భారతీయుల సలహా సంప్రదింపులతో, భారత ప్రజాపాలనము జేయవలెనను ముఖ్యసూత్రము, మోర్లే, మింటో సంస్కరణలద్వారా 1909 లో, ఆంగ్లేయులు మొదటిసారి గుర్తించిరి. అంతకు పూర్వపు భారతప్రభుత్వ చరిత్రతో మనకంత పనిలేదు కాని 1909 నుంచి, భారతీయుల స్వాతంత్ర్య పిపాస నానాటికి హెచ్చుదొడగెను. పరిపాలనలో ప్రజలకు ప్రాతినిధ్యము కావలెనన్న కోరికతోపాటు క్రమేపి, భారతీయులలో, పాశ్చాత్య స్వాతంత్ర్య భావములు గూడ మొలకలెత్తెను. 1777 కు పూర్వము నేటి అమెరికాప్రజలు, ఆంగ్లేయుల పరిపాలనకు లోబడి యుండిరి.

"ప్రజాప్రతినిధి సభలో ప్రాతినిధ్యము లేనిదే పన్నులు చెల్లించము". ( No taxation without representation ) అను నినాదమును అప్పుడు వారు స్వాతంత్ర్య భావపూరితులై జేసియుండిరి. అమెరికా ప్రజల వాంఛలు సక్రమమైనవని బర్కు మహాశయుడు పార్లమెంటులో వాదించియుండెను. అతని సహేతుక వాదమును, ఆంగ్లేయ ప్రభువులు పెడచెవిని బెట్టిరి. తత్ఫలితముగా, ఆంగ్లేయ ప్రభుత్వమునకు, అమెరికా ప్రజలకు మధ్య తీవ్రయుద్ధములు జరుగగా, జార్జి వాషింగ్‌టన్, అమెరికన్ ప్రజల సేనానిగా నుండి, ఆంగ్లేయ ప్రభుత్వ సైన్యముల నోడించి, అమెరికా స్వాతంత్ర్యమును, శాశ్వతముగ నెలకొల్పెను. ఇదేవిధముగా స్వతంత్ర వాంఛలు భారతీయ యువకుల రక్తనాళములలో జనించిపోయి, అమెరికా ప్రజల వలెనే, మనమును

స్వాతంత్ర్యము నార్జించవలెనని వారు కోరసాగిరి. భారతీయులలో వచ్చిన, ఈ మార్పును గమనించి, ఆంగ్లేయ ప్రభువులు కలవరపడిరి.

మొదటి ప్రపంచ యుద్ధకాలములో, ఆంగ్లేయ ప్రభుత్వమునకు ఇండియా సెక్రెటరీగా నున్న మాంటేగ్యూ, అప్పుడు మన దేశమునకు వైస్రాయిగానున్న చెమ్స్‌ఫర్డ్ ప్రభువును సంప్రదించి 20 ఆగస్టు 1917 నాడు, పార్లమెంటులో, భారత దేశమును గురించి, ఒక ముఖ్య ప్రకటన గావించెను.

"The Policy of His Magisty's Government, with which the Govt., of India are in complete accord, is that of 'the increasing association of Indians' in every branch of the administration, and the gradual development of self governing institutions, with a view to the progressive realisation of responsible Govt; in India, as an integral part of the British Empire". (బ్రిటిష సామ్రాజ్యములోని అంతర్భాగముగా, భారతదేశమునకు, క్రమక్రమముగా బాధ్యతాయుత ప్రభుత్వమును ప్రసాదించు నుద్దేశ్యముతో, స్థానికసంస్థలను క్రమాభివృద్ధిలోనికి తీసికొనివచ్చుటకును, భారతీయులను వివిధ పరిపాలనావిధానములో యెక్కువగా జేర్చుకొనుటకును సార్వభౌముల ప్రభుత్వము నిర్ణయించినది. భారత ప్రభుత్వము, యీ నిర్ణయమును అంగీకరించినది) భారతదేశ భవిష్యత్ పరిణామ మెట్లుండగలదో యిందు భావగర్భితముగ సూచింపబడినది. భారతీయులు బాధ్యతాయుత ప్రభుత్వమునకు అర్హులేగాని అది యిప్పుడేగాదు, ప్రజాస్వామ్య సూత్రములు, భారతీయులకు క్రొత్త గావున, గురుముఖముగా వానిని ఆంగ్లేయులవద్ద నభ్యసించవలెను. వానిని మననముజేసికొని క్రమముగా ఆచరణలో బెట్టవలెను. సంపూర్ణ బాధ్యతాయుత ప్రభుత్వ మెప్పుడు లభింపగలదో యను కాలనిర్ణయముమాత్రము గావింపబడలేదు భారతీయుల అర్హతను

నిర్ణయించునది. బ్రిటిషుప్రభుత్వమే గావున, చెప్పినట్లు వినినయెడల భారతీయులు, స్వాతంత్ర్యమునకు అనర్హులని ప్రకటించవచ్చునుగూడ. ఏది యెట్లున్నను తుదినిర్ణయము బ్రిటిషుప్రభుత్వము చేతిలో నేగలదు. అదిగాక భారతదేశ మెల్లప్పుడు, బ్రిటిషుసామ్రాజ్యములో అంతర్భాగముగానే యుండవలెను. అమెరికా సంయుక్తరాష్ట్రములవలె విడిపోవుటకు వీలులేదు.

ఈ విధముగ బహు బంధనములతో గూడుకొనిన బాధ్యతాయుత ప్రభుత్వము, 1919 భారత రాజ్యాంగచట్టముద్వారా ప్రసాదించబడినది. దీనినే ''ద్వంద్వ పరిపాలన'' మందురు. అసంఖ్యాక దేశీయ సంస్థానములకు యీ చట్టము వర్తించదు. మిగతా దేశము పది గవర్నరు పరిపాలిత రాష్ట్రములుగా విభజింపబడెను. ఈ చట్టముప్రకారము ప్రతిగవర్నరుకు రెండువిధముల సలహాదారు లుందురు (1) కార్యాచరణ సంఘము (2) మంత్రిమండలి. ప్రభుత్వ వ్యవహారములన్నియు రెండుభాగములుగ జేయబడి అందు కొన్నిమాత్రమే మంత్రిమండలి వశము చేయబడెను. ప్రతిరాష్ట్రమునకొక శాసనసభ యేర్పాటు చేయబడెను. మంత్రిమండలి తాముచేయు పనులకు, శాసనసభ యెదుట బాధ్యత వహింపవలసియుండెను. కాని యీ మంత్రిమండలికి దత్తము చేయబడని ప్రత్యేకవ్యవహారములను, గవర్నరు, కార్యాచరణ సంఘసభ్యులసలహాతో నిర్వహించుచుండెను. ఇట్టి ప్రత్యేకాధికారములను, గవర్నర్ మరియు ఆయన కార్యాచరణసంఘము కేంద్రప్రభుత్వపు ఆజ్ఞల ననుసరించి, వినియోగించుచుండెను. కేంద్రమున రెండు శాసనసభలు యేర్పడెను. గాని మంత్రిమండలి నియామకము జరుగలేదు. గవర్నరు జనరలు కార్యాచరణ సంఘసభ్యుల నియమించి, వారి సహాయముతో పరిపాలనసాగించుచుండెను. ఈ సంఘసభ్యులు కేంద్ర శాసనసభకు బాధ్యులుగారు.

1919 లో ప్రతిపాదింపబడిన భారత రాజ్యాంగచట్టము, భారతీయులకు తృప్తిగలిగించలేదు. కేంద్రమున బాధ్యతాశూన్యమైన నిరం

కుశ ప్రభుత్వము, రాష్ట్రములలో, ప్రజా ప్రతినిధి సంస్థలకు సంకుచితాధికారములు ప్రజల మన్ననను పొందలేదు. ప్రజలు తమ అసమ్మతిని బహిరంగముగ తెలుపఁబోఁగా, పాలకులు శాసనమును ప్రయోగించి, ప్రభుత్వము, బహిరంగసభలను బలాత్కారముగ చెల్లాచెదరు గావించెను. ముఖ్యముగ పంజాబులో ప్రభుత్వ నిర్బంధములు మితిమీరిపోయెను. ప్రభుత్వచర్యలకు నిరసన సూచకముగ, గాంధీమహాత్ముని యధ్వర్యమున సహాయనిరాకరణోద్యమము ప్రారంభమైనది. కొన్ని వేలమంది భారతీయులు చెరసాలలలో బంధింపఁబడిరి. దేశములో అశాంతి, ప్రభుత్వముపట్ల నిరసన మిక్కిలి యధికమయ్యెను. అపుడు నీతికోవిదులగు ఆంగ్లేయుల ప్రభుత్వము దేశపరిస్థితినిగమనించి భారతీయుల రాజ్యాంగ తను పునఃపరిశీలించుటకై సైమను కమీషనును నియమించెను ఈ కమీషన్ను భారతీయులు సంపూర్ణముగా బహిష్కరించిరి. అయినప్పటికి కమీషన్ వారు, భారతీయులకనుకూలమగు కొన్ని ముఖ్యసూచనలు గావించిరి. రాష్ట్రములలో ద్వంద్వ పరిపాలనమంత మొందించి, సంపూర్ణ బాధ్యతాయుత ప్రభుత్వము నెలకొల్పవలెననియు, కేంద్ర ప్రభుత్వము రాష్ట్రముల సమాఖ్యగా నుండవలెననియు(Fedaration of States); భారత దేశమునకు అధినివేశ ప్రతిపత్తి నొసంగవలెననియు, భారత దేశ సమాఖ్యలో దేశీయసంస్థానములను గూడ చేర్చుకొనవలయుననియు వారు సూచించిరి. 1929, అక్టోబరు 31వ తేదీన లార్డు ఇర్విన్, భారత దేశమునకు అధినివేశ ప్రతిపత్తి నొసంగ గలమని బహిరంగముగ ప్రకటించెను. అందుకు అవసరమైనవివరాలను చర్చించుటకై ఇంగ్లండులో రౌండ్ టేబుల్ కాన్ఫరెన్సు ( గుండ్రబల్ల సమావేశము ) యేర్పరచబడెను.

ఈ లోపుగా భారతీయుల ఆశయములలో మార్పు వచ్చెను. 1929 లో జరిగిన లాహోరు కాంగ్రెసులో, "సంపూర్ణ స్వరాజ్యము" భారతీయుల పరమావధి యని నిశ్చయింప బడెను. ఒక సంవత్సరము లోగా సంపూర్ణ స్వాతంత్ర్య ప్రదానము జరుగనిచో తిరిగి సహాయ నిరాకరణోద్యమము, ప్రారంభించబడునని ప్రకటిం

బడెను. ఆంగ్లేయులు, భారతీయులకోరికను మన్నింపలేదు. గాం మహాత్ముడు సబర్మతి ఆశ్రమము నుండి బయలుదేరి, దండిలో ఉప్ప సత్యాగ్రహమును ప్రారంభించెను. తిరిగి అసంఖ్యాకులగు ప్రజ లాఠీచార్జిలకు గురిజేయబడిరి, సుమారు లక్షమంది భారతీయులు చె సాలల కంపబడిరి. ఇట్టి క్లిష్టపరిస్థితులలో సమావేశపరచబడిన మొద రౌండుటేబిలు కాన్ఫరెన్సులో కాంగ్రెసు పాల్గొనలేదు. 1931 లో గాంధీ ఇర్విన్‌లమధ్య యొడంబడిక జరిగినతర్వాత రెండవ రౌండ టేబిలు సమావేశములో గాంధీమహాత్ముడు, కాంగ్రెస్‌కు యేకై ప్రతినిధిగా పాల్గొనెను. సమాలోచనలు జరుగుచుండగానే, భార దేశములో తిరిగి దమననీతి ప్రారంభింపబడెను. మహాత్ముడు అందుక చింతిల్లి, భారతదేశమునకు తిరిగివచ్చి మరల సత్యాగ్రహోద్యమమ ప్రారంభించెను. మూడవ సమావేశములో కాంగ్రెసు పాల్గొనలేదు

1933 లో బ్రిటిషు ప్రభుత్వము, భారతదేశ రాజకీయ ప్ర పత్తిని గురించి శ్వేతపత్రమును ప్రకటించెను. అందు చేయబడి సూచనలను జాయింటు సెలక్టు కమిటీ వారు చర్చించిన మీదట ఆ సూచన ప్రకారము బ్రిటిషు పార్లమెంటు 1935 భారతరాజ్యాం చట్టమును సిద్ధించి ఆమోదించెను.

1935 భారత రాజ్యాంగ చట్టము 1 ఏప్రిలు 1937 తేది నుం ఆచరణలోనికి వచ్చెను. కాంగ్రెసు సంస్థ ప్రతికూలత వల్ల కేంద సమాఖ్య యేర్పడనేలేదు. 260 మెంబర్లతో కూడుకొనిన కౌన్సిం ( 156 మంది రాష్ట్రములనుంచి, 104 దేశీయ సంస్థానముల నుంచి ) 375 మెంబర్లతో కూడిన అసెంబ్లీ (కేంద్ర) శాసనసభ ఇందులో 25 రాష్ట్రముల ప్రతినిధులు, 125 దేశీయ సంస్థానముల ప్రతినిధుల ఉందురు. ) యేర్పడవలెనని నిర్ణయించబడెను. దేశీయ సంస్థానము ప్రతినిధులను, సంస్థానాధీశ్వరులు నియమించునట్లు అంగీకరింపబడెను కేంద్ర (సమాఖ్య) శాసనసభకు బాధ్యత వహించిన 10 మంది మం త్రులతో కూడి గవర్నరు జనరలు పరిపాలించును, నాల్గు శాఖల మాత్రము, ప్రత్యేకముగా గవర్నరు జనరలు, ముగ్గురు సలహాదారు

సంప్రతితో నిర్వహించగలరు. వాటితో మంత్రుల కెట్టి జోక్యము ఉండబోదు. ఆ నాలుగు శాఖలు (1) దేశ సంరక్షణ. (2) విదేశ వ్యవహారములు. (3) మత విషయికములు. (4) ఆటవిక జాతులు.

కేంద్ర శాసనసభ అమలులోనికి రానందున 1946 సెప్టెంబరు 2 తేదీవరకు, పూర్వమువలెనే కార్యాచరణ సంఘము సలహాతో గవర్నరు జనరలు కేంద్ర పరిపాలన సాగించెను.

1935 రాజ్యాంగ చట్టములోని ముఖ్యభాగము రాష్ట్రముల స్వయం నిర్ణయాధికారము. ఈ చట్టము ప్రకారము రాష్ట్రములలో ద్వంద్వ పరిపాలనము త్రోసివేయబడి, మంత్రిమండలికే సర్వాధికారము లొసంగబడెను. గవర్నరుచే పాలించబడు ప్రత్యేక విషయములు రద్దుచేయబడి వాటిపైనగూడ మంత్రులకే యధికార మొసంగబడెను. మంత్రిమండలి శాసనసభకు బాధ్యత వహించుచుండినను, గవర్నరుకు కొన్ని విశేషాధికారము లొసంగబడెను. అనగా గవర్నరు మంత్రిమండలి సలహాను పాటించితీరవలెనను నియమము లేకుండెను. మంత్రులను త్రోసి రాజను యధికారము గవర్నరుకు గలదు. అట్టి ప్రత్యేక విషయములలో గవర్నరు, గవర్నరు జనరలువద్ద నుంచి సలహాను పొందును. ఈ విధముగ గవర్నరు కొన్ని యధికారముల నిరంకుశముగ నుపయోగించుటకు చట్టబద్ధముగ నవకాశము కల్పించబడెను.

1937 లో జరిగిన ఎన్నికలలో మొత్తము 13 రాష్ట్రములలో పదకొండింటియందు కాంగ్రెసుకు అధిక సంఖ్యాక బలము చేకూరెను. కాంగ్రెసు మంత్రులు యీ రాష్ట్రములలో ప్రభుత్వ స్వీకారము చేయుటకు పూర్వము గవర్నర్లు తమ ప్రత్యేకాధికారముల దుర్వినియోగము చేయరను అభయము గవర్నరు జనరలునుండి కోరిరి. అభయ ప్రదానము జరిగిన తర్వాత పదవీస్వీకార మొనరించి రెండున్నర సంవత్సరముల కాలము రాష్ట్ర పరిపాలనను కాంగ్రెసు జయప్రదముగ నిర్వహించినది.

1937 తరువాత కాంగ్రెసు, ముస్లింలీగులమధ్య తీవ్ర అభిప్రాయ భేదములువచ్చి యిరువురిమధ్య సామరస్యము పూర్తిగా నశించెను. హిందువులు ఒకజాతి, మహమ్మదీయులు వేరొకజాతి యను ద్విజాతి సిద్ధాంతము ప్రచారములోనికి తేబడెను. జాతిభేదముతో అభిప్రాయ భేదములు హెచ్చుకాగా ఐకమత్యము మచ్చునకు సహితము లేక పోయెను. ఇట్లు హిందూమహమ్మదీయుల మధ్య వైమనస్యము చెలరేగుచుండగా ద్వితీయ ప్రపంచసంగ్రామము 1 సెప్టెంబరు 1939 నాడు ప్రారంభమైనది. భారతీయుల అభిప్రాయము తీసికొనకయే, బ్రిటీషు ప్రభుత్వము ఇండియాపక్షమున సహితము 4 సెప్టెంబరు 1939 తేదిని అక్షరాజ్యములపై యుద్ధముప్రకటించెను. బలవంతముగా యుద్ధములో ప్రవేశపెట్టబడుట భారతీయుల కిష్టములేకుండెను. కావున వారు ఆంగ్లేయులను, తమ యుద్ధాదర్శములను విస్పష్టముగా ప్రకటించమని కోరిరి. బ్రిటిషు ప్రభుత్వము, ప్రపంచములో స్వాతంత్ర్యమును నెలకొల్పుట తమ యుద్దేశ్యమని తెల్పి, యిట్టిభావన ఇండియాకు వర్తించదని వాదించిరి. అయితే భారతీయులు యెందులకు యుద్ధములో పాల్గొనవలెనను ప్రశ్న సహజముగా కలిగెను. యుద్ధానంతరము తమకు స్వాతంత్ర్యము లభించనియెడల, తమ దాస్య శృంఖలలను మరింత దృఢపరుచుకొనుటకేనా, తమ రక్తమును ధారపోయుట? తనకు మాలిన ధర్మము, మొదలు చెడ్డబేరమైనగలదా? బ్రిటిషుప్రభుత్వము, కనీసము, యుద్ధాంతమందైనను భారతీయులకు సంపూర్ణ స్వాతంత్ర్యమిచ్చుటకు నిరాకరించినందున పదకొండు రాష్ట్రములలో కాంగ్రెసు మంత్రులు, తమ పదవులను వదలివేసిరి. చట్టములో 93 సెక్షనుప్రకారము రాష్ట్ర పరిపాలన గవర్నరుల హస్తగతమయ్యెను. వారు కొందరు సలహాదారులను నియమించి, వారి సహాయముతో నిరంకుశపాలనను సాగించిరి. రాష్ట్రములలో లభించిన కొలదిపాటి ప్రజాస్వామ్యముకూడ రెండున్నర సంవత్సరముల తరువాత అంతమొందెను. కాంగ్రెసు పదవీచ్యుతమైనందుకు ముస్లింలు హర్షమును వెలిబుచ్చి, దుష్టగ్రహ విముక్తి అయినట్లుగా ఉత్సవములు జరిపిరి. హిందూ మహమ్మదీయు

విద్వేషములు పెచ్చుపెరిగి 1940 లాహోరు సమావేశములో ముస్లింలు, తమకు పాకిస్తాన్ పేరుతో ప్రత్యేకరాష్ట్రము కావలెనని కోరిరి. కొలదినెలలతరువాత, బ్రిటిషు ప్రభుత్వము హిందూ మహమ్మదీయులు ఐకమత్యముతో ఏకగ్రీవముగ కోరినచో; యుద్ధానంతరము స్వాతంత్ర్యము నొసంగుటేగాక రాజ్యాంగ చట్టనిర్మాణాధికారముగూడ వారికే వదిలివేయుదుమని ప్రకటించిరి. కాని యిది కాని, పోని, మాట. హిందూ మహమ్మదీయులమధ్య వైమనస్యముల తీవ్రతనుబట్టి ఐకమత్యము అసంభవమని తెలిసియే ఇట్టి ప్రకటన గావింపబడెను.

## సర్ స్టాఫోర్డ్ క్రిప్సు రాయబారము

జూలై 1941 మాసములో గవర్నరు జనరలు కార్యాచరణ సంఘములో భారతీయులను అధికసంఖ్యాకులుగా జేర్చుకొనెదమని ప్రకటించిరి. కాంగ్రెసుగాని, ముస్లింలీగుగాని, అందు చేరలేదు. కొద్ది కాలముననే జపాను, అమెరికా నౌకాశ్రయమగు పెరల్ హార్బరు మీద విమానదాడి జరిపి, అపారమగు నౌకాదళమును ధ్వంసము జేసెను. దానితో తూర్పురంగమునగూడ యుద్ధము ప్రారంభమాయెను. సింగపూరు పతనము, బర్మా ఆక్రమణ, వెనువెంటనే జరిగెను. జపాను సైన్యములు ఇండియాలో ప్రవేశించుటకు తీవ్రప్రయత్నములు జరిపెను. జపాను విజయ పరంపర నరికట్టుట, ఆంగ్లో-అమెరికన్ మిత్రరాజ్యముల ప్రతిష్ఠ నిలబెట్టుట అత్యవసరమయ్యెను. లండనులో మంత్రిమండలి సత్వర సమాలోచనలు జరిపి, భారతదేశ సహకారము పొందుట విజయసాధనకు కీలకమని నిశ్చయించి, ఒక నూత్న పథకము సిద్ధము జేసి, భారతనాయకులతో సంప్రదింపులు జరిపి అంగీకరింప జేయుటకై సర్ స్టాఫోర్డు క్రిప్సును ఢిల్లీకి పంపిరి. క్రిప్సు రాయబార సారాంశమిది. యుద్ధానంతరము, దేశీయసంస్థాన ప్రతినిధులు, మరియు రాష్ట్ర ప్రతి

ంలత్తో గూడుకొనిన, రాజ్యాంగ నిర్మాణసభ ( Constituent
sembly ) ఏర్పరుపబడును. ఈ సభచే సిద్ధము చేయబడిన
జ్యాంగ ప్రణాళికను, బ్రిటను, అంగీకరించి, చట్టబద్ధము గావించి,
మలు పరుచును. ఇట్టి రాజ్యాంగ చట్టము యావద్భారత సమా
గా నుండగలదు. అధినివేశ ప్రతిపత్తి గలిగి, బ్రిటిషు సహకార
ాటమి ( Common wealth ) నుండి తొలిపోవుటకు గూడ భారత
శమునకు అధికారము, యీయ బడగలదు. మహమ్మదీయులు
ధిక సంఖ్యాకులుగా నున్న రాష్ట్రములు సమాఖ్యలో చేర నిష్టపడని
యెడల, వారు వేరుగా నుండవచ్చును. దేశీయ సంస్థానములు గూడ,
ష్టమైనచో సమాఖ్యలో చేరవచ్చును, లేనిచో విడిగా నుండవచ్చును.
మాఖ్యలో చేరితీరవలెనన్న నిర్బంధము, రాష్ట్రములకు గాని, సంస్థా
నములకు గాని లేదు. గవర్నరు జనరలు కార్యాచరణ సంఘము
పూర్తిగా భారతీయుల పరము జేయబడ గలదు. భారతప్రభుత్వ విధా
నములో తత్క్షణమే యెట్టి మార్పు జేయబడదు. యుద్ధానంతరము
వరకు వేచియుండ వలెను.

పాకిస్థాన్ వెంటనే యిచ్చెదమని వాగ్దానము జేసి, దానికి తగిన
యేర్పాటులు చేయలేదని, ముస్లింలీగు యీ రాయబారమును అంగీక
రింపలేదు. బ్రిటిషు ప్రభుత్వము, తమ చిత్తశుద్ధిని వ్యక్తపరచు అను
కూలమైన మార్పులు వెంటనే చేయకుండుట వలన క్రిప్సు రాయబా
రము కాంగ్రెసువారు నిరాకరించిరి. ఈ ప్రతిపాదనలు, కాలనిర్ణయము
లేని బ్యాంకుచెక్కువలె, నిరుపయోగములని మహాత్ముడు తన
అసమ్మతిని ప్రకటించెను. రాయబారము విఫలముకాగా, క్రిప్సు,
భారతీయులు అసమర్థులని నిందారోపణ జేసి, స్వదేశమునకు వెళ్లి
పోయెను.

భారత నాయకులందరు 8 ఆగస్టు 1942 నాడు బొంబాయిలో
సమావేశమై, భారతదేశ స్వాతంత్ర్యము లభించనంతవరకు, యుద్ధ
ప్రక్రియలో బ్రిటిషు వారికి, తామెట్టి సహాయము చేయజాలమని స్పష్ట

ముగా, తీర్మానించిరి. బ్రిటిష్ ప్రభుత్వము ఇండియానుండి నిష్క్రమించవలెనని కూడ తీర్మానించబడెను. భారత నాయకుల ప్రతికూల భాషణమును, తిరుగుబాటుగా నిర్ణయించి, బ్రిటిషు ప్రభుత్వము, వారిని నిర్బంధించెను. బ్రిటిషువారి చర్యకు కోపించి, ప్రజలు పలు తావుల తిరుగుబాటులను గావించిరి. ప్రభుత్వము సైనిక సహాయములో తిరుగుబాటును అణచివేసెను.

1945లో అక్షరాజ్యములు పూర్తిగా ఓడింపబడి శాంతిస్థాపన జరిగెను. భారతనాయకులందరిని వెంటనే వదలివేసి క్రిప్సు సూచనల ప్రకారము గవర్నరు జనరలు కార్యాచరణ సంఘములో భారత నాయకులను చేర్చుకొనుటకు అప్పుడు వైస్రాయిగా నుండిన వేవెల్ ప్రభువు చాలా ప్రయత్నముచేసెను. వివిధ పార్టీలకు ఎన్ని స్థానములు మరియు ఏయే స్థానములో సంగవలెనను అంశముపై ఏకాభిప్రాయము కుదరనందున లార్డు వేవెల్ కృషి సఫలముకాలేదు.

1945 అతి ముఖ్య సంఘటనలతో గూడిన సంవత్సరము. ఇంగ్లండులో చిరకాలము అధికారమునందుండిన టోరీ ప్రభుత్వము సంవత్సరాంతమున జరిగిన యెన్నికలలో ఓడిపోయి బ్రిటీషు కార్మిక వర్గము అధికారములోనికి వచ్చెను. టోరీలు మొదటినుండియు భారత స్వాతంత్ర్య నిరోధకులుగా నుండిరి. వారి నాయకుడగు చర్చిలు భారత దేశమునకు స్వాతంత్ర్యమిచ్చినచో ఆంగ్లేయులు బిచ్చమెత్తుకొనవలసి వచ్చునని నమ్మియుండెను. బ్రిటన్‌లోని ప్రతి 5 పౌరులలో 4 గురి జీవనాధారము భారతదేశముపై గలదని చెప్పవచ్చు. అఖండ సువిశాల బ్రిటీషు సామ్రాజ్య విచ్ఛేదన ప్రక్రియకు తాను అధ్వర్యము వహింపజాలనని ఢంకా కొట్టి వచించెను.

అట్టి చర్చిలు ప్రభుత్వము అంతరించి, భారతదేశ మిత్రులమని చెప్పుకొనెడు కార్మికవర్గము అధికారములోనికి వచ్చుటతో భారతీయులయెడల బ్రిటీషు ప్రభుత్వ విధానములోగూడ మార్పు కలిగెను.

భారతదేశమునకు సంపూర్ణ స్వాతంత్ర్య మొసగెదమని జార్జి చక్రవర్తి క్రొత్తపార్లమెంటు ప్రారంభోపన్యాసములో విశదీకరించెను. భారతదేశములోని యథార్థ పరిస్థితులు తెలిసికొనుటకై కొందరు పార్లమెంటరీ సభ్యులు భారతదేశమునకు విచ్చేసి, పర్యటించి తమ ప్రత్యక్షానుభవమును పార్లమెంటుకు నివేదించిరి. రెండవ ప్రపంచ యుద్ధముతో ఇంగ్లండు దేశము మిక్కిలి బలహీనమైపోయెను. పరదేశములను శక్తివంతముగ పరిపాలించగలమన్న ధైర్యము బ్రిటీషు ప్రభుత్వమునకు సన్నగిల్లెను. భారతదేశమును వీడుటే ఉత్తమరాజనీతి యని బ్రిటీషు ప్రభుత్వము భావించెను. భారతనాయకులతో స్వాతంత్ర్య ప్రదాన విషయము చర్చించుటకు ముగ్గురు మంత్రుల రాయబారము పంపగలమని, ప్రధానమంత్రి మిస్టర్ క్లెమెంట్ అట్లీ పార్లమెంటులో ప్రకటించెను. లార్డు పెథిక్ లారెన్సు (ఇండియా సెక్రటరీ) సర్ స్టాఫోర్డు క్రిప్సు, (బోర్డు ఆఫ్ ట్రేడ్ ప్రెసిడెంటు), మిస్టర్ ఎ. వి. అలెగ్జాండరు (అడ్మిరాలిటీబోర్డు ప్రెసిడెంటు) రాయబారవర్గముగా నియమితులైరి.

వీరు భారతదేశమునకు విచ్చేసి, కాంగ్రెసు ప్రతినిధులతోను, ముస్లింలీగ్ ప్రతినిధులతోను, దీర్ఘచర్చలు జరిపిరి. ఉభయపక్షాల దృక్పథము పరస్పర విరుద్ధముగ నున్నందున ఉభయులకు సమ్మతమగు నిర్ణయమునకు వచ్చుట అసంభవమయ్యెను. ముస్లింలీగ్ భారతదేశమును రెండుభాగములుగ విభజించి, పాకిస్తాన్ మరియు హిందూస్తాన్ అను రెండు భిన్నరాష్ట్రముల కూటమిగా నిర్ణయించమని కోరెను. హిందువులు, మహమ్మదీయులు, రెండు, పరస్పర భిన్నజాతులకు చెందినవారనియు, వారిలో ఐకమత్య మసంభవమనియు, లీగ్ వాదము. భారతీయులందరు ఒకేజాతికి చెందినవారని కాంగ్రెసు సిద్ధాంతము. కావున భారతదేశమును విభజింపరాదనియు, రాష్ట్రముల కెక్కుడు అధికారములు నిచ్చి, అఖిలభారత సమాఖ్యను నెలకొల్పవలెననియు కాంగ్రెసు కోరెను. ఇటువంటి పరస్పర భిన్న ప్రతిపాదనలను సమన్వయించజాలక, తమకు తోచిన విధమున, రాయబార వర్గము మత

"ఉత్తమ సలహాను" బ్రిటీషు ప్రభుత్వమునకు సమర్పించెను. మే 16 1946 నాటి ప్రకటనగా యీ ప్రణాళిక చరిత్రలో ప్రసిద్ధికెక్కినది.

రాయబార వర్గసూచన ప్రకారము, కేంద్రములో తాత్కాలిక ప్రభుత్వము యేర్పడవలెను. భారత రాజ్యాంగ చట్టమును నిర్మించుటకు, రాజ్యాంగనిర్మాణసభ (Constituent Assembly) సమావేశపరుపబడును. ఇందులో రాష్ట్రీయ శాసనభాసభ్యులు, తమలోనే కొందరిని, రాజ్యాంగసభకు సభ్యులుగా యెన్నుకొనెదరు. ప్రతి పది లక్షల జనాభాకు ఒక సభ్యుని యెన్నుకొను యధికారము ఉండగలదు. రాష్ట్రములును మూడుభాగములుగ విభజింపబడెను. మద్రాసు, బొంబాయి, యూ. పి., సి. పి., ఒరిస్సాలుకలిసి 187 సభ్యుల నెన్నుకొనగలరు. సరిహద్దు రాష్ట్రము, పంజాబు, సింధు రాష్ట్రాలు కలిసి 35 సభ్యులను, బెంగాల్, అస్సాం రాష్ట్రాలు 70 సభ్యులను, దేశీయ సంస్థానములు 93 సభ్యులను, బ్రిటిషు బెలుచిస్థాన్ ఒక సభ్యుని, ఢిల్లీ, అజ్మీర్, కూర్గులు, ఒకొక్క సభ్యుని, రాజ్యాంగ సభకు యెన్నుకొనవలెను. ఈ విధముగ సమావేశమైన రాజ్యాంగసభ చిత్తుచట్టమును సిద్ధముచేయగలదు. కేంద్రప్రభుత్వము సమాఖ్యగా నుండగలదు. పై నాలుగు వర్గాలలో చేర్చబడిన రాష్ట్రములు, రాష్ట్రీయ స్వయం పరిపాలనాధికారములు కలిగి, కేంద్రమునకు వదలిన విషయములుదప్ప కడమ విషయములలో సంపూర్ణాధికారము కలిగి యుండును. దేశరక్షణ, విదేశ వ్యవహారములు, రవాణా శాఖలను మాత్రమే కేంద్రమునిర్వహించవగలదు. కేంద్రమున వేరే శాసనసభ, మరియు ఆసభకు బాధ్యతవహించు మంత్రిమండలి యుండును. ప్రతి రాష్ట్రమునకు ప్రత్యేక శాసనసభ, మంత్రి మండలి యుండగలవు. ఈ విధముగా, భారత దేశసమాఖ్య పరిపాలనము పది సంవత్సరములు జరిగిన తరువాత, రాజ్యాంగ చట్టములో అవసరమగు మార్పులు తేవచ్చును.

మంత్రిమండలి చేసిన పై సూచనలు కలగూర గంపవలె నుండెను. ముస్లింలీగ్ కోరినట్లు పాకిస్థాన్ యిచ్చుటకు అ

కున్నను, రాష్ట్రములను నాలుగు వర్గాలుగా విభజించుటలో తూర్పు పాకిస్తానము, పశ్చిమ పాకిస్తానము, తామంతట అవియే యేర్పడు చున్నవి. ఈ విధముగా గావింపబడిన దేశవిభజనకు కాంగ్రెసు తీవ్ర అసమ్మతిని జూపెను. ప్రత్యక్షముగా పాకిస్థాన్ యీయనందుకు జిన్నా దుయ్యబుచ్చుకొనెను. "కష్టపడి వ్రాసిన విషాద గీతము" ని చర్చిలు మహాశయుడు యీ ముగ్గురు మంత్రుల ప్రణాళికను విమర్శించెను.

రాజ్యాంగ సభకు జరిగిన యెన్నికలలో, ముస్లింలీగు, కాంగ్రెసులు పాల్గొనెను. మహమ్మదీయుల వోట్లు చాలా వరకు లీగుకే దొరికెను. కేంద్రములో సెప్టెంబరు 2- 1946 తేదిన తాత్కాలిక మంత్రివర్గమేర్పడెను. ప్రప్రథమమున ముస్లింలీగు మంత్రి మండలిలో చేరక, మహమ్మదీయులకు ప్రత్యేక రాజ్యాంగసభ కావలెనని పట్టు పట్టెను. చివరకు మంత్రి మండలిలోచేరి రాజ్యాంగ సభలోచేర నిరాకరించెను. లీగు సభ్యులులేని రాజ్యాంగ నిర్మాణసభ ప్రథమ సమావేశము, డిసెంబరు 9. 1946 తేదిన జరిగెను. కేంద్రమంత్రి మండలి సమష్టి బాధ్యతతో మెలగవలెనన్న ఆచారము పాటింపబడలేదు లీగు సభ్యుల సంప్రదించక సిద్ధము జేసిన రాజ్యాంగ చట్టము మహమ్మదీయులకు రుచించదని ముస్లింలీగు ప్రకటించెను.

ఈ తాత్కాలిక మంత్రివర్గ యొక్క అనుభవము మిక్కిలి అసంతృప్తికరముగా నుండెను. కేంద్రములో కాంగ్రెస్ ప్రతినిధులు మంత్రులుగా నున్నప్పటికి బెంగాలు రాష్ట్రములోని నౌఖాలిలో జరిగిన దురంతములను నివారించుటకు వారు యేమియును చేయజాలక పోయిరి. కాంగ్రెసు - లీగు మిశ్రమ మంత్రి వర్గము ఒల్లని కాపురముగా పరిణమించెను. ఇట్టి పరిస్థితులలో దేశవిభజన తప్ప తీవ్రమార్గాంతరము కనుపించలేదు. 20 ఫిబ్రవరి 1947 నాడు బ్రిటిష్షు ప్రధాని భారత ప్రభుత్వమును జూన్ 1948 లో భారతీయుల హస్తగతము చేసెదమని ప్రకటించెను. అటు పిమ్మట ఆంగ్లేయులు ఒక క్షణమైనను భారతావనిపై నిలవనీయు, ఈ లోపుగా, హిందూ, ముస్లింలు ఐక్య

మైనచో ఏకప్రభుత్వస్థాపన జరుగ గలదనియు, ఐకమత్యము కుదరనియెడల భారతదేశ విభజన జరిగి వేర్వేరు ప్రభుత్వములకు బాధ్యత అప్పగించబడ గలదనియు బ్రిటిష్ ప్రభుత్వము ప్రకటించెను. లార్డ్ వేవెలు స్థానే లార్డుమౌంటు బ్యాటెన్ భారత వైస్రాయి, గవర్నరు జనరలుగా నియమింప బడెను.

భారత నాయకులలో సమాధానము కుదిర్చుటకు నూతన గవర్నరు జనరలు ప్రయత్నముచేసెను. కాంగ్రెసు, లీగులు, చివరకు వేరు పడుటకే నిశ్చయించెను. ఇండియా సెక్రటరీ అనుమతితో 3 జూన్ 1947 తేదీనాడు లార్డుమౌంటుబ్యాటన్ ఇండియా - పాకిస్థాన్ రెండు వేర్వేరు డొమినియనుల అవతరణను ప్రకటించెను. పంజాబు, బెంగాలు రాష్ట్రములను విభజించుటకు, సరిహద్దు రాష్ట్రము మరియు అస్సాంలోని సిల్హాట్ జిల్లాలో ప్రజాభిప్రాయము (Plebiscite) తెలుసుకొనుటకు సరిహద్దు నిర్ణయసంఘము నొకదానిని స్థాపించుటకును, తగు సన్నాహములు చేయబడెను. పాకిస్తాన్ కొరకు ప్రత్యేక రాజ్యాంగసభ యేర్పరచుట కంగీకరింపబడెను. జూన్ 1948 కంటె ముందుగా 15 ఆగస్టు 1947 స్వాతంత్ర్యప్రదాన దివసముగా నిశ్చయింపబడెను. జులై 1947 మాసమున భారత స్వాతంత్ర్య చట్టము పార్లమెంటులో ప్రవేశ పెట్టబడి ఆమోదించబడెను. తత్ఫలితముగా భారతదేశముపై గల సర్వాధికారములు బ్రిటను వదలుకొనెను. దేశీయ సంస్థానములు తమ యిష్టము వచ్చిన డొమినియనులో చేరవచ్చునని ప్రకటించుచు, ఆ సంస్థానాలు తమతో సన్నిహిత సంబంధముగల ఇరుగు పొరుగు డొమినియనులో చేరుట భావ్యమని సలహా యొసంగబడెను. బ్రిటీషుప్రభుత్వమునకు దేశీయసంస్థానములపై గల సార్వభౌమాధికారము అంతరించగలదు. డొమినియన్ పార్లమెంటు సర్వ స్వతంత్ర శాసనాధికారములు కలిగియుండును. డొమినియను శాసనముల నిరాకరించుటకు బ్రిటీషు ప్రభువుకెట్టి యధికారముండదు. బ్రిటీషు పార్లమెంటు చట్టముల డొమినియనులో అనువర్తింప జేయుటకు డొమినియను పార్లమెంటు అంగీకారము అవసరము. బ్రిటీషు ప్రభుత్వము సంస్థానాధీశ్వ

రులతో గావించుకొనిన సంధి ఒడంబడికలు 15 ఆగష్టు 1947తో రద్దు కాగలవు.

ఇండియా, పాకిస్థానులలో యేర్పడిన రాజ్యాంగనిర్ణయ సభలు, తాత్కాలిక కేంద్రశాసనసభలుగా వ్యవహరించగలవు. ప్రత్యేక రాజ్యాంగచట్టములామోదింపబడునంతవరకు 1935 భారతరాజ్యాంగ చట్టము ప్రకారము ప్రభుత్వము నడువగలదు. స్వల్పమార్పులు చేయుటకు గవర్నరు జనరలుకు అధికారమివ్వబడెను. గవర్నర్లు, గవర్నరు జనరలు ప్రత్యేక సందర్భములలో తమ యిష్టము వచ్చినట్లు వ్యవహరించుటకు యీయబడిన అధికారములు తొలగింపబడెను. భారత స్వాతంత్ర్యప్రదాన చట్టములో దేశవిభజనకు కావలసిన తంత్రాంగము చేర్చబడెను. ఇండియా సెక్రటరీ సలహాదారుల సంఘము రద్దుచేయబడెను. ఇండియన్ సివిలుసర్వీసు ఉద్యోగులు, న్యాయమూర్తులు స్వాతంత్ర్య ప్రదానము తరువాత ఉద్యోగములో నుండదలచిన యెడల వారికి పూర్వపుహక్కులే సురక్షితముగ నుండగలవు. ఈ విధముగ స్వాతంత్ర్య ప్రదానమునకు బ్రిటన్ నిష్క్రమణకు 15 ఆగష్టు 1947 లోపుగా సకల సన్నాహము చేయబడెను.

14 ఆగష్టు 1947 నాటిరాత్రి 12 గంటలకు, బ్రిటిషుప్రభుత్వ పక్షమున, లార్డు మౌంటు బ్యాటన్ భారత ప్రజల ప్రతినిధియైన భారత రాజ్యాంగ సభకు డొమినియన్ అధికారమును దత్తము గావించెను. భారతదేశమునకు, బ్రిటిషు సమష్టిరాజ్య కూటమిలో, ఇతర రాజ్యములతో సమానమగు అధినివేశ ప్రతిపత్తి లభించెను. అధినివేశ ప్రతిపత్తియనగా, బ్రిటిషు రాజును అధినేతగా అంగీకరించిన, సంపూర్ణ స్వాతంత్ర్యమని చెప్పవలెను. అధినివేశ మంత్రిమండలి కంగీకారమైన వ్యక్తిని ఇంగ్లండు రాజు, గవర్నరు జనరలుగా నియమించును. గవర్నరుజనరలు, మంత్రిమండలి సహాయముతో, శాసన బద్ధముగా దేశమును పరిపాలించును.

భారత రాజ్యాంగసభయే కేంద్రశాసన సభగా అంగీకరింపబడెను. అందు కనుగుణముగ శాసనసభకు వేరు అధ్యక్షునిగూడ యెన్నుకొనిరి. కేంద్రశాసన సభను, భారత పార్లమెంటని పిలువసాగిరి శాసనబద్ధము చేయబడగల విషయములన్నియు మూడుభాగములుగ చేయబడెను. (1) కేంద్రవిషయములు (2) రాష్ట్రీయ విషయముల (3) సమష్టివిషయములు. కేంద్ర సమష్టి విషయములపై కేంద్రశాసన సభ శాసనముల గావించును. కొన్ని ప్రత్యేక సందర్భములలో రాష్ట్రీయ విషయములనుగూడ చట్టబద్ధము గావించవచ్చును. గవర్నరు జనరలు పేరుతో సర్వవ్యవహారములు, ప్రధానమంత్రి చక్కబెట్టుచుండెను. ప్రధానమంత్రి కేంద్రశాసన సభకు బాధ్యుడుగ నుండును. ఇదేవిధమగు మార్పు రాష్ట్రములలోగూడ జరిగెను.

భారత రాజ్యాంగ చట్ట నిర్మాణము చురుకుగా సాగి 26 నవబరు 1949 నాడు, భారతరాజ్యాంగ నిర్మాణ సభచే ఆమోదింపబడెను. అందు 395 సూత్రములు, 8 అనుబంధములు గలవు. 26 జనవరి 1950 నాడు, చట్టము ఆచరణలోనికి వచ్చి అధినివేశముగానున్న భారత దేశము, సర్వస్వతంత్ర ప్రజాసత్తాక ప్రజారాజ్యముగ మారెను. రెండువందల సావత్సరముల తరువాత, భారత దేశముల బ్రిటిష్ పరిపాలన అంతమొందెను. ఇది భారత దేశీయులెంతో గర్వింప ఆనందించదగిన విషయము. భారతదేశమునకు ప్రథమ అధ్యక్షుడుగ డాక్టరు రాజేంద్రప్రసాదు యెన్నుకొనబడెను. జవాహర్ లాల్ నెహ్రూ భారత ప్రధానిగా నియమింపబడెను. గౌరవ సూచకముగ, అతని జీవితపర్యంతము సర్దార్ వల్లభాయ్ పటేలు ఉపప్రధానిగా నియమింపబడెను. రాజ్యాంగ చట్టములో ఉపప్రధాని పదవికి అవకాశము లేకపోయినప్పటికిని, సర్దారు పటేలుకు ప్రత్యేక గౌరవసూచకముగ యీ నియామకము చేయబడెను.

ఏప్రిలు 1949 లో డొమినియన్ ప్రధానుల సమావేశవ లండనులో జరిగెను. భారతప్రధానిని ప్రత్యేకముగ ఆహ్వానించి,

సభలో బ్రిటిషు రాజచిహ్నమును అంగీకరించకపోయినప్పటికి, భారత దేశము బ్రిటీషు సమష్టి రాజ్యకూటమిలో చేరియుండవలసిన దని కోరబడెను. కామన్వెల్తుకు బ్రిటీషు అను విశేషణమును వదలి వేయుటకుగూడ నిశ్చయించబడెను. ఈ తీర్మానమును భారత రాజ్యాంగసభ అంగీకరించెను. గావున నేడు భారతదేశము సర్వ స్వాతంత్ర్య ప్రజారాజ్యమైనప్పటికి, సమష్టిరాజ్యకూటమిలో సభ్యత్వము గలిగియున్నది.



## ౨

# భారత రాజ్యాంగ విధానము

## ( ప్ర ధా నాం శ ము లు )

ప్రపంచములో కొన్ని దేశముల రాజ్యాంగచట్టములు లిఖిత రూపకముగానున్నవి. ఫ్రాన్సు, అమెరికా, సోవియెట్ రష్యా, ఐర్లాండు, ఆస్ట్రేలియా, కెనడా, మొదలైనదేశాలు లిఖితరూపక రాజ్యాంగ చట్టముల కుదాహరణములు. బ్రిటనులోమాత్రము నేటివరకు, లిఖిత పూర్వక రాజ్యాంగచట్టములేదు. భారత రాజ్యాంగచట్టము, ఇతరదేశములందు కంటె, మిక్కిలి విపులముగానున్నది. ఇందులో చిన్నచిన్న విషయములుగూడ నిర్ణయించబడి, వ్రాయబడినవి.

ఆంగ్లేయుల సంపర్కమువలన పాశ్చాత్యుల ప్రజాస్వామ్య సిద్ధాంతములు భారతీయులకు నూతనముగ అలవడినవి.

ఆంగ్లేయుల పరిపాలనలో, పాశ్చాత్య సాంప్రదాయములు మన కలవడి, సమానత్వము, సౌభ్రాతృత్వము, స్వాతంత్ర్యముకొరకై పోరాడజొచ్చితిమి. స్వాతంత్ర్యము చివరకు లభించెనుగాని, దాని నుపయోగించువిధానము మనము నేర్చుకొనకపోతిమి. 1937 తరువాత 2½ సంవత్సరముల కాలముమాత్రము, రాష్ట్రములలో ప్రజాతంత్రము నడుపుటకు కొద్దిగా యలవడితిమి గాని 15 ఆగష్టు 1947కు పూర్వము మనముగడించిన పరిపాలనానుభవము ఇంచుమించు శూన్య

మనిచెప్పిన అతిశయోక్తి కాజాలదు. ప్రజాస్వామ్య మనగానేమియో మనము చదువుట, వినుటయేగాని, ఎన్నడుఅనుభవించలేదు. మన, దేశములో నూటికి తొంబదిమంది, విద్యావిహీనులు. ప్రజాస్వామ్యపరిజ్ఞానము సాధించుటకు విద్య యవసరము. విద్యరానివారు ప్రజాస్వామ్యమును వంకరటింకరగా అర్థముచేసికొనెదరు. ఆపాయములుకల్పించకుండుటకై భారతరాజ్యాంగ విధానమును విపులముగ వ్రాయవలసి వచ్చినదని, డాక్టరు అంబేద్కరు రాజ్యాంగసభలో వివరించియుండెను.

ప్రజాస్వామ్య సిద్ధాంతములను ఆచరణలో పెట్టుటకు రెండు విధానములు గలవు. (1) పార్లమెంటరీ విధానము. (2) అధ్యక్ష విధానము. అమెరికాలో నున్నది అధ్యక్షవిధానము. అచ్చట ముఖ్య పరిపాలకుడు అధ్యక్షుడు. అతడు ప్రజలచే యెన్నుకొనబడి ప్రజలకు బాధ్యత వహించును. ఇంగ్లాండులో నున్నది పార్లమెంటరీ విధానము. ఇంగ్లాండులో ప్రధానమంత్రి ప్రజా ప్రతినిధులతో గూడుకొనిన శాసన సభకు బాధ్యత వహించును. ఇంగ్లాండు పరిపాలన, రాజుపేరుతో ప్రధానమంత్రి నిర్వహించును. భారతదేశమునకు రాజులేడు గావున, ఆ స్థానమును అధ్యక్షుడు ఆక్రమించును. భారతాధ్యక్షుని, రాష్ట్ర శాసన సభాసభ్యులు, కేంద్రశాసన సభాసభ్యులు కలిసి యెన్నుకొనెదరు. అతని గౌరవ ప్రతిపత్తులు, ఇంగ్లాండు దేశములో రాజుయొక్క గౌరవ ప్రతిపత్తులను పోలియుండును. భారత దేశ పరిపాలనకు యెన్నుకొనబడిన అధ్యక్షుడు యాజమాన్యము వహించినప్పటికిని పరిపాలనా విధానము మాత్రము, ఇంగ్లాండులోవలె పార్లమెంటరీ విధానమే. అధ్యక్షుడు పేరునకు మాత్రమే అధిపతి. అతనిపేరుతో సర్వకార్యములు ప్రధానమంత్రియే నిర్వహించును. పరిపాలనలోని మంచిచెడ్డల బాధ్యత గూడ అతనిదే. కేంద్ర శాసనసభలో అధిక సంఖ్యాకసభ్యులు ప్రధానమంత్రి పరిపాలన సక్రమముగా లేదని తీర్మానించిన యెడల, ఆయన తన పదవిని వీడి, అధిక సంఖ్యాకసభ్యులచే యెన్నుకొనబడిన, మరొక సభ్యునికి, బాధ్యత నప్పగించ వలసి యుండును. దీనినే మంత్రి

వర్గపు మార్పు అనెదరు. ప్రధానమంత్రి, అధ్యక్షుని అనుమతితో, తనకు సహాయకులుగానుండు ఇతర మంత్రులను నియమించును. ఈ మంత్రులు అందరు కలిసి సమష్టి బాధ్యతతో పరిపాలనాక్రమ మును నడపవలెను. అందులో యెవరు తప్పు జేసినప్పటికి, దాని బాధ్యత ప్రధానమంత్రిపైనుండగలదు. పార్లమెంటరీ పరిపాలనమనగా, శాసనసభకు బాధ్యతవహించు ప్రధానమంత్రి పరిపాలనమని సూక్ష్మ ముగ చెప్పవచ్చును. భారతదేశములో పార్లమెంటరీ ప్రభుత్వవిధానము ఆచరణలో పెట్టబడినది.

భారత కేంద్రప్రభుత్వము సమాఖ్యగా యేర్పరుపబడినది. ప్రపం చములో అమెరికా, కెనడా, సోవియట్ రష్యా, స్విట్జరులాండు, దక్షిణ ఆఫ్రికా, ఆస్ట్రేలియాలు, సమాఖ్య రాజ్యములు. బ్రిటన్, ఫ్రాన్సు, ఐర్లాండు మొదలగునవి ఏకైక రాజ్యములు. ఏకైక రాజ్యములలో ఒకే శాసనసభ, ఒకే మంత్రిమండలి యుండును. రాజ్యమంతయు ఒకే రాష్ట్రముగ పరిగణింపబడును. సమాఖ్యలో పలురాష్ట్రములు చేరి యుండును. ప్రతి రాష్ట్రమునకు ప్రత్యేక శాసనసభ మరియు మంత్రి మండలి యుండును. ఇవిగాక ఒక కేంద్ర శాసనసభ, కేంద్ర మంత్రి మండలి యుండును. రాజ్యాంగవిధానములో నిర్ణయించి అనుబం ధములో సూచించినప్రకారము కేంద్రరాష్ట్ర శాసనసభలు, వేర్వే రుగా చట్టముల నిర్మించును. కేంద్రశాసనములకు, భిన్నముగాని విధ ముగా రాష్ట్రములు శాసనములను నిర్మించును. కావున పరస్పర సంఘ ర్షణకు తావుండదు- ఈ శాసనసభల మధ్య ఏదైన వివాదగ్రస్తమైన అంశము వచ్చినయెడల సుప్రీంకోర్టు విచారణ సలిపి పరిష్కారము జేయును. ప్రతి సమాఖ్య రాజ్యములో నొక సుప్రీంకోర్టు ఉండును. అదేవిధముగా భారతదేశమున ఎనిమిదిమంది న్యాయమూర్తులతో గూడిన సుప్రీంకోర్టు ఢిల్లీలోగలదు.

రాజ్యాంగ విధానములో మార్పులు సులభముగా చేయ వచ్చునా లేదా యను అంశమునుబట్టి, సమాఖ్య విధానములు-

(1) కఠినము (2) సౌమ్యము అని రెండు విధములు. భారత రాజ్యాంగము సౌమ్యమైనది. రాజనీతి శాస్త్రమునకుగాని, ధర్మశాస్త్రమునకుగాని శాశ్వతత్వము లేదు. కాలానుగుణ్యముగ అందు మార్పులు సహజముగ రావలయును. సులభముగా మార్పులు చేయు అవకాశము భారత రాజ్యాంగ విధానము కలిగియున్నప్పటికి, తొందరపడి మార్పులు చేయకుండునట్లుగా కొన్ని అసాధారణమైన కట్టుబాటులు చేయబడినవి. విషయ ప్రాధాన్యమునుబట్టి కొన్ని సవరణలకు ఉభయశాసనసభలలోని (శాసనసభ, శాసన సమితి - ఈ రెంటిని కలిపి పార్లమెంటందురు) మొత్తము సభ్యులలో మూడింట రెండువంతులు ఆమోదము అవసరము. అధ్యక్షుని యెన్నిక, కేంద్ర, రాష్ట్రప్రభుత్వముల శాసన, నిర్మాణ కార్యాచరణాధికారములు, వాని పరస్పర సంబంధము;అనుబంధములో చేర్చబడిన శాసన విషయములు; రాష్ట్రములకు పార్లమెంటునందుగల ప్రాతినిధ్యము, కేంద్ర, రాష్ట్ర న్యాయశాఖలు, రాజ్యాంగ విధానములో సవరణలు చేయుటకు నిర్ణయింపబడిన పద్ధతి - మొదలైనవాని విషయమై సవరణలుచేయుసందర్భమున, పైవిధమున మొత్తము కేంద్ర పార్లమెంటుసభ్యులలో2/3సభ్యుల ఆమోదము అవసరమేగాక, సగముకంటె యెక్కువ, రాష్ట్రశాసనసభల యొక్క ఆమోదముకూడ కావలసియుండును.

ఇతరవిషయములలో పార్లమెంటు సామాన్యమగురీతి, అధిక సంఖ్యాకసభ్యుల ఆమోదముతో సవరణలుచేయవచ్చును. కొన్ని ప్రత్యేక ఉపద్రవపరిస్థితులందు భారతసమాఖ్యను, ఏకైకరాజ్యముగ జేయుటకు, అనుకూలముగూడ మన రాజ్యాంగచట్టములో కల్పించబడినది. ఇట్టివిశేషము, ఇతర ప్రపంచసమాఖ్య రాజ్యాంగవిధానములలో నెచ్చటను లేదు.

పాశ్చాత్య సిద్ధాంతములనుబట్టి, మన రాజ్యాంగవిధానము సిద్ధము చేయబడినదికావున, భారతసాంప్రదాయముల చిహ్నము లందు కానరావు. పాశ్చాత్య రాజనీతిజ్ఞులు యుక్తములని భావించినవిషయ

ములనే, భారత వాతావరణమున కనుకూలముగు కొలదిమార్పులతో, మనము స్వీకరించినాము. ఒకవిధముగా దీనిని, ఆంగ్లో - ఇండియన్ రాజ్యాంగవిధానమని చెప్పవచ్చును. 1935 రాజ్యాంగచట్టములోని విషయములే, చాలవరకు యిందు పొందుపరుపబడినవి. కొన్ని మార్పులు ఐర్లాండు, ఆస్ట్రేలియా, కెనడా, అమెరికా రాజ్యాంగములను పోల్చిచూచి గ్రహించబడినవి.

ప్రజాస్వామ్యమును సమృద్ధివంతముగ నడిపించుటకు, కొన్ని ఆచారములను సాంప్రదాయములను పాటించవలసియుండును. ఈ సాంప్రదాయములు మరియు ఆచారములన్నింటిని (Conventions of the Constitution) శాసనబద్ధముగావించుట అసంభవము-కావున వానిని, పాటించుబాధ్యత శాసనసభాధ్యక్షుని (Speaker)పై నుండగలదు. భారతదేశములో, పార్లమెంటరీ ప్రభుత్వవిధానము, నూతనానుభవము గావున, ఇంగ్లీషుపార్లమెంటు ఆచార, వ్యవహారములను, సందర్భానుసారముగ మనము గ్రహింపవలసియుండును. ముఖ్యమైన ప్రభుత్వ తీర్మానములను శాసనసభ త్రోసిపుచ్చినయెడల ప్రధానమంత్రి రాజీనామా యొసంగవలెననునది ఉదాహరణకొక, చట్టబద్ధముగాని ఆచారము, శాసనసభలో అధికసంఖ్యాకులయొక్క సహకారముకలిగిన పార్టీనాయకుని పిలిచి ప్రధాన మంత్రిత్వము నొసంగవలసిన బాధ్యత, ప్రభుత్వాధ్యక్షునిపై గలదు ఇట్టి ఆచారములను పాటింపనిచో, ప్రజాస్వామ్యము, నియంతృత్వముగా మారగలదు. కావున రాజ్యాంగ విధానమును సంరక్షించుబాధ్యత, అధ్యక్షునిపైనను, ప్రధానమంత్రిపైనను గలదు. ప్రభుత్వాధికారమునకు మూలకందము ప్రజలను విషయమును, భారతదేశప్రజలు ముఖ్యముగ గ్రహించవలెను. ప్రజలలో పూర్తిగా రాజకీయచైతన్యము కలిగిననాడుగాని, ప్రజాస్వామ్యము సంపూర్ణముగా విజయవంతము కాజాలదు.

———

3

# ప్రస్తావన - ప్రాథమిక హక్కులు

## పౌరత్వము - రాజనైతిక ధర్మ సూత్రములు

భారత రాజ్యాంగమునందు, అమెరికా, ఇంగ్లాండు మరియు బ్రిటిషు కామన్ వెల్తు రాజ్యముల రాజ్యాంగము లందలి కొన్ని ముఖ్యసూత్రములు దేశకాల పాత్రానుగుణ్యముగ కొలది మార్పులతో గ్రహింపబడినవి- భారతరాజ్యాంగమును సమగ్రముగ తెలుసుకొన వలెనన్న పై నుదహరించిన రాజ్యాంగ విధానములను, వాని ఆచరణను తెలుసుకొనవలెను. భారత రాజ్యాంగముయొక్క ఆదర్శోద్దేశ్యములు ప్రస్తావనలో సూచింపబడినవి. భారతీయుల స్వాతంత్ర్యవాంఛ, అందు ప్రస్ఫుటమగుచున్నది. భారతదేశ భవితవ్యమును భారతప్రజలే నిర్ణయించగలరు. ప్రజా రాజ్యములో రాజ్యాంగ సూత్రముల నామోదించు యధికారము ప్రజలకే గలదు. ఈ ప్రజాస్వామ్య సూత్రములు, ప్రస్తావనలో ఆమోదింప బడుటయే గాక, ఆచరణలోనికి తేబడినట్లు యీ క్రింది ప్రస్తావన వెల్లడి చేయుచున్నది.

"మేము భారతదేశ ప్రజలము, భారత దేశమును సర్వస్వతంత్ర, ప్రజాస్వామిక, ప్రజారాజ్యముగ ప్రకటించు నిమిత్తము; మరియు సమస్త పౌరులకు, సామాజిక, ఆర్థిక, రాజనైతిక న్యాయము, భావస్వాతంత్ర్యము, ప్రకటనా స్వాతంత్ర్యము, సమాన ప్రతిపత్తి, సమానావకాశముల లభ్యపరచు కొరకును, పౌరులందరిలో ఆత్మగౌర

వము, జాతీ యైకమత్యము ద్వారా, సర్వమానవ సౌభ్రాతృత్వము, నెలకొల్పుట కొరకును, ఈ రాజ్యాంగ నిర్ణయసభలో 26, నవంబరు 1949 తేదినాడు, ఈ రాజ్యాంగ విధానమును ఆమోదించి, చట్టబద్ధముగావించి స్వీకరించుటకు త్రికరణశుద్ధిగా సంకల్పించి యున్నాము."

ఈ ప్రస్తావన, మన రాజ్యాంగ చట్టములోని అంతర్భాగము గాకపోయినను, ఉపోద్ఘాతమువలె రాజ్యాంగము యొక్క ఉద్దేశములను ఆదర్శములను వివరించుచున్నది. ప్రజల సార్వభౌమాధికారమును ఈ ప్రస్తావన ఉద్ఘాటించుచున్నది. ప్రభుత్వము యొక్క అధికారము లన్నియు ప్రజలనుండియే సంక్రమించుచున్నవని ఇందువలనస్పష్టమగుచున్నది. ప్రస్తుతకాలము ప్రజాస్వామికయుగము. శాసన కర్తలు ప్రజలచే యెన్నుకొనబడిన వారై, తమ శాసనాధికారమును, ప్రజానుమతితో ప్రజలనుంచి పొందవలెను. ప్రజల శ్రేయస్సుకొరకు ప్రజానురంజకముగ, అట్టి అధికారమును వినియోగించవలెను. ప్రజా సామాన్యమునకు శాసనబద్ధ స్వాతంత్ర్యముతో పాటు, నిత్యజీవనమును సౌఖ్యవంతము జేయుట, రాజ్యాంగమువలన ఉపయోగము. ప్రజలు సహజముగ శాంతియుత సుఖజీవనము గోరుచుందురు. రాజ్యాంగ విధానము, ప్రజాసౌఖ్యమునకు, మరియు ప్రజా శ్రేయస్సుకు తోడ్పడునదై యుండవలెను. ఇదియే రాజ్యాంగము యొక్క ముఖ్యోద్దేశము. ప్రజా ప్రతినిధులైన పరిపాలకులు పై ఉద్దేశ్యమును అవగాహన మొనరించు కొనుట అవసరము.

రాబోవు తరముల మేలుగోరి నేడు మనము రాజ్యాంగచట్టము నిర్మించినాము. మనతరువాత తరములవారు అట్టి మేలును పొందజాలనియెడల రాజ్యాంగములో మార్పులు వారు చేసికొనితీరవలెను. అనగా ఒకమారు రాజ్యాంగ చట్టమును నిర్మించినంతమాత్రమున, ప్రజలందరు శాశ్వతముగ సుఖించెదరని చెప్పుటకు వీలులేదు. ప్రజా శ్రేయస్సుకు ఉపకరించినంతవరకే రాజ్యాంగచట్టము అనుసరణీయము.

అమెరికా రాజ్యాంగ చట్టము యేర్పాటు చేయబడినప్పుడు, బానిస వ్యాపారము బాహాటముగ సాగుచుండెను. కాలక్రమేణ ప్రజలు బానిసవ్యాపారము మానవధర్మ విరుద్ధమని తెలుసుకొని, దానిని నిషేధించిరి. ఈ నిషేధనమును అమలు జరుపుటకై 1861 నుంచి 1865 వరకు తీవ్రమైన అంతర్యుద్ధముగూడ సంభవించెను. ఒకానొకప్పుడు జాతీయత మానవత్వమును పోషించుటకై చట్టవిరుద్ధముగా నడచినను. అది క్రమబద్ధమైనదిగానే భావించవలెను. "దేశ సంరక్షణార్థమై రాజ్యాంగ సంరక్షణకు అనివార్యములైన చర్యలు యితరత్రా చట్ట విరుద్ధములైనప్పటికిని న్యాయబద్ధములేనని నేను భావించితిని" అని నుడివిన, అమెరికా ప్రెసిడెంటు అబ్రహాం లింకను వాక్యములు సర్వదా స్మరణీయములు.

"స్వాతంత్ర్యము నా జన్మహక్కు" అని ఉద్ఘాటించినాడొక భారత వీరుడు. జన్మహక్కును సంరక్షించుటయే మన రాజ్యాంగము యొక్క ముఖ్యోద్దేశ్యము. వీనినే ప్రాథమిక హక్కులు, పౌరసత్వము లనెదరు. ప్రజాస్వామ్య రాజ్యమునకు పౌరసత్వములు పునాదివంటివి. ప్రజాస్వామ్యసూత్రముల మిసిమియే పౌరసత్వములు, అవి నిరాకరింప బడిన మరుక్షణమున, పునాదులు కదలిన సౌధమువలె ప్రజారాజ్యము నేలపాలు కాగలదు. కావున పౌరసత్వముల ప్రాముఖ్యతను, వానిసంరక్షణావశ్యకతను ప్రజలు గుర్తించుట అవసరము.

21 సంవత్సరములు నిండిన, ప్రతి భారతీయునకు శాసనసభకు ప్రతినిధులను యెన్నుకొను హక్కుగలదు. దీనినే వోటింగుహక్కు అనెదరు. మన దేశములో విద్యావంతుల సంఖ్యచాల తక్కువ. అందులో సామాన్య వ్యవహార పరిజ్ఞానముగలవారు యింకను తక్కువ, కావున పామరులైన సామాన్యప్రజానీకమునకు, పౌరులనగా నెవరు, పౌర సత్వములనగానేవి, వారి బాధ్యతాధికారములు యెవ్వి, అనుషంగతులు ముఖ్యముగ బోధపరుపవలెను.

భారతరాజ్యాంగచట్టము అమలులోనికి వచ్చునప్పటికి, భారత దేశములో కాపురముచేయుచు ఈ క్రింది మూడు నియమములలో నొకదానిని పూర్తిచేయువారు భారతపౌరులుగా పరిగణింపబడుదురు. (1) భారతదేశములో పుట్టియుండవలెను. (2) లేదా, అతని తల్లి తండ్రులలోనొకర్తైన భారతదేశములో పుట్టియుండవలెను. (3) లేదా, కనీసము అయిదు సంవత్సరముల కాలము, భారతదేశము లోస్థిరనివాసము యేర్పరచుకొని యుండవలెను.

భారతదేశమునుండి పాకిస్తాన్ విడిపోయినసంగతి మనకందరకు తెలిసినదే. పాకిస్తాన్ నుండి లక్షలాదిజనులు భారతదేశమునకు వలస వచ్చిరి. పాకిస్తాన్‌నుండి వలసవచ్చిన భారతీయుల జన్మహక్కులను సంరక్షించు బాధ్యతనుగుర్తించి, వలసవచ్చినవారికి పౌరహక్కులు ప్రసాదించబడినవి. అవిభక్త భారతదేశంలో, అతనుగాని అతని తల్లిదండ్రులలో నెవరేకాని, లేక, అతని తాతముత్తవలలో నెవరేకాని, జన్మించియుండిన యెడల అతడు భారతపౌరుడుగా అంగీకరింపబడును. 19 జూలై 1948కి పూర్వము భారత దేశానికి వలసవచ్చి, అప్పటినుండిభారత దేశములో స్థిరనివాసము యేర్పరుచుకొన్నవారు, భారతపౌరులే. 19జూలై 1948 తరువాత పాకిస్తాన్‌నుండి వలసవచ్చి; 26జనవరి1950కి పూర్వము, ప్రభుత్వముచే భారతపౌరునిగ అంగీకరింపబడినవారు పౌర హక్కులు కలిగియుందురు. అయితే భారతదేశంలో కనీసము ఆరు నెలలపాటు కాపురము ఉండిననేకాని, యిట్టిహక్కు సంక్రమింపనేరదు. కొందరు పాకిస్తాన్‌ను తమ మాతృభూమిగా భావించి భారతదేశము వదలివెళ్ళినారు. 1 మార్చి 1947 తరువాత ఇచ్ఛాపూర్వకముగా వెళ్ళినవారు భారతేతరులుగా భావించబడుదురు. అయితే తిరిగివచ్చు ఉద్దేశముతో, ప్రభుత్వానుమతిని పాకిస్తాన్ వెళ్ళి, తిరిగి, అనుమతి కాలముతీరగానే భారతదేశమువచ్చి చేరుకున్నవారు, తమ పౌరసత్వ

కొందరు భారతీయులు విదేశాలలో చాలాకాలంనుంచి నివసించుచున్నారు. వారుగాని, వారి తల్లిదండ్రులలో నెవరైన ఒకరుగాని, లేక వారి తాత ముత్తవలలో నెవరే నొకరుగాని, అవిభక్త భారత దేశములో జన్మించి యుండినట్లయిన, అట్టివారు భారతేతర దేశాలలో నివసించుచున్నప్పటికిని, భారత పౌరులుగానే, ఎంచబడుదురు. భారత రాయబార ప్రతినిధులు ఇట్టివారిని భారతపౌరులుగానిర్ణయించుచు ప్రకటించవలసి యుండును. ఎవరైనను, విదేశాలలో నివసించుచు, యిష్టపూర్వకముగ ఆయాదేశపు పౌరులుగ ఎన్నుకొననటుల చేసికొనిన యెడల, వారు భారతదేశ పౌరసత్వమును కోల్పోవగలరు. ఈ నియమములలో అప్పుడప్పుడు మార్పులు చేయుటకు పార్లమెంటుకు అధికారము యీయబడినది. అమెరికాలో వివిధరాష్ట్రములందు వేర్వేరు పౌరసత్వములు గలవు. భారతదేశము పలురాష్ట్రముల సమాఖ్య అయినప్పటికి పౌరసత్వము లందరికి సమానము ; మన దేశమున అమెరికాలో వలె వివిధరాష్ట్రాలలో పౌరసత్వములు వేరువేరుగా లేవు.

## పౌరసత్వములు లేక ప్రాథమిక హక్కులు

భారత పౌరులందరికి వ్యక్తిగతముగా గల అధికార స్వాతంత్ర్యములను పౌరసత్వము లనెదరు. ఇవి భారత రాజ్యాంగమునకు పునాది వంటివి గావున పౌరసత్వములను ప్రాథమిక హక్కులని గూడ వ్యవహరించుట గలదు. భారత రాజ్యాంగచట్టపు మూడవభాగములో పౌరసత్వములు, నాల్గవభాగములో రాజనైతిక ధర్మసూత్రములు ఉదహరింపబడినవి. పౌరసత్వములను అమలుపరచుటకు ఉన్నత న్యాయస్థానములకు అధికారము యీయబడినది. ధర్మసూత్రములు మాత్రము న్యాయవిచారణకు అతీతమైనవి. పౌరసత్వములను చట్టబద్ధము గావించు పద్ధతి, ఐర్లాండు, అమెరికా, ఫ్రాన్సు దేశ రాజ్యాంగములనుండి గైకొన

బడినది. ఈ విషయములో మనము బ్రిటిషు రాజ్యాంగ విధానమునకు మెరుగులు దిద్దినాము. బ్రిటిషు పార్లమెంటుకు, పౌరసత్వములను సంకు చితపరుచుచు తీర్మానించు అధికారము గలదు. ఇట్టి తీర్మానములు చట్టరూపము ధరించినంతనే న్యాయస్థానములు కాదనజాలవు. భారత దేశములో ఇప్పుడు అమలులోనున్న న్యాయసూత్రములు, ముందు చేయబోవు చట్టములు, పౌరసత్వములకు వ్యతిరేకముగా నున్నంతవరకు చట్ట విరుద్ధములు ( Ultra Vires ). పౌరసత్వములకు ఆటంకము గల్గి నప్పుడు, అట్టిఅవరోధమును తొలగించవలసినదిగా న్యాయస్థానములను కోరవచ్చును. పౌరసత్వముల రక్షించుబాధ్యత న్యాయస్థానముపై గలదు. స్వాతంత్ర్యమునకివి ప్రాణము వంటివి, ప్రజలను బానిసలుగా జేయు నియంతలు, ప్రజల ఆయువుపట్టువగు ప్రాథమిక హక్కులను హరింప యత్నించెదరు. కావున ప్రజలు నియంతలకు తావీయక తమ జన్మహక్కులను అతి జాగరూకతతో రక్షించుకొను చుండ వలెను. రక్షణోపాయములు 32 సెక్షనులో ఉదహరించబడి, 32 (2), 226 సెక్షన్లద్వారా రక్షించుబాధ్యత, ఉన్నత న్యాయస్థానములకు, సుప్రీం కోర్టుకు ( ప్రధాన ఉన్నత న్యాయస్థానమునకు ) యీాయ బడినది.

ప్రాథమిక హక్కులు ఈ క్రింది విషయములకు సంబంధించి యుండును.

(1) సమానత్వము లేక సమత.

(2) వ్యక్తి స్వాతంత్ర్యము లేక స్వేచ్ఛ.

(3) ఆత్మ గౌరవము.

(4) మత స్వాతంత్ర్యము.

(5) సాంస్కృతిక, విద్యా స్వాతంత్ర్యము.

(6) వ్యక్తులస్థిర, చరాస్తుల రక్షణ.

(7) 32 సెక్షనులో సూచించబడిన చట్టబద్ధాధికారములు.

1. సమత లేక సమానత్వమనగా, న్యాయరక్షణ భారత పౌరులందరకు సమానముగా లభించవలెను. న్యాయమును కోరుహక్కు అందరకు సమానముగగలదు. జాతి, మత, కుల, స్త్రీ పురుష, జన్మస్థాన విభేదకారణముగ, కొందరియెడ పక్షపాతముగాని, విచక్షణగాని చూపించుటకు వీలులేదు. హోటళ్ళు, సినిమాలు, మొదలగు స్థలములందు గుమిగూడునప్పుడుగాని. దుకాణములందు వస్తువులు కొనునప్పుడుగాని, ప్రభుత్వ సహాయముతో నిర్మింపబడినట్టియు లేక ప్రజాసామాన్యము యొక్క ఉపయోగమునకై వినియోగింపబడినట్టి బావులను, చెరువులను, స్నాన ఘట్టములను, రహదారులను, ప్రజలుసాధారణముగ గుమిగూడు పార్కులు, మైదానములవంటి స్థలములను ఉపయోగించుటలో, గానిపౌరులకు ఎట్టిఆటంకములు విచక్షణకల్పింపబడరాదు. ప్రభుత్వోద్యోగములలో చేరుటకు పౌరు లందరికిని సమానావకాశముల నొసంగవలెను. జాతి, మత, కుల, లింగ భేదములవలనగాని, జన్మస్థల, నివాస కుటుంబ విషయిక విభేదములవలనగాని ప్రభుత్వోద్యోగములలో చేర్చుకొనరాదని నిషేధించుట చట్టవిరుద్ధము కాగలదు. మద్రాసురాష్ట్రములో ఆచరణయందున్న "మతవిషయిక నిష్పత్తి సూత్రము" (Communel G. O.) చట్టవిరుద్ధమని భారత ప్రధాన ఉన్నత న్యాయస్థానము తీర్పుచెప్పినది. కొన్ని కారణముల వలన హరిజనులకు, ఆదిమవాసులకు వెనుకబడియున్న యితర తరగతులవారికి ప్రభుత్వము ప్రత్యేక సౌకర్యములను కల్పించినది. వారు తగినంత విద్యావంతులు కానందున, ఇట్టి ప్రత్యేక రక్షణ కొంత కాలమువరకు అవసరము.

మన రాజ్యాంగ చట్టముద్వారా అస్పృశ్యత నిర్మూలించబడినది. అస్పృశ్యతను పాటించువారు శిక్షార్హులుగా పరిగణింపబడుదురు. సహస్రాబ్దములనుండి హిందూ సమాజమును కళంకిత మొనరించిన అస్పృశ్యతా దురాచారము అంతమొందుట, మన భారతీయులకు సంతోషింపదగినవిషయము. విశ్వవిద్యాలయము లొసంగిన పట్టములు, సైనిక

బిరుదులు తప్ప యితర బిరుదులను ప్రభుత్వము నిషేధించినది. ఇట్టి బిరుదులు ఇకముందు యీయబడవు విదేశ ప్రభుత్వములిచ్చు బిరుదులు, బహుమతులు, వేతనము, అధికార పదవులు- మన ప్రభుత్వానుమతి లేనిది యెవరును స్వీకరించగూడదు.

2. ప్రతి వ్యక్తికి వాక్స్వాతంత్ర్యముతో పాటు తన మనోభిప్రాయమును సుస్పష్టముగ ప్రకటించు అధికారముగలదు. ఆయుధములులేక, శాంతియుతముగ, యిష్టమువచ్చినచోట సమావేశమగు నధికారము, పలువురువ్యక్తులుకలసి, సంఘములు, సమితులు, స్థాపించు నధికారము, భారత దేశము నలుమూలలలో యిచ్ఛవచ్చిన తెరగున తిరుగు నధికారము, భారత దేశములో యేభాగములోనైన యెచ్చట నైన స్థావరము యేర్పరచుకొని నివసించు నధికారము, ఆస్తి కలిగియుండుట, సంపాదించుట మరియు క్రయ విక్రయాధికారము, ఏ ఉద్యోగమునైనను యే వృత్తినైనను అవలంబించు నధికారము, తదితర వర్తకవ్యవహారములను జేయు నధికారము, ప్రతి వ్యక్తికి కలదు. వ్యక్తి స్వాతంత్ర్యమనగా, పై అధికారములను యెవరికి యిష్టము వచ్చినట్లు వారు ఉపయోగించవచ్చుననిగాదు. చట్టబద్ధమైన పనులు చేయునంతవరకే వ్యక్తికి స్వాతంత్ర్యముగలదు.

ఎవరైనవ్యక్తి తప్పుజేసినయెడల, ఆ పని న్యాయవిరుద్ధము, తప్పు అని న్యాయస్థానములో విచారణజరిగి నిర్ధారణయగువరకు, అతనిని నిర్హేతుకముగ శిక్షించుటకు వీలులేదు.

ఎంతతప్పుకు అంతశిక్ష విధించవలెనేగాని, తప్పుకుమించినశిక్ష విధించరాదు. దొంగతనమునకు తగినశిక్ష చెఱసాలకు పంపుటగాని, చేతులు ఖండించుటకాదు. నేరస్థునిహింసించి తప్పుచేసినట్లుగా వాఙ్మూలము తీసికొని శిక్షించునాచారము పూర్వముండెడిది. అది ఇప్పుడు చట్టరీత్యా తొలగించబడినది. నేరమును తదితరసాక్ష్యముతో రుజువు పరచవలెగాని, నేరస్థుని వాఙ్మూలముపైనే ఆధారపడి నేరనిర్ణయము

చేయరాదు. అదిగాక ఒక నేరముక్రింద రెండుమారులు శిక్ష విధింప రాదు.

న్యాయవిచారణ చేయక మరణశిక్ష విధింపరాదు. వ్యక్తి స్వాతంత్ర్యమున కవరోధము కల్పింపగూడదు. విచారణచేయక వ్యక్తులను నిర్బంధములో నుంచకుండుటకై ఈ సూత్రము కల్పింపబడినది. అట్లుంచబడినయెడల, హేబియస్ కార్పస్ పిటిషన్ ద్వారా న్యాయ స్థానములలో విచారించవలసినది, లేదా విడుదల గావించవలసినది అని సుప్రీంకోర్టును లేక పార్లమెంటుఅనుమతిపొందిన కోర్టులను కోర వచ్చును. ప్రభుత్వమును పై ప్రకారము చేయునట్లు నిర్బంధించు అధికారము న్యాయస్థానములకు గలదు.

ఏ వ్యక్తినైనను చట్టరీత్యా నిర్బంధించుటకుపూర్వము నిర్బంధ కారణము అతనికి తెల్పవలెను. నిర్బంధించబడినవ్యక్తిని, ఇరువది నాల్గుగంటలలోగా న్యాయాధికారిఎదుట ప్రవేశపెట్టవలెను. న్యాయాధి కారి అనుమతిలేనిది ఇరువదినాలుగు గంటలకుపైగా ఎవరినిగూడ నిర్బంధములో నుంచుటకు వీలులేదు. అతడు కోరిన యెడల న్యాయ వాదులతో సంప్రదించుటకును తన పక్షమున వాదించు నిమిత్తము యిష్టమువచ్చిన న్యాయవాది నియామకమునకును అనుమతి నిచ్చి తీరవలెను.

మానవులను వస్తువులవలె విక్రయించుట, బలాత్కారముగా పనులుగొనుట, వెట్టిచాకిరి, మొదలగు దురాచారములు చట్టవిరుద్ధ ముగా ప్రకటింపబడినవి. పై పనులు చేయువారు శిక్షకు పాత్రులగు దురు. అయితే యుద్ధ సమయాలలో, ప్రజాశ్రేయస్సు కొరకు తప్పక పని చేయవలసినదని ప్రభుత్వము వ్యక్తులను నిర్బంధించ వచ్చును. 14 సంవత్సరముల లోపు బాలబాలికలను కర్మాగారములలో గాని, గనులలో గాని, లేక తదితర కఠినమైన పనులకు గాని నియోగింప రాదు. అట్లు చేయువారు శిక్షకు పాత్రులగుదురు.

జనులకు వ్యక్తిగతముగా సంపూర్ణ మతస్వాతంత్ర్యము గలదు. ప్రభుత్వమునకు మతమునకు ఎట్టి సంబంధము లేదు. మతసంస్థలను పోషించు నిమిత్తము పన్నులు విధించరాదు. అయితే వ్యక్తులు తమ వ్యక్తిగత స్వాతంత్ర్యమును పురస్కరించుకొని మతసంస్థలను స్థాపించి పోషించవచ్చును. అందు పూజా ప్రార్థనాదికములు జరుపుకొన వచ్చును గాని, యీ ప్రార్థనలలో పాల్గొనుమని యెవరిని నిర్బంధింప రాదు. మతము ప్రభుత్వపరము గాక వ్యక్తిపరము చేయబడినది. ప్రభుత్వము మత విషయకములలో ఎట్టి జోక్యము తీసుకొనదు. అయితే మతవిషయికముగా ప్రజాశాంతికి భంగము రానట్లు తగిన కట్టుదిట్టములు ప్రభుత్వము జేయగలదు.

విద్యా వైజ్ఞానిక, సాంస్కృతిక స్వాతంత్ర్యము, ప్రత్యేక భాష, లిపి, సంస్కృతి గల ప్రజాసమూహమునకు తమ విశిష్టతను నిలబెట్టు కొను అధికారము గలదు. అనగా ఆంధ్రులకు ఆంధ్రసంస్థలను స్థాపించి పోషించుకొను అధికారము చట్టరీత్యా గలదు. ఇదేవిధముగ ఇతర భాషా ప్రాంతీయులకు తమ విశిష్టతను కాపాడుకొను అధికారముగలదు. మత, భాషావిషయములలో అల్పసంఖ్యాక వర్గములకు తమతమ విద్యాసంస్థలను నెలకొల్పి విద్యావ్యాప్తి జేసికొను నధికారముగలదు. ప్రభుత్వము విద్యాసంస్థలకు సహాయము చేయునప్పుడు మత భాషా విభేదముల పాటించరాదు. ప్రభుత్వముచే నెలకొల్పబడిన, లేక ప్రభు త్వ సహాయముతో నడపబడుచున్న విద్యాసంస్థలలో మత, జాతి, కు ల, భాషా విభేద కారణముగా వ్యక్తులకు ప్రవేశము నిరాకరింప వీ లులేదు.

వ్యక్తులనుండి వారి సొంత ఆస్తిప్రభుత్వమువశపరచుకొను అవ సరము గలిగినప్పుడు అట్టి ఆస్తియొక్క యజమానులకుతగిన ప్రతిఫలము ముట్టజెప్పనిదే ఆ స్తిని స్వాధీనపరుచుకొనుటకు వీలులేదు. భూస్వాధీన చట్టము భారతదేశమంతటను అమలులోనున్నది. ఈ చట్టములో

చూపించబడిన విధానము ననుసరించి మాత్రమే వ్యక్తుల ఆస్తులను స్వాధీన పరుచుకొనవచ్చును. భూస్వాధీన చట్టము నతిక్రమించిన యెడల ఆ స్తిపై దురాక్రమణ జరిపినట్లుగా భావించి, పోలీసు సహాయముతో ఇట్టి దురాక్రమణ తొలగింపవచ్చును. భారత దేశ సుప్రీంకోర్టుకు మరియు, పార్లమెంటు అనుమతితో యితర హైకోర్టులకు [illegible]స్వత్వములను సంరక్షించు బాధ్యతతో పాటు, వాటిని అమలు పరచు ప్రత్యేకాధికారములు యీయబడినవి. హేబియస్ కార్పస్, మాండమస్, ప్రొహిబిషన్, క్వోవారంటో, సెర్టియోరిరి, అని యివి అయిదు విధములైన అధికారములు.

విచారణ లేక ఏవ్యక్తినైనను కారాగార బద్ధుని చేసిన యెడల వెంటనే విచారణ జరుపవలసినది లేదా వదిలిపెట్ట వలసినదని సుప్రీం కోర్టు లేక హైకోర్టు (హేబియస్ కార్పస్ ద్వారా) ప్రభుత్వమును ఆజ్ఞాపించవచ్చును. ఈ ఆజ్ఞను అతిక్రమించుటకు భారత రిపబ్లిక్ అధ్యక్షునకు కూడ అధికారము లేదు. దీనిపై అపీలు గూడ లేదు. హేబియస్ కార్పస్ వ్యక్తి స్వాతంత్ర్యమును సంరక్షించుటకు ఏర్పడిన ప్రత్యేక సూత్రము. ఇది అధికారోన్మత్తుల అధికార దుర్వినియోగమును నివారించు అంకుశము వంటిది.

న్యాయముగా జేయవలసిన విద్యుక్త ధర్మమును [illegible] వ్యక్తులు గాని ప్రభుత్వాధికారులుగాని పాటించనియెడల అట్టి విద్యుక్త ధర్మమును తప్పక చేసి తీరవలసినదిగా, సుప్రీంకోర్టు అట్టి వ్యక్తులను ఆజ్ఞాపించగలదు. దీనిని మాండమస్ అనెదరు. ఎవరైనా ప్రభుత్వాధికారులు తగిన అధికారము లేక అధికార పీఠమును అధిష్టించిన యెడల తమ అధికార పత్రమును చూపించవలసినది, లేదా గద్దెనుంచి దిగవలసినదని ఆజ్ఞాపించునది "క్వోవారెంటో".

తమ అధికారమును మించి ప్రభుత్వాధికారులు ప్రవర్తించిన యెడల వారిని అట్టిపనులు చేయకూడదని ఆజ్ఞాపించునది "రిట్ ఆఫ్ ప్రొహిబిషన్". క్రింది అధికార్లు చట్టప్రకారము కేసులను విచారించని

మెడల న్యాయానుసరణముగ తగువిచారణ జరుపునిమిత్తం తత్సం
ంధమైన పత్రములను పై అధికారులకు పంపవలసినదిగా ఆజ్ఞాపించు
ది "రిట్ ఆఫ్ సెర్టియూరెరి."

పార్లమెంటుచట్టముద్వారా, పైసూత్రములను, శాంతిసంరక్షక
ళములకు, సాయుధదళములకు క్రమశిక్షణ అలవరింపజేయు ఉద్దేశ్య
ములో, అనువర్తింపకుండునట్లు చేయవచ్చును. శాంతి రక్షణోద్దేశ్య
ముతో ప్రత్యేకావసరసమయములందు పైసూత్రములను అతిక్ర
మించినవారిని నిర్దోషులుగా ప్రకటించునధికారము పార్లమెంటుకు
లేదు.

భారతదేశమంతట ప్రాథమికహక్కుల పరిరక్షణ ఒకే విధ
ముగా జరుపునిమిత్తము, ఇట్టి ప్రత్యేకాధికారములు భారతపార్లమెం
టుకు, భారత సుప్రీంకోర్టుకు యీయబడినవి. తన్మూలముగా భారత
పౌరసత్వ సంరక్షణభారముసహితము వారే వహించుచున్నారు.

## రాజనైతిక ధర్మసూత్రములు

భారత రాజ్యాంగచట్టపు నాల్గవభాగములో ఉదహరించబడిన
నీతిసూత్రములను అమలుపరచుటకు న్యాయస్థానములకు అధికారము
యీయబడలేదు. అయినప్పటికి అధికారములోనున్న మంత్రులు,
శాసనసభ్యులు యీ సూత్రముల కనుగుణ్యముగ, శాసనములను
ప్రవేశపెట్టి ఆమోదించవలసినదని ఆదేశింపబడినది. ఇది ఆదేశమే
గాని ఆజ్ఞకాదు. శాసనసభ్యులు, మంత్రులు యీ సూత్రముల ననుస
రించవలెనన్న నియమము లేకపోయినప్పటికి, వీటిని పాటించు విష
యములో వారు తమను యెన్నుకొనిన ప్రజలకు బాధ్యులుగా తలంచ
బడెదరు. ఈ ప్రజాస్వామిక రాజ్యములో ప్రజలే సర్వాధికార సంప

న్నలు, సార్వభౌములు. వారు తమ ప్రతినిధులైన గవర్నర్లకు, మంత్రులకు, శాసన సభ్యులకు, మంచిచెడ్డలు, ఉచితానుచితములగురించి యిచ్చిన సలహాలవంటివే యీ ధర్మసూత్రములు. 1935 భారత రాజ్యాంగ చట్టములో గవర్నర్లకు యిట్టి సలహాపత్రికలీయబడినవి. వీనిని ఇన్స్ట్రుమెంట్సు ఆఫ్ ఇన్స్ట్రక్షన్సు అని వ్యవహరించుచుండిరి. న్యాయపరిపాలనకై యిట్టి సలహాలు యెంతయో అవసరము.

ఆధునికయుగములో ప్రజాస్వామిక ప్రభుత్వము పార్టీ పద్ధతులపై ఆధారపడియున్నది. ఏ పార్టీ అధికారములో నున్నప్పటికిని ప్రభుత్వాదర్శములు నిశ్చలముగా నుండవలెనన్న మహత్తరోద్దేశము దృష్టిలోనుంచుకొని, యీభాగము రాజ్యాంగములో చేర్చబడినది. నేటి ప్రపంచమున ఐర్లాండులోతప్ప, మరేదేశమునందును, యిట్టి ఆదర్శములు రాజ్యాంగచట్టములో నుదహరింపబడలేదు. నిజముగా యీ సూత్రములు అధికారయుతములు గానందున రాజ్యాంగచట్టపు నాల్గవభాగములోగాక, మూడవషెడ్యూలుచివర చేర్చియుండిన బాగుండెడిది. భారతరాజ్యాంగ చట్టపు సెక్షన్ 38 నుండి 51 వరకు యీ సూత్రము లుదహరింపబడినవి.

ప్రజలజాతీయజీవనమునకు సంబంధించినసంఘములలో, సామాజిక, ఆర్థిక, రాజకీయ సమత్వన్యాయము చిరస్థాయిగావించి తద్వారా ప్రజాభ్యుదయమునకు దోహద మొసంగుటకై ప్రభుత్వము కృషి సల్పవలెను. స్త్రీ పురుషులైన సమస్త పౌరులకు సమానముగా తగిన జీవనవృత్తి కల్పించవలెను. సమస్తజనులకు శ్రేయోదాయకమగు విధముగా, జాతియొక్క ఆర్థిక సంపదను విభజించి అనుభవించు విధానమును నిర్ణయించవలెను. ధనము, ఆర్థిక సాధనసంపత్తియే కొద్దిమంది చేతులలోనో కేంద్రీకరింపబడి జనసామాన్యమునకు నష్టదాయకముగాకుండునటుల దేశ ఆర్థికవిధానమును సవరించవలెను. స్త్రీ పురుషులకు సమానముగా సమానమగు పనికి సమానవేతనము నొసంగవలెను. అనారోగ్యకరములు, అతి కఠినములగు పనులకు వారిని

నియోగించరాదు. ముఖ్యముగా చిన్నబాలబాలికలతో, వారివయసు మరియు, శక్తికిమించిన పనులు చేయించరాదు. ఆర్థికదుస్థితి యేర్పడి వారట్టిపనులు చేయనిచ్ఛగించినను, వారి ఆర్థికదుస్థితిని తొలగించుటకు ప్రభుత్వము తక్షణచర్యతీసికొనవలెను. బాలురు,యువకులు నిర్ధనులై అమర్యాదకరమైన వృత్తులలో ప్రవేశించకుండ కాపాడుచుండవలెను. వారి కార్యశక్తిని దుర్వినియోగపరచక, ప్రభుత్వమే తగు సంఘసంస్కరణను పూనుకొనవలెను.

ప్రభుత్వము గ్రామపంచాయతీల పునరుద్ధరించి, తద్వారా గ్రామపరిపాలన సాగించవలెను. ప్రాచీనభారతదేశములో గ్రామపంచాయతీలు ప్రజలకు పెట్టనికోటలై వారిని కష్టములనుండి కాపాడుచు, గ్రామజీవనమును సుఖవంతము జేయుచుండెడివి. క్రమేణ మహమ్మదీయుల కాలములో వాటిశక్తి సన్నగిలి బ్రిటిషువారి పరిపాలనక్రింద నలిగి సమసిపోయినవి. పంచాయితీలు గ్రామీణజీవనమునకు ప్రాణము వంటివి.

పనిలేనివారికి పనికల్పించుట, విద్యావిహీనులకు విద్యగరపుట, నిరుద్యోగులకు జీవనాధారముగల్పించుట, వయోవృద్ధులకు, వికలాంగులకు రోగులకు తదితర నిస్సహాయులకు తగిన ఆర్థికసహాయముచేయుట ప్రభుత్వవిధియైయున్నది. కార్మికులకు, మానవ సహజమైనసౌకర్యములు మరియు స్త్రీలకు ప్రసూతియేర్పాట్లు ప్రభుత్వము చేయవలయును. పారిశ్రామిక వ్యవసాయక కూలీలకు పనులుగల్పించుటేగాక, సామాన్యజీవనమునకు సరిపోవు వేతనము నీయవలెను. సామాజిక సాంఘికవినోదములు, తీరుబడిసమయాలలో సౌఖ్యముగా ప్రొద్దుబుచ్చ నవకాశము లుండవలెను. గ్రామాలలో ముఖ్యముగా సహకార సంఘములద్వారా లేక వ్యక్తిగతముగా, గ్రామ పరిశ్రమలకు ప్రోత్సాహము నొసంగవలెను.

భారతదేశమంతటికి ఒకే సివిల్ కోడ్ అమలులోనుండునట్లు చేయవలెను. ఈ రాజ్యాంగచట్టము అమలులోనికి వచ్చిన తేదీనుండి

పదిసంవత్సరములలోగా, 14 సంవత్సరముల లోపు బాలబాలిక లందరికి నిర్బంధముగా విద్య నేర్పవలెను.

జనసామాన్యములో నూటికినూరుమంది విద్యావంతులై, యుక్తాయుక్త జ్ఞానము, విచక్షణ కలిగియుండిననేగాని ప్రజాస్వామిక పరిపాలన జయప్రదము కాజాలదు.

వెనుకబడియున్న తరగతులవారికి ముఖ్యముగా, షెడ్యూలులో చేర్చబడినమతవుల, మరియు జాతులవారికి విద్యనేర్పుట, ధనార్జనకు సాధనములుసమకూర్చుట ప్రభుత్వవిధియైయున్నది. వారికి సంఘములో అన్యాయము జరుగకుండునట్లును వారి అమాయకత్వమువలన యితరులు అక్రమలాభము పొందకుండునటును వారిని కాపాడవలసియున్నది.

మనదేశములో పుష్టికరమైన ఆహారము సమృద్ధిగా లభింపక యెందరో వివిధ రోగముల పాలగుచున్నారు. కావున జాతి ఆరోగ్యవంతముగా నుండవలెనన్న పుష్టికరమైన ఆహారము సమృద్ధిగా ఉత్పత్తి చేయవలెను. ఆరోగ్యాభివృద్ధికై, వైద్యసహాయము, విరివిగా లభించునట్లు జేయవలయును. మద్యపానము, మత్తుపదార్థముల ఉపయోగము వలన, మనదేశ ప్రజలు చాలామంది ధనమునేగాక, ఆరోగ్యమును సైతము కోల్పోవుచున్నారు. కావున మద్యపాన నిషేధము విధిగా దేశములో ప్రవేశ పెట్టవలెను.

వ్యవసాయము, పశుసంపద, ఆధునిక పద్ధతులపై శాస్త్రీయముగా వృద్ధిచేయుటేగాక, మేలురకపు పశువుల నభివృద్ధి పరచుటకు ప్రయత్నము చేయవలెను. పాలిచ్చు పశువులను, వ్యవసాయ పశువులను, దూడలను, చంపు పద్ధతిని నిషేధించవలెను.

మనదేశ ప్రాచీన చరిత్రకు సంబంధించిన పురాతత్వ వస్తుసంచయమును కాపాడుట మనవిధియై యున్నది. తద్వారా మన దేశ పూర్వౌన్నత్యమును స్మరణకు తెచ్చుకొను నవకాశము కలదు.

మన దేశములో న్యాయవిచారణ శాఖ, ప్రభుత్వ కార్యనిర్వాహణశాఖలను విడదీయునవసర మెంతయోగలదు. రెంటిని ఐక్యపరచుటవలన, అధికార దుర్వినియోగమునకు, దౌర్జన్యమునకు అవకాశము కలుగుచున్నది. న్యాయ, కార్యనిర్వాహకశాఖల విభజన హైదాబాదు రాష్ట్రములో 1922 లోను, మద్రాసు రాష్ట్రములో 1950 లోను ప్రారంభింపబడినది.

ప్రపంచములోని వివిధరాజ్యములమధ్య సౌజన్యము, స్నేహభావము, శాంతిభద్రతల నెలకొల్పుట ప్రభుత్వము యొక్క విధి. అంతరరాష్ట్రీయ న్యాయసూత్రములనుల ననుసరించుచు, సంధిషర్తుల పాటించవలసిన బాధ్యత ప్రభుత్వముపై గలదు. వివిధ రాజ్యముల మధ్య వివాదము సంభవించిన, దానిని సర్వసమ్మతముగా. మధ్యవర్తుల ద్వారా పరిష్కారము చేసుకొను నియమము నంగీకరించవలయును. ఈ సూత్రములకు వ్యతిరేకముగా శాసనాధికారములు ఉపయోగించిన యెడల, ప్రభుత్వము ప్రజల అసమ్మతికి పాత్రమై, ఎన్నికలసమయాలలో పరాజయము పొందు నవకాశము గలదు.



౬

# కేంద్ర పరిపాలనశాఖ

## అధ్యక్షుడు

భారతసమాఖ్యకు అధినేత అధ్యక్షుడు. సర్వాధికారములు అతనిపేరుతో లేక అతనిచేస్వయముగ వినియోగింపబడును. రాజ్యాంగవిధానము ననుసరించి, యీ అధికారములు వినియోగింపబడవలెను. ప్రతిముఖ్యవిషయములో ప్రజాప్రతినిధుల సమ్మతి, ప్రధానమంత్రి ద్వారా తీసికొనవలసినవిధి రాజ్యాంగములో చేర్చబడినందున, ప్రజాభిప్రాయమునకు వ్యతిరేకముగ, అధ్యక్షుడేపనియు చేయజాలడు. రాజ్యాంగసూత్రముల, నిరంకుశముగ నతిక్రమింపజూచిన అధ్యక్షునిపదవీభ్రష్టునిజేయుటకు ప్రజల కధికారముగలదు. సర్వసైన్యాధ్యక్ష పదవి గూడ అధ్యక్షునికేగలదు. ఈ అధికారనిర్వహణకు తగిన కట్టుబాట్లు చట్టబద్ధము గావింపబడినవి. అందు సమయానుకూలముగ మార్పులు చేయు అధికారము పార్లమెంటుకుగలదు.

ప్రజలచే యెన్నుకొనబడిన, కేంద్ర పార్లమెంటుసభ్యులు, రాష్ట్ర శాసనసభ్యులు కలిసి ఒక ఎన్నికలసభగా ఏర్పడుదురు. వీరు అధ్యక్షుని ఎన్నుకొనెదరు. ప్రభుత్వముచే నియమితులగు సభ్యులకు, అధ్యక్షుని యెన్నికలో వోటింగుహక్కు ఉండదు. అధ్యక్షునిఎన్నికలో, పార్లమెంటుసభ్యులకు, యెక్కుడు ప్రాధాన్యముగలదు. ఎన్నుకొనబడిన

వివిధ రాష్ట్ర శాసనసభాసభ్యులందరు కలిసి వేయు వోట్లకు సమానముగా పార్లమెంటు గాని ఎన్నికైన సభ్యులు వోటు చేయగలరు.

సభ్యుల వోట్ల సంఖ్య యీ క్రింది విధముగ నిర్ణయించబడును.

(a) రాష్ట్ర జనాభాను, ఎన్నికైన రాష్ట్ర శాసన సభాసభ్యుల సంఖ్యచే విభాగించగా వచ్చిన గుణమును, తిరిగి వేయిచే భాగించిన వచ్చు గుణము (Quotient) ప్రతి శాసనసభ్యునికిగల వోట్ల సంఖ్యకు సరిపోవును.

(b) రెండవ భాగాహారములో శేషము 500ను మించియున్న ఇంకొక వోటు కలుపుకోవలెను.

(c) పై రెండువిధానములలో వచ్చు మొత్తము ఓట్లసంఖ్యను ఎన్నికఅయిన పార్లమెంటుసభ్యుల సంఖ్యచే విభాగించగా వచ్చు గుణమునకు సరియగు సన్ని వోట్లు, ఎన్నికఅయిన ప్రతి పార్లమెంటరీ సభ్యుడు వేయగలుగును.

పై విధమున జనసంఖ్యా నిష్పత్తి ననుసరించి వోట్ల సంఖ్యను నిర్ణయించుటను క్రమనిష్పత్తి ప్రజాప్రాతినిధ్య విధానమందురు. ఇక సంక్రమణ వోటింగు విధానము క్రింద సూచించనైనది.

అధికార పదవికి పోటీ చేయువారి సంఖ్య మూడు గాని, అంత కెక్కువ గాని వున్నప్పుడే, యీ విధానము వర్తించును. ముగ్గురు కంటె తక్కువ సంఖ్య యున్నప్పుడు సామాన్య అధికసంఖ్యాక వోటింగు విధానము (ordinary majority - vote system) వర్తించగలదు, భారత అధ్యక్షపదవికి A. B. C. అను ముగ్గురు వ్యక్తులు పోటీ చేసిరనుకొనుడు. 500 మంది పార్లమెంటరీ సభ్యులలో ప్రతి సభ్యుడు 600 వోట్లు అధ్యక్షుని యెన్నుకొనుటకై వేయవచ్చును. 1500 మంది రాష్ట్ర శాసన సభాసభ్యులలో ప్రతి సభ్యుడు 200 వోట్లు

వేయవచ్చును. ఓట్ల సంఖ్య a. b. c. సూత్రముల ననుసరించి గ్రహించితిమి. పార్లమెంటు సభ్యులకు, రాష్ట్ర శాసనసభ్యులకంటె మూడు రెట్లు యెక్కువ ప్రాధాన్యము యీయబడినది. మొత్తము ఓట్ల సంఖ్య నెరసి ఆరులక్షలు. అధ్యక్షపదవికి పోటీచేయు అభ్యర్థికి 2 లక్షల వోట్లకు తక్కువ వచ్చిన యెడల యెన్నుకొనబడు అవకాశమే లేదు గావున, అట్టి అభ్యర్థి పేరు కొట్టివేసి, అతని ఓట్లు మిగతా ఇరువురి మధ్య పంచివేయుదురు. ఓటింగు పత్రములో ప్రతివోటరు రెండు పేర్లను వ్రాయవలెను. మొదటిస్థానములో సూచింప బడినవ్యక్తి గెలుపొందనిచో, ఆ వోటు, రెండవ స్థానములో సూచించిన అభ్యర్థికి సంక్రమించవలెను అనుభావము, చెప్పకయే, యీ విధానములో సూచితమై యుండును. A. కు 2,50,000, B. కు 2,30,000, C. కు 1,20,000 ఓట్లు వచ్చినవనుకొనుము. C. గెలుపొందు అవకాశము లేనే లేదు గావున, అతని పేరు మొదటి స్థానములో నుండి, రెండవ స్థానములో B. పేరు సూచితమైన ఓట్లు, B. కి సంక్రమింప గలవు. అట్లే రెండవ స్థానములో A. పేరు సూచితమైన ఓట్లు A కు సంక్రమించ గలవు. ఈ విధముగ B. కి 80,000 ఓట్లు A. కు 40,000 ఓట్లు వచ్చిన వనుకొనుము. అప్పుడు A,B. ల మొత్తము ఓట్ల సంఖ్య 2,90,000, 3,10,000 క్రమముగా నగును. ఈ విధముగ B. అధ్యక్షపదవిని గెలుపొందినట్లు తేలగలదు. సామాన్య అధిక సంఖ్యాక వోటింగు విధానము ననుసరించిన యెడల, C. వోట్లు, A-B- ల మధ్య పంచబడవు. A. కు B. కంటె 20,000 వోట్లు యెక్కువవచ్చినవి గావున A. అధ్యక్షపదవిని గెలుపొంది నట్లగును. గాని సంక్రమణ వోటింగు విధానము ప్రకారము B. అధ్యక్షుడు. కారణమేమన, C. అనువ్యక్తి పోటీ చేసియుండని యెడల, B. కు 3,10,000, ఓట్లు A. కు 2,90,000, ఓట్లు వచ్చి యుండెడివి. B. అధిక సంఖ్యాక వర్గముచే యెన్నుకొనబడి అధ్యక్షుడు కాదగినవాడు. గెలుపొందని అభ్యర్థులకు వేసిన వోట్లు వృధా పోకుండునట్లు, అధ్యక్షపదవి యెన్నికకు ఈ విధానము అవలంబింప బడినది.

బహుళసంఖ్యాక నియోజకవర్గమునుండి సభ్యుల నెన్నుకొను టకుగూడ, ఈ విధానము కొద్దిమార్పులతో ఆచరణలోగలదు. ఎన్నికకు అవసరమైన కనీసపు ఓట్లసంఖ్య ప్రభుత్వమే నిర్ణయించును. ఏ అభ్యర్థికైన, కనీసపుసంఖ్యకంటె యెక్కుడుఓట్లువచ్చిన, అతనివిజయమునుప్రకటించి, ఎక్కువగావచ్చిన ఓట్లను స్థానక్రమమునుబట్టి మిగతా అభ్యర్థులకు పంచివేయుదురు. కనీసపుసంఖ్యను అతిక్రమించిన రెండవ వ్యక్తినిగూడ యెన్నికలలో గెలుపొందినట్లు ప్రకటింతురు. ఇరువురు సభ్యులను ఎన్నుకొనవలసి, అభ్యర్థులసంఖ్య అంతకెక్కుడుగా నున్నప్పుడు, ఈ క్రమమును ఒకమారు, ముగ్గురుసభ్యుల నెన్నుకొనవలసినప్పుడు, రెండుమార్లు, నల్గురుసభ్యుల నెన్నుకొనవలసినప్పుడు, మూడుమార్లు, ప్రయోగింతురు. భారతరాజ్యాంగములో ఇట్టిఆవసరము ఆరుదు.

$$\frac{\text{ఓటర్ల సంఖ్య}}{\text{స్థానములసంఖ్య} + 1} + 1 = \text{కనీసపుఓట్లసంఖ్య.}$$

కనీసపుఓట్లసంఖ్యను నిర్ణయించుటకిది సులభసూత్రము.

అధ్యక్షుడుకాదగినవ్యక్తి, భారతపౌరుడై యుండి, 35 సంవత్సరముల వయసుమీరి యుండవలెను. కేంద్ర శాసనసభకు సభ్యుడుకాదగిన అర్హతకలిగియుండవలెను. రాష్ట్ర, కేంద్రప్రభుత్వములనుండి, నేరుగా వేతనము దీసికొనువ్యక్తి, లేక పైప్రభుత్వముల అధీనమునందుగల సంస్థలనుండి వేతనముగైకొనువ్యక్తి, అధ్యక్షపదవికి అనర్హుడు. కేంద్ర, రాష్ట్రప్రభుత్వముల మంత్రులకు, గవర్నర్లకు, రాజప్రముఖ, ఉపరాజప్రముఖులకు, భారతప్రభుత్వ ఉపాధ్యక్షునకు యీ సూత్రమువర్తించదు.

అధ్యక్షపదవి కాలపరిమితి, అధ్యక్షపీఠము నధిష్ఠించిన తేదీనుండి అయిదుసంవత్సరములు. నూతనముగ ఎన్నుకొనబడినఅధ్యక్షుడు అధికార స్వీకారము చేయువరకు, ప్రాతఅధ్యక్షుడు అర్హతగలిగియుం డు

గలడు. తన ఉద్యోగకాలములో, ఉపాధ్యక్షునికి తెలిపి, అధ్యక్షు స్వచ్ఛందముగ, తన పదవినుండి విరమింపవచ్చును. లేదా, రాజ్యాంగవిధానమును ధిక్కరించి, అతిక్రమించినాడను, అభియోగము తే బలవంతముగ అధ్యక్షపదవినుండి తీసివేయబడవచ్చును.

కేంద్ర శాసనసభ లేక శాసనసమితి యొక్క నాల్గవవం సభ్యులు, లిఖితపూర్వముగ, 14 రోజుల వ్యవధినిచ్చి, కోరినయెడ అధ్యక్షుని అభియోగ తీర్మానము శాసనసభ లేక సమితిలో ప్రవేశెట్టబడవలెను. ఆ సభ లేక సమితి మొత్తము సభ్యులలో 2/3 గ్గ ఆమోదించిన యెడల, రెండవ సంస్థయగు సమితి లేక సభ, అభియోగమును విచారించును. అభియోగము స్థిరపడిన యెడల అధ్యక్షు పదవీభ్రష్టుని జేయవలసినదిగా, ఆ సభ లేక సమితి, మొత్తము సభలలో 2/3 గ్గురు ఆమోదముతో తీర్మానించును. ఇట్టి తీర్మాన తరువాత, అధ్యక్షుడు తొలగింపబడి, నూతనాధ్యక్షుని యెన్ని జరుగునంతవరకు ఉపాధ్యక్షుడు, యీ పదవిని నిర్వహింపను గల నూతన ఎన్నిక ఆరు నెలల లోగా జరుగవలెను.

అయిదు సంవత్సరముల కాలపరిమితి తీరినతరువాత, అధ్యక్షుడు, తిరిగి ఎన్నికకై పోటీ చేయవచ్చును. ఇట్లు ఎన్నిమారు పోటీ జేసినను తప్పు లేదు. అమెరికాలో, అధ్యక్షుడు రెండు తడవల మించి ఆ పదవిలో నుండరాదను ఆచారముండెడిది. కాని రూజువెల్ట కాలములో ఈ నియమము ఉల్లంఘింపబడినది. ఉద్యోగ రీత్యా, అత చేసిన ఏ పనిని గురించి విచారించుటకు న్యాయస్థానముల కధికారవ లేదు. ఉద్యోగములో నున్నంతకాలము, అతనిపై క్రిమినలు అభియోగము తెచ్చుటకు వీలులేదు. అతనిని అరెస్టు చేయుటకును, నిర్బంధించుటకును యెవరికిని అధికారము లేదు. అధ్యక్షునిపై సివిలు న్యాయ్యవ వేయువారు, ముందుగా రెండునెలల నోటీసు నివ్వవలెను.

అధ్యక్షుడు కేంద్ర కార్యనిర్వాహణ శాఖకు అధిపతి. ప్ర భుత్వముకు గల శాసనాధికారము లన్నియు, అధ్యక్షుని ఆమోదముతో

కార్యరూపమును దాల్చగలవు. రాజ్యాంగ విధానములో సూచించిన క్రమము ననుసరించి తాను స్వయముగా లేక, తనకు సహాయులగు, ప్రధానమంత్రి, తదితర మంత్రులద్వారా పనులు చేయించును. కేంద్ర శాసనసభలో అధికసంఖ్యాకవర్గ నాయకునిపిలిచి ప్రధానమంత్రిత్వము అతనికి అప్పగించవలసినబాధ్యత అధ్యక్షునిది. ప్రధానమంత్రి సలహా ననుసరించి, ఇతరమంత్రులను అధ్యక్షుడు నియమించును. ప్రభుత్వ శాఖల విభజించి మంత్రులకిచ్చునదిగూడ అధ్యక్షుడే. కేంద్రప్రభుత్వ అధికారపత్రికటనలు, ఉత్తరువులు అధ్యక్షుని పేరుతో వెలువడగలవు.

షెడ్యూలులోని (సి) వర్గములో చేర్చిన రాష్ట్రముల పరిపాలనా బాధ్యత అధ్యక్షునిపై గలదు. అజ్మీరు, భూపాలు, కూర్గు, ఢిల్లీ ప్రాంతములను, చీఫ్‌కమీషనరు లేక లెఫ్టినెంటు గవర్నరుసహాయములో పరిపాలించగలడు. సౌలభ్యముకొరకు ప్రక్కగానున్న రాష్ట్రగవర్నరు ద్వారాగూడా వీనిని పరిపాలించవచ్చును.

(ఎ). రాష్ట్రముల గవర్నరులను, (బి) రాష్ట్రముల రాజప్రముఖ, ఉపరాజ ప్రముఖులను అధ్యక్షుడు నియమించును. అధ్యక్షుని అనుమతి యున్నంతకాలము, వారాపదవిలో నుండగలరు. వారా పదవికి రాజీనామానివ్వదలచిన అధ్యక్షునికి తెలియపరచవలెను. అండమాన్, నికోబారు దీవులను, చీఫ్ కమీషనరు ద్వారా పరిపాలించగలడు.

భారతప్రభుత్వ ముఖ్యోద్యోగులను అధ్యక్షుడు నియమించును. ఇట్టి నియామకమునకు తగిన నిబంధనలను అధ్యక్షుడే ఆమోదించి, అమలుపరచును. సివిలు సర్వీసు, రక్షణ సర్వీసు, పోలీసు సర్వీసు, తదితర కేంద్రసర్వీసులందలి ఉద్యోగుల, నియామకము, ఉపసంహరణ అధ్యక్షుని అధీనము. భారత అటర్నీ జనరలు, ఆడిటరు జనరలు, హైకోర్టు, సుప్రీం కోర్టుల న్యాయమూర్తులను, నిమ్నజాతులు, కులముల స్పెషల్ అధికారిని, యూనియన్ సర్వీసు కమీషన్ అధ్యక్షుని, అందలి సభ్యులను నియమించుటకును, ఉపసంహరించుటకును అధ్యక్షున కధికారము

గలదు. ఆయన యూనియన్ సర్వీసు కమీషన్ పరిపాలన రిపోర్ట
పరిశీలించగలడు.

భారత ప్రభుత్వము జేయు ఒడంబడిక లన్నియు అధ్యక్ష
పేరుతో నుండగలవు. వాని ఫలితములకు, అధ్యక్షుడు వ్యక్తిగతవ
బాధ్యుడు కాడు.

## అధ్యక్షునికి పార్లమెంటుతో గల సంబంధము

పార్లమెంటులో రెండు భాగములు గలవు (1) కౌన్సిలు
స్టేటు లేక కేంద్రశాసనసమితి (2) ప్రజా శాసనసభ ( House of t
people ) సంఘసేవ, వైజ్ఞానము, కళలు, సారస్వతము నందు ప్ర
కానుభవము, సమర్థత గలవారిని పన్నెండు మందిని శాసనసమితి
నియమించుటకు అధ్యక్షున కధికారము గలదు. సమితి చైర్మన్ లే
డిప్యూటీ చైర్మను స్థానములు ఒకే పర్యాయము ఖాళీ అయినప్పు
చైర్మనును నియమించుట, అధ్యక్షుని విధి. శాసనసభాసభ్యులంద
ఎన్నుకొనబడిన వారై యుందురు. అందు ఆంగ్లో ఇండియనులకు త
ప్రాతినిధ్యము లేక అన్యాయము జరుగగలదని తోచిన యెడల ఇద్ద
ఆంగ్లో ఇండియన్ సభ్యులను, శాసనసభకు నియమించవచ్చును. శా
సభాధ్యక్షుడగు స్పీకరు, డిప్యూటీ స్పీకరు స్థానములు ఒకే పర
యము ఖాళీ అయిన, అధ్యక్షుడు ఎవరేనొక సభ్యుని స్పీకరుగా నిం
మించవచ్చును. అధ్యక్షుని సమక్షమున, లేక అతనిచే నియమింపబడి
వ్యక్తి సమక్షమున, పార్లమెంటు ప్రతిసభ్యుడు, భారత రాజ్యాంగ
మకు బద్ధుడనై యుండెదనని ప్రమాణము స్వీకరింపవలెను. పార్లమె
టుకు ఎన్నికలు జరుపు నిమిత్తం ఎన్నికల కమీషన్ నియమింపబడున
ఎన్నికలకు పోటీచేయు అభ్యర్థులకు తగిన అర్హత కలదా లేదా యను
విషయము, ఎన్నికల కమీషన్ సభ్యులను సంప్రదించి అధ్యక్షుడు ని
యించును. ఇట్టి నిర్ణయమునకు తిరుగులేదు.

సమయము, స్థలము నిర్ణయించి, శాసనసభను, లేక సమితిని, లేక రెంటిని, ఆరు నెలలకొకపర్యాయము అధ్యక్షుడు సమావేశపరచును. ఇట్టి సమావేశముల కాలపరిమితి నిర్ణయించుట, ఉపసంహరించుట, లేక మొత్తముపార్లమెంటునే రద్దుగావించుట, అధ్యక్షుని అధీనము. అధ్యక్షుడు పిలువనిదే పార్లమెంటు సమావేశమగుటకు వీలులేదు. కొన్ని దేశములలో, శాసనసభ (ప్రజాప్రతినిధిసభ) ను రద్దుచేయుటకు, సమితి (upper House) అంగీకారము అవసరము. భారతరాజ్యాంగములో యిట్టి సంప్రదింపుకు అవకాశములేదు. శాసనసభా సమితులకు విడివిడిగాగాని, లేక సంయుక్తసమావేశమునందుగాని సంబోధించుటకు అధ్యక్షున కధికారముగలదు. పార్లమెంటు సమావేశమయినప్పుడు, అధ్యక్షుడు, దేశ, కాల, పరిస్థితులను ప్రభుత్వకార్యకలాపములను సమీక్షించుచు, అత్యవసరమగు శాసననిర్మాణమును సూచించుచు, ఒక ప్రారంభోపన్యాసముచేయును. పార్లమెంటును ప్రారంభించుచు, ఇంగ్లాండు దేశపురాజు తప్పకగావించు, ఉపన్యాసమునకు ఇది అనుకరణము. కొన్ని ప్రత్యేకవిషయములను చర్చించవలసినదిగా, అధ్యక్షుడు, ఉభయసభలను ఆదేశించవచ్చును. ఇట్టి ఆదేశములను వారువిచారించి తీరవలెను.

పార్లమెంటు (శాసనసభ - శాసనసమితుల) సంయుక్తసమావేశము జరిపించుటకు అధ్యక్షున కధికారముగలదు. పార్లమెంటుచే ఆమోదింపబడిన, ఆర్థికవిషయములకు సంబంధించనిబిల్లును అధ్యక్షుడు పునర్విచారణకై, కొన్నిసూచనలతో సహా, పార్లమెంటుకుపంపవచ్చును. ప్రతిబిల్లు, అధ్యక్షుని సంతకముతో చట్టమగును. ఆర్థికవిషయములకు సంబంధించినబిల్లులు అధ్యక్షుని పూర్వానుమతితో, మంత్రిమండలిచే పార్లమెంటునందు ప్రతిపాదింపబడును. కావున పార్లమెంటు ఆమోదించినంతనే వాటిపై అధ్యక్షుడు తప్పనిసరిగసంతకముజేసి చట్టబద్ధముగావించును. హైకోర్టు న్యాయమూర్తులను లేక సుప్రీంకోర్టు న్యాయమూర్తులను, ఆడిటర్ జనరలును పదవినుంచితొలగించవలెనన్న పార్ల

మెంటు, అధ్యక్షునికి విన్నపము సమర్పింపవలెను. వారిని నియమించు నది అధ్యక్షుడుగావున ఆయనయే వారిని తొలగించగలసమర్థుడు.

పార్లమెంటు సమావేశముగానప్పుడు, క్లిష్టపరిస్థితులలో, అధ్యక్షుడు ప్రత్యేకశాసనములను (Ordinances) గావింపవచ్చును. పార్లమెంటు సమావేశముకాగానే సభ్యులు, యీ శాసనమును పునర్విమర్శించి, అవసరములేనిచో రద్దుచేయగలరు. ఈ ఆర్డినెన్సులు పార్లమెంటులో విచారణకురానియెడల, పార్లమెంటు సమావేశమైన ఆరు వారములకు, అవి సహజముగ రద్దుకాగలవు. పార్లమెంటులో ప్రధానమంత్రి చేయు ప్రతిపాదనలు, మరియు నిర్వహించు కార్యక్రమమంతయు, అధ్యక్షుని పేరుతో జరుగును గావున, ప్రధానమంత్రి అధ్యక్షునికి ముఖ్య సలహాదారు గావున, ప్రధానమంత్రి జేయు ప్రతి పని, అధ్యక్షుని పేరులో జేయును. కాని ఇది నామమాత్రమునకే. అసలైన ప్రభుత్వాధికారము ప్రధానమంత్రి యందే కేంద్రీకరింపబడియున్నది. ఇంగ్లీషువారి సంప్రదాయము గూడ ఇదియే.

## ఉపాధ్యక్షుడు

అమెరికాలో, అధ్యక్షునివలె, ఉపాధ్యక్షుని, ప్రజలు నేరుగా యెన్నుకొనెదరు. ఆతడు సెనేటుకు అధ్యక్షత వహించును. భారత దేశములో ఉపాధ్యక్షుని కేంద్రశాసనసభ, శాసనమండలిసభ్యులు, సంయుక్త సమావేశములో సంక్రమణ వోటింగు విధానమునను సరించి యెన్నుకొనెదరు. రాష్ట్ర శాసన సభాసభ్యులు, ఉపాధ్యక్షుని యెన్నికలో పాల్గొనరు. ఉపాధ్యక్షునుగా ఎన్నుకొనబడు వ్యక్తి ముప్పది సంవత్సరముల వయసుకు పైబడిన భారతపౌరుడుగా నుండవలెను. ఆయన కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వములనుండి వేతనము పొందక, మరే యితర

శాసనసభలో సభ్యుడుగానివాడు కావలెను. భారత ఉపాధ్యక్షుడు, అధికారరీత్యా, కేంద్ర శాసనసమితికి అధ్యక్షత వహించును.

భారత అధ్యక్షుడు, అస్వస్థత వలన గాని, దేశాంతరము వెళ్లినప్పుడు, మరే కారణము వలన గాని, తన విధ్యుక్తధర్మము నెరవేర్పలేనప్పుడు, ఉపాధ్యక్షుడు అతని స్థానమున వ్యవహరించగలడు. అధ్యక్షపదవి యొక్క అయిదు సంవత్సరముల గడువులో, అధ్యక్షుడు రాజీనామానిచ్చిన, పదవినుండి తొలగించబడిన లేక, మరణించిన, తిరిగి అధ్యక్షుడు ఎన్నుకొనబడు వరకు ఉపాధ్యక్షుడు, అధ్యక్ష పదవిని స్వీకరించగలడు. ఇట్టి పరిస్థితులలో అధ్యక్షపదవి యెన్నిక ఆరు నెలలలోగా జరిగి తీరవలెను.

## మంత్రిమండలి

కేంద్ర శాసనసభలో, అధిక సంఖ్యాక సభ్యులచే తమ పార్టీ నాయకునిగ యెన్నుకొనబడిన వ్యక్తిని, అధ్యక్షుడు, తన ముఖ్య సలహాదారునిగా నియమించును. అధ్యక్షుని అనుమతితో, అధ్యక్షుని పక్షమున, కేంద్ర పరిపాలన సాగించుటే గాక, తను చేయు పనులకు పార్లమెంటు ఆమోదము సంపాదించుట, యీ ప్రధాన సలహాదారుని కర్తవ్యము. ఈయన తన కార్య భారమును పంచుకొనుటకు, పార్లమెంటు సభ్యులలో సమర్థులని తోచిన కొందరిని తోడు పిలుచుకొని, తన బాధ్యతమీద, వారిని ఉపసలహాదారులుగా అధ్యక్షునిచే నియమింప జేయును. వీరందరిది ఒక సంఘము. ఈసంఘములోని యొకరుచేసినపనికి కడమ వారందరు బాధ్యులు కావున, ప్రతిపనిని, వీరుకలిసి, ఆలోచించి, అందరిసమ్మతితో చేయుచుందురు. అభిప్రాయభేదములున్నవారు ఈ సంఘములో నుండుటకు వీలులేదు. వారు రాజీనామానిచ్చి తొలగిపోవలయును. వారట్లు చేయనియెడల

అధ్యక్షునిచే బలవంతముగ తీసివేయబడుదురు. అందరుకలిసి పని చేయుచు, ఒకరుచేసినపనికి అందరు బాధ్యతవహించుచు, ఐకమత్యముతో, అధ్యక్షునిఆమోదముతో పరిపాలనాక్రమమును నడిపించుటను, "సమిష్టిబాధ్యతాసూత్ర"మందురు (Principle of joint responsibility). ఈ సలహాదారులను మంత్రులని వ్యవహరించుచున్నారు. వీరిసంఘము, మంత్రిమండలి. వీరినాయకుడు ప్రధానమంత్రి. వీరుచేయుపని అధ్యక్షునికి సలహాలనిచ్చుట, అతనిఆజ్ఞ ప్రకారము, రాజ్యాంగవిధానమునకు లోబడి, రాజ్యపరిపాలనసాగించుట. వీరు అధ్యక్షునికి యేమిసలహానొసంగుచున్నారన్న విషయము, యెవరును ప్రశ్నించుటకు వీలులేదు. వీరిసలహాలను అధ్యక్షుడు పాటించి తీరవలెనను నిబంధనలేదు. అధ్యక్షుడు అన్నివిధముల భారతప్రభుత్వమునకు అధినేత. మంత్రులు అతనిచేతిక్రింద పనిచేయుఉద్యోగస్థులు. చట్టములోని 53 సూత్రములో అధ్యక్షుడు, తన క్రిందిఉద్యోగస్థులచే పనులు చేయించునని గలదు. అధ్యక్షుడు మంత్రులను,తనఇష్టమువచ్చినప్పుడు తీసివేయవచ్చును. వారు పర్యవేక్షింపవలసిన ప్రభుత్వశాఖలను (Portifolios) ఆయననిర్ణయించును. ఆశాఖల విభజనలో మార్పులుగూడ అప్పుడప్పుడు చేయవచ్చును. మంత్రిమండలి, అధ్యక్షుని పేర జరుగుపనులకు, పార్లమెంటుయెదుట సమిష్టిగా బాధ్యతవహించుచున్నది. అధ్యక్షుడు చెప్పినట్లుచేయుచు, ప్రజాప్రతినిధులగు పార్లమెంటుసభ్యులను, వారన్నివిధముల మెప్పించవలెను ప్రజాప్రతినిధుల విశ్వాసము చూరగొనవలెను. ఆర్థికబిల్లులు శాసనసభలో ప్రవేశపెట్టబడును గావున, ఆ సభలో అధికసంఖ్యాకుల ఆమోదము తప్పక యుండితీరవలెను. ప్రధానమంత్రి; ముఖ్యముగా శాసనసభాసభ్యుడై యుండవలెను. శాసనసమితి, లేక శాసనసభాసభ్యులనుండియే మంత్రులను సాధారణముగ నియమించవలెను. సభ్యులుకానివారిని మంత్రిగనియమించిన, నియామకముజరిగిన ఆరునెలలలోగా వారు అట్టిసభ్యత్వము సంపాదించుకొనవలెను. లేనియెడల మంత్రిపదవి వదలుకొనవలెను. శాసనసభలో అధికసంఖ్యాకుల ఆమోదము ను

పొందజాలనియెడల, ప్రధానమంత్రి తనపదవికి రాజీనామా నివ్వవలెను. ఇట్లు శాసనసభలో అధికసంఖ్యాక ప్రతినిధుల విశ్వాసము చూరగొన్నవ్యక్తి మరొకడున్న, అట్టివ్యక్తిని అధ్యక్షుడు పిల్చి, తన ప్రధానసలహాదారునిగాను, ప్రధానమంత్రిగాను నియమించును. దీనినే మంత్రిమండలిమార్పు అందురు. కేంద్ర శాసనసభాసభ్యులు ప్రజాభిప్రాయమునకు భిన్నముగ, వ్యక్తిగతముగ, పార్లమెంటులో వ్యవహరించుచున్నారనియు, ప్రజోపయోగమున కత్యవసరమగు బిల్లుల నిరాకరించి, ప్రజాశ్రేయస్సుకు భిన్నముగ వర్తించుచున్నారనియు, ప్రధానమంత్రికి తోచినయెడల, ఆయన అధ్యక్షునికి చెప్పి శాసనసభను రద్దుచేయించవచ్చును. తత్ఫలితముగా శాసనసభకు క్రొత్త ప్రతినిధులను యెన్నుకొనవలసినదిగా ప్రజలను కోరుట జరుగును. రెండవమారు ప్రజలచే యెన్నుకొనబడిన ప్రతినిధులు, ప్రధానమంత్రిపై విశ్వాసరాహిత్యము ప్రకటించిన, ప్రధానమంత్రి తప్పనిసరిగా రాజీనామానిచ్చి తీరవలెను. కాని ఇట్టి పరిస్థితి అసాధారణము. ఎప్పుడోకాని జరుగదు.

ఇంతకుముందు మంత్రిమండలి శాసనసభకు బాధ్యత వహించునని చెప్పబడినది. అన్నిపనులు అధ్యక్షుడే చేయునప్పుడు మంత్రులేల బాధ్యత వహింపవలెనని ప్రశ్నింపవచ్చును. ప్రధానమంత్రి సలహాల ననుసరించి అధ్యక్షుడు ఆజ్ఞల నొసంగునని చెప్పబడినది. అధ్యక్షుని పేరుతో నిజముగా ప్రధానమంత్రియే అట్టి ఆజ్ఞల నొసగుచున్నాడు. అధ్యక్షునిది పేరు, ప్రధానమంత్రిది ఊరు. సర్వాధికారములు ప్రధానమంత్రికేగలవు. నిజముగా దేశమును పాలించునది ఆయనయే. కావున పార్లమెంటుయెదుట తన మంత్రిమండలితోసహా బాధ్యత వహించుచున్నాడు. అధ్యక్షుడు కేవలము గౌరవచిహ్నము. ఇంగ్లాండులో రాజు, ప్రభుత్వమునకు గౌరవాధికారి. అన్ని వ్యవహారములు, రాజుపేరుతో మంత్రిమండలి నిర్వహించును. రాజు పేరుతో చేయబడు ప్రతిపనికి ఏదేనొక మంత్రి బాధ్యత వహించును. రాజుకు ఏలోపము ఆపాదించరాదన్న సూత్రము ఇంగ్లాండులో బలపడినది.

ఆంగ్లరాజ్యాంగ అనుకరణలో, అచ్చట రాజుసకుగల స్థానము, భారత అధ్యక్షునకు కల్పించబడినది. పరిపాలనలో ఎట్టిలోపము లున్నను అధ్యక్షుడు బాధ్యుడుకాడు. బాధ్యత మంత్రిమండలిది. వారు ప్రజలకు ఉత్తరవాదులు. ఇదే బాధ్యతాయుత ప్రభుత్వము యొక్క మూల సిద్ధాంతము.

రాచకార్యములన్నిటిని ప్రధానమంత్రి, మంత్రిమండలి సమావేశములో చర్చించును. చర్చల సారాంశమును అధ్యక్షునికి తెల్పుచుండును. అధ్యక్షుడు తనకు తోచిన సలహాలనీయవచ్చును. తెలుసుకొనదగిన విషయము లేమైన యున్నచో అడిగి తెలుసుకొనవచ్చునేగాని, ప్రధానమంత్రి తను చెప్పినటుల వినితీరవలెనని అధ్యక్షుడు నిర్బంధించరాదు. అధ్యక్షుడు ప్రభుత్వవిషయములలో అనవసర జోక్యము కలిగించుకొనిన, ప్రధానమంత్రి రాజీనామా నొసంగును. పార్లమెంటులో అతని పక్షమువారు అధికసంఖ్యలో నున్నంతవరకు ప్రధానమంత్రిత్వము అతనికే ఇచ్చితీరవలెను. జోక్యము కలిగించుకొనిన అధ్యక్షుడు తన గౌరవమును కోల్పోవును. గాన, ఆయన సాధారణముగా అట్లు చేయడు. గౌరవ మర్యాదలు, అధ్యక్షునికి జరుపుచు, ప్రధానమంత్రి సర్వాధికారములు వినియోగించును.

మంత్రులులేని శాసనసభ యేపనియుచేయజాలదు. పార్లమెంటులో ముఖ్యభాగము శాసనసభ ( House of the People) కావున మంత్రులందరు ఇట్టి ప్రజాసభలో సభ్యులుగా నుండుట ఉచితము. శాసనసమితి సభ్యుల ( Council of States ) మంత్రులుగా నియమించిన కొన్ని చిక్కులు వచ్చును. అట్టి మంత్రి, సమిష్టి బాధ్యతా సూత్రము ప్రకారము శాసనసభకు బాధ్యత వహింపజాలడు. గావున మంత్రిమండలి వ్యవహారములు ఒడుకు దుడుకుల పాలగును.

శాసనసభలో, అధ్యక్షునికి ( Speaker ) కుడిప్రక్కు, మంత్రులకు ప్రత్యేక స్థానములు నిర్ణయమై యుండును. పార్లమెంటు సమా

వేళమైనప్పుడు, ప్రతిదినము ఒకగంట ప్రశ్నోత్తరములకై కేటాయించ బడును. ప్రభుత్వ వ్యవహారములగురించి ప్రశ్నించుటకు ప్రతిసభ్యునికి అధికారము గలదు. అడుగదలచిన ప్రశ్నలను, ముందుగా లిఖితపూర్వకముగ అధ్యక్షునికి అందజేయవలెను. అధ్యక్షుడు వానిని మంత్రులకు అందజేయును. పార్లమెంటులో ప్రశ్నోత్తర సమయమున, మంత్రులు, ప్రతిప్రశ్నకు తగిన సమాధాన మీయవలెను. సమాధానము తృప్తికరముగ లేనిచో, అనుబంధ ప్రశ్నల నడుగుటకు సభ్యుల కవకాశ మీయబడును. సభలో బహిరంగముగ ప్రశ్నలన్నిటికి సమాధానము చెప్పుటకు వ్యవధి చాలనందున, సభలో చర్చింపబడని, ప్రశ్నల సమాధానము, లిఖిత పూర్వకముగ సభ్యుల కందజేయ బడును.

పార్లమెంటులో మూడువంతులు బిల్లులు, మంత్రులచే ప్రవేశ పెట్టబడును. ముఖ్యముగ ఆర్థిక బిల్లులు ప్రవేశపెట్టుటకు మంత్రులకే అధికారము గలదు. శాసనసభలో, మంత్రిమండలికి, అధికసంఖ్యాక బలము తప్పక యుండును గావున, మంత్రులచే ప్రవేశపెట్టబడు బిల్లులు సాధారణముగ అంగీకరింపబడి చట్టములగును. మంత్రులు ప్రవేశ పెట్టిన బిల్లు, ఓడిపోయిన యెడల, అది మంత్రిమండలిపై విశ్వాస రాహిత్య తీర్మానముగ భావింపబడును. పార్టీ సభ్యులచే అనుకూలముగ ఓటింగు చేయించుట కొరకు పార్టీ యధికారి యుండును ( Chief Parliamentary whip ). ప్రతికూలముగ ఓటు చేసిన వారిని పార్టీనుంచి తీసివేయుట గూడ జరుగును. ప్రధాన మంత్రి లేని సమయమున సభ్యుల ప్రశ్నలకు తగు సమాధానము జెప్పుటకై, మంత్రులలో నొక్కరిని నాయకునిగా నియమించుట కలదు. ప్రధాన మంత్రి సర్వత్ర అధికసంఖ్యాక ప్రభుత్వ పార్టీ నాయకుడైన, ఇట్టి మంత్రియే పార్లమెంటులో ప్రభుత్వ పార్టీనాయకునిగా వ్యవహరింతురు ( Leader of the Treasury Benches in Parliament ). ఇట్లే పారమెంటులో ప్రతికూల పక్ష నాయకుడు గూడ నుండగలడు ( Leader of the opposition).

# ప్రధానమంత్రి

పార్లమెంటును సమావేశపరుచుట, కాలపరిమితిని పొడిగించుట, నిలుపుదలచేయుట (Pro-rogue), శాసనసభను రద్దుచేయుట (Dissolution of the House of the people) మొదలగుపనులు, అధ్యక్షునిపక్షమున ప్రధానమంత్రియే చేయును. మంత్రులకు ప్రభుత్వ శాఖల పంచియిచ్చుట ప్రధానమంత్రియే, అధ్యక్షుని పేరిట జేయును. అధ్యక్షుని అధికారములన్నియును సామాన్యముగ ప్రధానియే ఉపయోగించును. నామమాత్రముగ అధ్యక్షుని సంతకము, సమ్మతి గ్రహించును. ప్రధానమంత్రి, మంత్రిమండలి సమావేశములకు అధ్యక్షతవహించుటేకాక, మంత్రుల నియమించుట, తొలగించుట, అధ్యక్షుని పేరుతో జేయును. భారత రాజ్యాంగములో ప్రధాన మంత్రికి అత్యున్నత స్థానమీయబడినది. పార్లమెంటుచే ఆమోదింపబడిన చట్టముల అమలుపరచుట, అధ్యక్షుని ఆదేశముల పార్లమెంటుకు నివేదించి విశదీకరించుట, మంత్రులు చేయుపనులన్నిటికి తాను బాధ్యత వహించి, పార్లమెంటు మరియు అధ్యక్షుని విశ్వాసము చూరగొని సకల ప్రజాసమ్మతముగ దేశపరిపాలన సాగించుటయేగాక, విదేశములలో తన దేశగౌరవ ప్రతిపత్తుల నభివృద్ధిపరచుట, మొదలగు వివిధ బాధ్యతల నిర్వహించుట ప్రధానమంత్రి ముఖ్యకర్తవ్యములు. భారత ప్రధానిని, అమెరికా అధ్యక్షునితోనూ, బ్రిటిషుప్రధానితోను పోల్పదగును. ప్రధానమంత్రి, శీలము, స్థయిర్యము, అతనికి, పార్టీసభ్యులపైగల పలుకుబడి, అధికారము, విదేశములలో అతనికిగలపేరు ప్రతిష్ఠలు, దేశాభ్యుదయమునకై ముఖ్యాతిముఖ్యము. సమర్థుడైన ప్రధానమంత్రి లభించుట ప్రజల యదృష్టము. నీతినతిక్రమించక, ప్రజల పరిపాలించుట చాల కష్టమైనపని. అందుముఖ్యముగ, దండనీతి, రాజనీతులు శాఖోపశాఖా సమన్వితములై యుండుటను, అందలి ధర్మసూ

క్ష్మములు సామాన్య ప్రజానీకమునకు అగ్రాహ్యములు. పాశ్చాత్య సంప్రదాయములననుసరించి చట్టబద్ధముగావింపబడిన భారత రాజ్యాంగ విధానమును, కూలంకషముగ తెలుసుకొనుటకై మన దేశముయొక్క అనుభవముచాలదు. భారతీయుల లక్ష్యసాధనకు, అకుంఠిత కార్యదీక్షగల చుక్కానిగావలయును. భారతప్రధాని, అట్టివాడై యుండవలయును.

# భారత పార్లమెంటు - ఉభయ శాసనసభలు

కేంద్రశాసనసభ, కేంద్రశాసనసమితి, ఈ రెంటిని కలిపి భారత పార్లమెంటు, అని పేర్కొనుచున్నాము. ఈ పదము ఇంగ్లాండు నుంచి గ్రహింపబడినది. ఇచ్చటజరుగు వ్యవహారములు, సంప్రదాయములు, మర్యాదలు, అన్నియు, ఇంగ్లీషు పార్లమెంటరీ విధానము ననుసరించి యుండును.

కేంద్రశాసనసమితిలో 250 మందిని మించకుండా సభ్యులుందురు. అందులో 12 మందిని, సారస్వత, వైజ్ఞానిక, సంఘ, సేవలందు నిష్ణాతులగు వారిని, అధ్యక్షుడు నియమించును. కడమ 238 మంది ఎన్నిక అయిన రాష్ట్రశాసన సభా సభ్యులచే యెన్నుకొనబడుదురు. ఎ. వర్గములోని రాష్ట్రములు 145 సభ్యులను, బి. వర్గములోని రాష్ట్రములు 53 సభ్యులను, సి. వర్గములోని రాష్ట్రములు 7 సభ్యులను, యెన్నుకొనును. ఎన్నిక విధానమును అధ్యక్షుడు నిర్ణయించును.

శాసన సభవలె 5 సంవత్సరముల కొక పరి రద్దుగాక, శాసన సమితి శాశ్వతముగ నుండును. ప్రతి రెండు సంవత్సరములకు, మూడవ వంతు సభ్యులు, తమ స్థానముల ఖాళీ చేయవలెను. అట్టి స్థానములకు పునః యెన్నికలు జరుపబడును.

భారత ఉపాధ్యక్షుడు అధికార రీత్యా, శాసన సమితికి అధ్యక్షత వహించును. సభ్యులు తమలో నొకరిని సమితి ఉపాధ్యక్షునిగ

యెన్నుకొనగలరు. 14 రోజుల ముందుగా నోటీసు యిచ్చి, ఉపాధ్య క్షునిపై విశ్వాసరాహిత్య తీర్మానము తేవచ్చును. ఈ తీర్మానము అధికసంఖ్యాక సభ్యులచే ఆమోదింపబడిన, ఉపాధ్యక్ష పదవి ఖాలీ అగును. లేదా అతను స్వచ్ఛందముగ రాజీనామా నీయవచ్చును.

## కేంద్ర శాసన సభ లేక ప్రజాసభ

ఇది ఇంగ్లాండులోని కామన్స్ సభను పోలియుండును. ఆర్థిక బిల్లుల నామోదించు ప్రత్యేకాధికారము, ఈ సభకు గలదు గావున ఇది పార్లమెంటులోని ముఖ్యభాగము. ఇందు 500 ను మించకుండా సభ్యులుండగలరు. వయోజన వోటింగు పద్ధతినై రాష్ట్రప్రజలు వీరిని యెన్నుకొనెదరు. అయిదు లక్షలకు మించి $7\frac{1}{2}$ లక్షల లోపు జనసంఖ్య కు ఒక ప్రతినిధి యెన్నుకొనబడును. అనుబంధములో చేర్చబడిన కులములు, జాతులవారికి, జనసంఖ్యా నిష్పత్తి ననుసరించి స్థానములు ప్రత్యేకింపబడినవి. సామాన్య నియోజక వర్గములనుండి ఆంగ్లో– ఇండియన్ జాతివారు యెన్నుకొనబడని యెడల, అధ్యక్షుడు, వీరినుండి ఇద్దరిని శాసనసభకు సభ్యులుగా నియమించవచ్చును. ఇట్టి సభ్యులు, భారత అధ్యక్షునియెన్నికలో పాల్గొనజాలరు. భారతపౌరులై, ఓటింగుహక్కు గలిగి పాతికసంవత్సరములకు పై వయసుగలవారు, శాసనసభ్యత్వమునకు పోటీచేయవచ్చును. ఇవే అర్హతలుగలిగి 30 సంవత్సరముల వయసు దాటినవారు, శాసనసమితికి సభ్యులుగావచ్చును. వయోజన ఓటింగు విధానము 326 సూత్రముద్వారా ప్రవేశపెట్టబడినది. భారతదేశము ప్రజాసత్తాక రాజ్యమని నిరూపించుటకిదే తార్కాణము. ప్రజల విశ్వాసమునకు పాత్రులై, యెన్నుకొనబడిన ప్రజాప్రతినిధులు, పార్లమెంటులో సర్వశాసనాధికారములను గలిగియున్నారు. అందుముఖ్యులగువారు మంత్రిత్వపదవులను స్వీకరించి, శాసనములను కార్యరూప

మున బెట్టుచున్నారు. ప్రజలు ఓటునకు గల ప్రాముఖ్యతనుగుర్తించు నట్లు, సమర్థత, నీతి, నియమముగల ప్రతినిధులనెన్నుకొనునట్లు చేయుటకై, రాజకీయప్రబోధము, విద్యావ్యాపన విశేషముగ జేయవలెను. శాసనసభ కాలపరిమితి అయిదుసంవత్సరములు. గడువుముగియకముందే క్రొత్తయెన్నికలు జరుపుచుండవలెను దేశములో అశాంతి, లేక ప్రపంచ యుద్ధము, మొదలగు అసాధారణ పరిస్థితులేర్పడినప్పుడు, తడవకు ఒక సంవత్సరము చొప్పున కాలపరిమితిని పొడిగించవచ్చును. అసాధారణ పరిస్థితి తొలగిన ఆరునెలలలోగా తప్పక క్రొత్త యెన్నికలు జరిగితీరవలెను. శాసనసభ, మంత్రిమండలి, మధ్య మనఃస్పర్థలు యేర్పడి, ప్రజాప్రతినిధులు, ప్రజాశ్రేయస్సుకు భిన్నముగా, తమ యధికారమును దుర్వినియోగపరచుచున్నారని ప్రధానమంత్రి తలచిన యెడల, ఆతనిసలహాపై అధ్యక్షుడు, శాసనసభను అయిదుసంవత్సరముల గడవుకాకముందేరద్దుచేసి, క్రొత్తయెన్నికల నాజ్ఞాపించవచ్చును.

శాసనసభ్యులు తమలో నొకరిని అధ్యక్షునిగాను, ఇంకొకరిని ఉపాధ్యక్షునిగాను యెన్నుకొందురు. సభలో వాగ్వివాదములు సంభవించునప్పుడు, ఇతడు, మధ్యవర్తిగా వ్యవహరించును. ఇంగ్లాండులో అధ్యక్షునియెన్నికను రాజు ఆమోదించవలెను. కాని భారతదేశములో ఇట్టి యెన్నికకు, భారతాధ్యక్షుని అంగీకారముతో నిమిత్తములేదు. శాసనసభాధ్యక్షుని, అధికారబాధ్యత లెచ్చటను నిర్దేశింపబడలేదు. సంప్రదాయసిద్ధముగ, ఇంగ్లీషుపార్లమెంటు స్పీకరు అధికారములే, ఇతనికిగలవని ఆచరణనుబట్టి గ్రహించవలెను.

స్పీకరు, డిప్యూటీ స్పీకరుకు తెలిపి, తన పదవికి రాజీనామా నీయవచ్చును. ఏకారణముచేతనైన అతను శాసనసభా సభ్యత్వమును గోల్పోయిన, అధ్యక్షునిగానుండ నర్హుడుగాడు. అధ్యక్షునిపై విశ్వాస రాహిత్యతీర్మానము ప్రవేశపెట్టుటకు 14 రోజులు ముందుగా నోటీసు యీయవలెను. మొత్తము శాసనసభా సభ్యులలో అధికసంఖ్యాకుల ఆమోదముతో, అధ్యక్షుని పదవీచ్యుతుని జేయవచ్చును.

ప్రజాస్వామ్యము చక్కగ నిర్వహింపబడవలెనన్న పార్లమెంటులో కనీసము రెండు ముఖ్యపక్షములుండవలెను. వానిని ప్రభుత్వ పక్షము, ప్రతికూలపక్షమని వ్యవహరించవచ్చును. ఉభయులమధ్య జరుగు వాగ్వివాదములను, తర్జనభర్జనలను క్రమపద్ధతిని జరిపించుట అధ్యక్షునివిధి. ఆయన పార్టీసభ్యుడుగా నుండుటకెట్టి ఆక్షేపణలేదు గాని, మధ్యవర్తిత్వమును సార్థకపరుచుటకు, నిష్పాక్షికముగ నుండుట యవసరము. ఇతను ప్రతివిషయముపై వోటుచేయనవసరము లేదు. ఏదేని విషయమును ఉభయపార్టీలు ఇదమిద్ధమని నిర్ణయించ జాలనప్పుడు యథాస్థ పరిస్థితి (Status quo) ని నిలబెట్టుటకు, తన ఓటింగు హక్కును ప్రయోగింపవచ్చును. దీనిని అధ్యక్షుని కొసరుఓటు అందురు (Speaker's Casting vote). ఇంగ్లాండులో స్పీకరు ఏ పార్టీకి చెందని వాడుగా నుండును. భారతదేశమున గూడ నిదేసంప్రదాయము (Convention) నిలబెట్టుకొనిన ఉచితముగా నుండగలదు.

శాసనసభ కీర్తిప్రతిష్ఠలు, మరియు సభ్యుల అధికార రక్షణ, అధ్యక్షుని యధీనము. అధ్యక్షుడు సభకు ప్రతిరూపము. సభనుద్దేశించి మాట్లాడుసభ్యులు అధ్యక్షుని సంబోధింతురు. సభలో మాట్లాడ దలచువారు తమతమస్థానములలో లేచినిలువవలెను. యెవరుముందు మాట్లాడవలెనో అధ్యక్షుడు నిర్ణయించును. సభలోవేయుప్రశ్నలు సక్రమమైనవా కాదా, యనునదికూడ ఆయనే నిర్ణయించగలడు. సభలో ఓటింగు జరిగినప్పుడు, ఫలితమును అధ్యక్షుడు ప్రకటించును. వ్యవహారక్రమము (Procedure) నుగురించి సందేహము గలిగినప్పుడు అధ్యక్షుడు, ఇంగ్లీషుపార్లమెంటు మరియు తదితర పార్లమెంటుల ఆచార వ్యవహారముల ననుసరించి, నిర్ణయించును. ఇట్టి నిర్ణయమునకు (Ruling) సభ్యులందరు బద్ధులుగా నుండవలెను. తీర్మానములకు సవరణల ప్రతిపాదించునప్పుడు, అధ్యక్షుని అనుమతి పొందవలెను. ఏదేని విషయముపై సభ్యుల ఓట్లను ఎట్టిసమయములో తీసికొనవలెనన్న విషయము గూడ అధ్యక్షుడే నిర్ణయించును. సభలో ప్రవేశపెట్టబడు బిల్లులు ఆర్థికవిషయములకు సంబంధించినవా కాదా యను విషయ

ములో తుదినిర్ణము అధ్యక్షునిదే. సభలో అసభ్య ప్రసంగములు చేయకుండ, ఒకరినొకరు దూషించుకొనకుండ, అధ్యక్షుడు కనిపెట్టు చుండును. అట్లు చేయువారిని నివారించును. సభాగౌరవమునకు భంగ కరముగ ప్రవర్తించువారిని అధ్యక్షుడు బయటకు పంపించవచ్చును. అధ్యక్షుడు మాట్లాడునప్పుడు, సభ్యులు ఇటునటు పచారు చేయరాదు. ఒకరితో నొకరు గుసగుసలాడరాదు. సభ్యులు తమ స్థానములో కూర్చుండునప్పుడు, లేచివెళ్లునప్పుడు, గౌరవపురస్సరముగ, అధ్యక్షుని యెదుట ( bow ) వంగి నమస్కరించవలెను. అధ్యక్షపదవి గొప్ప గౌరవస్థానము గావున ప్రధానమంత్రి కూడ ఇట్లే వంగి నమస్కరించ వలసి యుండును.

## పార్లమెంటు యధికారములు

శాసన నిర్మాణము పార్లమెంటు యొక్క ముఖ్యకర్తవ్యము. ఏడవ అనుబంధములో చేర్చబడిన (I) (III) విషయసూచికలందు గల విషయములపై పార్లమెంటు శాసనముల నేర్పరుచును. రాష్ట్రప్రభు త్వముల కోరికపై (II) పట్టిక యందలి విషయములపై గూడ శాసన ముల నిర్మింపవచ్చును. భారతాధ్యక్షుని సంతకముతో, ఇట్టి శాసన ములు చట్టములై, దేశమంతటను చెల్లుబడి యగును.

శాసన నిర్మాణము, ప్రజల శ్రేయస్సు కనుగుణ్యముగా, ప్రజా సమ్మతముగ నుండవలెను గాన, ప్రజా ప్రతినిధులు, మంత్రిమండలిని సందర్భోచితముగ విమర్శించుటకు హక్కు గలిగియున్నారు. పార్ల మెంటులో ప్రశ్నలు వేయుట ద్వారా, ప్రజాపరిపాలన సక్రమముగ జరుగుచున్నదా లేదా యని వారు తెలుసుకొనుచున్నారు. మంత్రులు ప్రజాశ్రేయస్సుకు భంగకరముగ నడుచుచుండిన యెడల, మంత్రులు ప్రతిపాదించిన బిల్లులను త్రోసివేయుట ద్వారా, లేదా ఆర్థికబిల్లుల

నిరాకరించుట ద్వారా, లేదా మంత్రులపై విశ్వాసరాహిత్య తీర్మానమును ప్రతిపాదించుట ద్వారా, శాసన సభాసభ్యులు మంత్రులను పదవీచ్యుతుల జేయవచ్చును. మంత్రులు శాసనసభకు బాధ్యులన్న సూత్రము, పై విధానముల ద్వారా అమలు జరుగుచుండును.

దేశ ఆదాయ వ్యయముల సరి చూచుకొను బాధ్యత పార్లమెంటుపై గలదు. ప్రజల సమ్మతిలేనిది ప్రభుత్వము పన్నులు విధింపరాదు. ప్రజాసమ్మతి తెలుపువారు, ప్రజాప్రతినిధులగు పార్లమెంటు సభ్యులు. దేశ ఆదాయ వ్యయముల చూపించు శాసనమును బడ్జెట్ అందురు. ఇందు గత సంవత్సరపు ఆదాయ వ్యయములు, ప్రస్తుత సంవత్సరపు ఖర్చు, ఆదాయము, క్రొత్తపన్నులు, దానివల్ల వచ్చు రాబడి అంచనా మున్నగు విషయములు చూపించబడును. బడ్జెట్‌ను సభ్యులు వివరముగా పరిశీలించెదరు. అవసరమని తోచిన మార్పులు, సవరణల సూచించెదరు. తుదకు అధికసంఖ్యాకులకు అంగీకారమగు, విధముగ బడ్జెట్ బిల్లు అంగీకరింప బడును. అర్థము, ప్రభుత్వమునకు ప్రాణమువంటిది గావున, బడ్జెట్ చర్చలో సభ్యులు సూచించువిమర్శలను, మంత్రులు తప్పక గమనించి తీరవలెను. మంత్రులు ప్రవేశ పెట్టిన బడ్జెట్‌ను ప్రతినిధులు అంగీకరించనిచో, మంత్రిమండలి రాజీనామా నివ్వవలసి యుండును. పార్లమెంటుకు ఆర్థికబిల్లుల నంగీకరించుటలో గల యధికారము గొప్పది. అదేవిధముగ, ఇతర బిల్లుల చర్చయందు గూడ, మంత్రిమండలి అధిక సంఖ్యాక సభ్యుల, ఆమోదమును, విశ్వాసమును పొందవలెను.

ప్రత్యేకావసర సమయములందు, పార్లమెంటు న్యాయస్థానముగా వ్యవహరించగలదు. పార్లమెంటులోని ఏదో నొక శాసనసభ, భారతాధ్యక్షునిపై నేరారోపణజేసిన, రెండవసభ, దాని విచారణ సల్పగలదు. మొదటిసభలో నాల్గవవంతు సభ్యులు సంతకముజేసి 14 రోజులు ముందుగా అధ్యక్షునికి నోటీసు నివ్వవలెను. నోటీసు న్యాయసమ్మతముగా నున్నదని 2/3 సభ్యులు అంగీకరించవలెను.

విచారణజేయు సభయందును, 2/3 సభ్యులు, నేరములు రుజువయినట్లు తీర్మానించినయెడల, అధ్యక్షుడు తన పదవిని గోల్పోవును.

ఈదేవిధముగ అవినీతికి పాల్పడిన సుప్రీంకోర్టు జడ్జీలను, పార్లమెంటు అధికసంఖ్యాకసభ్యుల తీర్మానముతో, పదవీచ్యుతులను జేయవచ్చును. పార్లమెంటులోని ఉభయసభలలో, చర్చలందుపాల్గొనినవారిలో 2/3 సభ్యులు ఇట్టి తీర్మానమునంగీకరించవలెను. చర్చలో పాల్గొనిన సభ్యులసంఖ్య, మొత్తము సభ్యులసంఖ్యలో సగమునుమించి యుండవలెను. పార్లమెంటులోని ఉభయసభల తీర్మానముతరువాత అధ్యక్షుడు, తదనుగుణముగ ఉత్తరువుల నివ్వగలడు.

## ఉభయ శాసనసభల పరస్పర సంబంధము

సాధారణబిల్లులు, ఉభయశాసనసభలలో దేనియందైనను ప్రవేశపెట్టవచ్చును. అప్పుడు రెండవసభ యంగీకారము అవసరము సవరణలనుగూడ ఉభయసభలు ఆమోదించవలెను. ఆర్థికబిల్లులు శాసనసభలోనే ముందు ప్రవేశపెట్టబడవలెను.

విమర్శనకొరకు బిల్లులు శాసనసమితికి పంపబడును. శాసనసమితి ఒకపక్షము దినములలోగా తిరిగి బిల్లును శాసనసభకు పంపవలెను. శాసనసమితి చేయు సూచనలను శాసనసభ అంగీకరించవచ్చును లేదా త్రోసివేయవచ్చును. ఎట్లుజరిగినను శాసనసభ ఆమోదముతో, బిల్లు అధ్యక్షుని సంతకమునకై పంపబడును. ఆర్థిక బిల్లుల నామోదించు యధికారము శాసనసభకుమాత్రమే గలదు.

ఒక సభలో ఆమోదించబడిన సాధారణబిల్లు రెండవసభ యెదుట ఆరునెలల కాలమువరకు ఉన్నప్పటికి, అంగీకారము పడని

యెడల, అధ్యక్షుడు ఉభయసభల సంయుక్త సమావేశము జరిపించును. సంయుక్త సమావేశములో, అధికసంఖ్యాక సభ్యులు ఆమోదించిన బిల్లు, చట్టముకాగలదు,

చర్చలోనున్న బిల్లులు, శాసనసభ రద్దుచేయబడిన, అంతరించిపోవును. శాసనసభచే అంగీకరింపబడి, శాసనసమితియెదుట చర్చలోనున్న బిల్లులు, అంతముకావు. శాసనసభ సమావేశము తాత్కాలికముగ నిలుపుదల చేయబడినంత (Pro-rogue) మాత్రమున చర్చలోనున్న బిల్లులు అంతముకావు.

(1) పన్నులు, (2) ప్రభుత్వముచేయు అప్పులు, (3) మూలధనము, లేక సమయోచిత ఖర్చులఫండు (Contingency Fund) నకు ధనముచేర్చుట లేక అందుండి ఖర్చుచేయుట లేక భద్రపరచుట, (4) మూలధనమునుండి ఖర్చుచేయవలసిన అవసరనిర్ణయము, ఈ నాలుగు విషయములకు అనుబంధములగు సూచనలుగల బిల్లులన్నియు ఆర్థికబిల్లులని గ్రహించవలెను. ఏదైన బిల్లు, ఆర్థికబిల్లు అగునాలేదా యను తుదినిర్ణయము స్పీకరు చేయగలడు. రాష్ట్రములందు విధించు పన్నుల (అపరాధపు పన్నులు), లైసన్సుఫీసులకు సంబంధించిన బిల్లులు, ఆర్థికబిల్లులలో చేరవు.

పార్లమెంటులో సభ్యులకు సంపూర్ణ వాక్స్వాతంత్ర్యము గలదు. సుప్రీంకోర్టు, లేక హైకోర్టు న్యాయాధిపతుల, దుష్ప్రవర్తననుగురించి సామాన్య సమావేశములలో చర్చించరాదు. స్పీకరు దృష్టిలో సభ్యతారహితమగు భాషనుపయోగింపరాదు. పార్లమెంటులో జేయుఉపన్యాసముల నాధారముజేసికొని, సామాన్యమైన కోర్టులలో, మాననష్టపు అభియోగముల తెచ్చుటకు వీలులేదు. పార్లమెంటు సభ్యులకు గల ప్రత్యేక సౌకర్యముల పేర్కొనుట కష్టము. సంప్రదాయసిద్ధముగ ఇంగ్లీషు పార్లమెంటులో, సభ్యులకుగల ప్రత్యేక రక్షణలే, యిచ్చటి సభ్యులకుగలవని గ్రహించవలెను,

పార్లమెంటు తన క్రమవిధానమును తానే నిర్ణయించగలదు. ఇట్టి నిర్ణయముల నతిక్రమించినవారిపై క్రమచర్య (Disciplinery-action) దీసికొనుటకు గూడ దానికే అధికారముగలదు. పార్లమెంటును నిరసించినందుకు, (Contempt of the House) వ్యక్తులనుగాని, సభ్యులనుగాని, నిర్బంధించి, శిక్షనొసంగుట కధికారముగలదు. క్రమచర్యను అమలు జరుపుటకై, పార్లమెంటు రక్షణోద్యోగి, యొకడు నియమింపబడును (Bailiff of the Parliament). పార్లమెంటు సమావేశమునకు 40 రోజులుముందు 40 రోజులు తరువాతవరకు సభ్యుల నరెస్టుజేయుటకు, సామాన్య కోర్టులకధికారము లేదు. దేశద్రోహము, శాంతిభంగము, కోర్టుల గౌరవనిరసనము, మున్నగు అపరాధములు జేసినవారిని, స్పీకరుకు తెల్పి, యీలోపుగా అరెస్టు చేయవచ్చును. పార్లమెంటు సభ్యులు, అధ్యక్షునకు, ఏవిషయమునైనను విన్నవించవచ్చును. విన్నపమును స్పీకరుద్వారా అందజేయవలెను. పార్లమెంటు సభ్యులందరి పక్షమున అధ్యక్షునితో వ ట్లాడుటకు నియమింపబడినవాడుగావున, శాసనసభాధ్యక్షునకు స్పీకరను (అనగా మాట్లాడువాడను) సార్థక నామము యివ్వబడినది.

పార్లమెంటు యావద్భారత దేశమును పరిపాలించు సంస్థ. అందలి సభ్యుల బాధ్యతాధికారములు, గౌరవ ప్రతిపత్తులు, గొప్పవి. సౌశీల్యము, న్యాయనిరతి, వారియందు తప్పక ఉండితీరవలెను. ధర్మాధర్మసూక్ష్మ పరిశీలనాశక్తి, గుణగ్రహణపారీణత, స్వార్థరహిత దేశభక్తి, వారికినైజగుణములుగ నుండవలెను. వారిపై మోపబడిన గురుతరబాధ్యతను నిర్వహింపగల, క్రమశిక్షణ, ప్రపంచజ్ఞానము, సమర్థత, వారికి అవసరము. ఇట్టి గుణసంపత్తిగలవారినే ప్రజలు తమ ప్రతినిధులుగ నెన్నుకొనవలెను. అప్పుడేవారి పరిపాలన ప్రజారంజకముగ నుండగలదు.

౬

# సుప్రీంకోర్టు - ప్రధాన ఉన్నత న్యాయస్థానము

ప్రధాన ఉన్నత న్యాయస్థానములో, ప్రధాన న్యాయమూర్తి గాక, మరి ఏడుగురు న్యాయమూర్తులుండగలరు. వీరిని భారతాధ్యక్షుడు నియమించును, న్యాయమూర్తుల నియామకమును, ముఖ్యముగ అధ్యక్షుడు, ప్రధాన న్యాయమూర్తితో చర్చించగలడు, న్యాయమూర్తిగా నియమింపబడినవ్యక్తి, భారత పౌరుడై యుండి, ఇతర హైకోర్టులలో 10 సంవత్సరముల ప్రాక్టీసుగల అడ్వకేటుగాని, 5 సంవత్సరముల యనుభవముగల హైకోర్టు జడ్జిగాని, కావలెను. 65 సంవత్సరముల వయస్సు వచ్చువరకు సుప్రీంకోర్టు న్యాయమూర్తులు ఉద్యోగములో నుండవచ్చును. పార్లమెంటుయొక్క ప్రత్యేక తీర్మానముపై మాత్రమే అధ్యక్షుడు వీరిని పదవినుండి తొలగించగలడు. ఉద్యోగ పరిమితి తీరినతరువాత; ప్రాక్టీసు చేయుటకుగాని, తిరిగి నియమకము పొందుటకుగాని యధికారముండదు. ప్రధానన్యాయమూర్తికి నెలకు రు 5000/- మిగతా న్యాయమూర్తులకు నెలకు రు 4000/- జీతముతో పాటు వసతి ఉచితముగ నివ్వబడును.

న్యాయమూర్తి సిద్ధపరచును. న్యాయమూర్తుల సంఖ్య చాలనప్పుడు, అధ్యక్షుని అనుమతితో, ప్రధాన న్యాయమూర్తి, తాత్కాలిక న్యాయమూర్తులుగా ప్రాంతీయ హైకోర్టున్యాయమూర్తులలో అర్హతగలవారిని నియమింపవచ్చును. ఉద్యోగమునుండి విరమించుకొనిన న్యాయమూర్తులనుసుప్రీంకోర్టు విచారణసభలలో పాల్గొనునట్లు పిలిపించవచ్చును.

సుప్రీంకోర్టులో అనుసరించు క్రమ విధానమును, ప్రధాన న్యాయమూర్తి అధ్యక్షుని అనుమతితో ముందే నిర్ణయించును. అధిక సంఖ్యాకులచే ఆమోదింపబడినతీర్పు, అధ్యక్షుడు కోరిన విషయముపై నిర్ణయములు కోర్టులో బహిరంగముగ చదివి ప్రకటింపబడును. భేదాభిప్రాయముగలతీర్పులిట్లే ప్రకటింపబడును. సుప్రీంకోర్టు తీర్పులను అన్ని హైకోర్టులు, అన్ని ప్రభుత్వములు అమలుజరిపితీరవలెను. సుప్రీంకోర్టు అధికారమును ధిక్కరించినవారిని శిక్షించు నధికారము కోర్టుకు గలదు. ఏ వ్యక్తినైనను, ఏ పత్రమునైనను కోర్టునకు రప్పించు నధికారముగలదు.

ప్రజల ప్రాథమిక స్వత్వముల నపహరించుటకు యత్నించు ప్రభుత్వకార్యనిర్వాహకుల నదలించి, వాటిని సంరక్షించుట, భారత రాజ్యాంగములో ప్రజలకు యీయబడిన తదితరహక్కులను రక్షించుట సుప్రీంకోర్టుయొక్క ప్రధాన కర్తవ్యము. ప్రజాస్వాతంత్ర్యమును రక్షించు ప్రత్యేకబాధ్యతసుప్రీంకోర్టుకు గలదు. అధ్యక్షునకు సందేహముగలిగినవిషయములపై న్యాయవిమర్శసలిపి, న్యాయబద్ధమగు సలహా నొసంగుట మరొక ముఖ్య కర్తవ్యము.

కేంద్రప్రభుత్వమునకు, రాష్ట్రప్రభుత్వమునకు మధ్య అధికార నిర్ణయమునకు సంబంధించిన తగాదాలనుగూర్చియు, రెండురాష్ట్రములమధ్య హక్కుభుక్తములకు సంబంధించిన తగాదాలను గూర్చియు తీర్పుజెప్పునప్పుడు, సుప్రీంకోర్టు మొదటివిచారణకోర్టుగానుండగలదు.

రాష్ట్రహైకోర్టుల తీర్పులలోగల ప్రతిబంధకములు సవరించు నప్పుడు, అట్టి తీర్పులపై అప్పీళ్ళనువిని పరిష్కరించునప్పుడు, సుప్రీంకోర్టు అప్పీలుకోర్టుగా నుండగలదు.

20 వేలకు మించని ఆస్తికి సంబంధించిన సివిలు వ్యాజ్యములలో, సుప్రీంకోర్టుకు అప్పీలు జేసుకొనవచ్చును. లేదా, హైకోర్టు అనుమతి నిచ్చిన మరే సివిలువ్యాజ్యములో నైనను అప్పీలుచేసుకొనవచ్చును.

క్రిమినలు వ్యాజ్యములలో, క్రిందికోర్టు నిర్దోషి యని నిర్ణయించినతరువాత, హైకోర్టు దోషనిర్ణయముచేసి, మరణ శిక్ష విధించినను క్రిందికోర్టులలోగల వ్యాజ్యమును రప్పించుకొని, నిందితునికి మరణశిక్ష విధించినను, సుప్రీంకోర్టుకు తప్పక అప్పీలు జేసుకొనవచ్చును. తదితర క్రిమినలు కేసులలోగూడ క్రిందిహైకోర్టు అనుమతించిన, సుప్రీంకోర్టుకు అప్పీలు చేసికొనవచ్చును.

కోర్టు మార్షలు కేసులలో తప్ప, మిగతా అన్నికేసులలోను సుప్రీంకోర్టుకు అప్పీలుచేసుకొనుటకు 136 ఆర్టికల్ ప్రకారము, సుప్రీంకోర్టు, ప్రధానన్యాయమూర్తి అనుమతింపవచ్చును. ప్రజలకు, సర్వకాల సర్వావస్థలయందు న్యాయము లభింపజేయుటకై సుప్రీంకోర్టుకిట్టిసర్వాధికారము లొసగబడినవి. దీనిని హైకోరులపైగల సవరణాధికారమందురు ( Revisory Jurisdiction ).

వ్యక్తి స్వాతంత్ర్యసంరక్షణను సమర్థించుచు, ఎ. కె. గోపాలన్ హేబియస్ కార్పస్ పెటిషన్‌పై సుప్రీంకోర్టు యిచ్చినతీర్పు ప్రజాధికారములను చక్కగ చర్చించినది. ఇట్లు న్యాయనిర్ణయముద్వారా న్యాయసూత్రముల సిద్ధాంతీకరించుట, ఒకవిధమైన శాసనవిర్మాణ

మని చెప్పవచ్చును. సుప్రీంకోర్టుతీర్పులు, సర్వత్ర అవశ్యపాలనీయములుగావున, కొంతవరకు శాసనాధికారము గలిగియున్నవి. ఇటి పరోక్ష శాసనాధికారము సుప్రీంకోర్టు ప్రాముఖ్యతను ఇనుమడింప జేయుచున్నది.

8

# ఉద్యోగములు - పబ్లిక్ సర్వీసు కమీషను

సమాఖ్య పబ్లిక్ సర్వీసు కమీషన్ సభ్యులను, ఛైర్మనును రిపబ్లిక్ అధ్యక్షుడు నియమించును. అందు సగము మంది సభ్యులు, కేంద్రి లేక రాష్ట్రి ప్రభుత్వోద్యోగము కనీసము 10 సంవత్సరములు చేసి యుండవలెను. సభ్యుల ఉద్యోగ పరిమితి కాలము ఆరు సంవత్సరములు. ఈ లోపుగా 65 సంవత్సరముల వయసు దాటిన ఉద్యోగము నుండి విరమించవలెను. లేదా అధ్యక్షునికి తెలిపి రాజీనామా నివ్వవచ్చును. ఆరు సంవత్సరముల కాలమును మించి, ఎవరిసీ తిరిగి ఈ ఉద్యోగమునకు గాని లేక యే ఉద్యోగమునకు నియమింప వీలులేదు.

సర్వీసు కమీషన్ సభ్యులు దుజువర్తనులు కారని అధ్యక్షునకు సందేహము దోచిన, ఆయన అట్టి విషయమును విచారణకై సుప్రీం కోర్టుకు పంపును. సంపూర్తి విచారణ తరువాత, సుప్రీంకోర్టు, సభ్యునికి వ్యతిరేకముగ తీర్పుజెప్పిన, అధ్యక్షుడు, అట్టి సభ్యుని ఉద్యోగము నుంచి తొలగించును. పార్లమెంటు, తీర్మానము ద్వారా గూడ, అక్రిమ ప్రివర్తన గల సభ్యుని తొలగింపుమని, అధ్యక్షుని కోరవచ్చును. అప్పుడు అధ్యక్షుడు పై విధమున క్రిమవిచారణ జరిపించి, నేరము రుజువైనచో, సభ్యుని, పదవినుండి తొలగించును. కమీషన్ సభ్యునికి, మనో వైకల్యము, లేక అంగవైకల్యము సంభవించిన, రహస్యముగ ఇంకొక ఉద్యోగము స్వీకరించిన, లేక అప్పులపాలై దివాలా తీసినను, అధ్యక్షుడు ఇట్టి సభ్యుని పదవినుంచి తొలగించవచ్చును.

కట్టుదిట్టములతో పరీక్షల జరిపించి, అందు ఉత్తమరీతిని ఉత్తీర్ణులగు వారిని, యూనియన్ ఉద్యోగముల కర్హులుగా ప్రకటించుట, కమీషన్ చేయు ముఖ్యకార్యము. ఉద్యోగస్థుల నియమించుటలో గమనించ వలసిన అర్హతలు, ఉద్యోగాభివృద్ధి, మార్పులు, ఉద్యోగస్థులపై తీసికొనబడు క్రమచర్యలు, ప్రభుత్వ కార్యకర్తగా వ్యవహరించినప్పుడు, ఉద్యోగస్థునికి కలిగిన నష్టపరిహారము, ప్రభుత్వపక్షమున జరుగు కోర్టు వ్యవహారములఖర్చులు, మున్నగు విషయములలో కమీషన్ సలహా తీసికొనబడును. అధ్యక్షుడు ఆజ్ఞాపించిన ఇతరవిషయములపై గూడ, వారు సలహా నొసగగలరు. రాష్ట్రీముల, గవర్నరులు, లేక రాజప్రముఖులు కోరిన, రాష్ట్రీములలో జరుగు ఉన్నతోద్యోగుల నియామకములపై, యూనియన్ కమీషన్ సలహానిచ్చుటయే గాక సహాయము చేయగలదు. రెండు, మూడు రాష్ట్రీములు కలిసి, ప్రత్యేకార్హతలు గల, ఉద్యోగస్థుల నియమింప దలచిన, వారు, యూనియన్ కమీషన్ ద్వారా సలహాలను పొందవచ్చును.

ఇండియన్, అడ్మినిస్ట్రేటివు సర్వీసు, ఇండియన్ ఆడిట్ సర్వీసు, ఇండియన్ పోలీసు సర్వీసు మొదలగు ముఖ్య అఖలభారత సర్వీసులలో ఉద్యోగస్థుల నియామకమును గురించి యూనియన్ కమీషన్ సలహా కోరుటకు బదులుగా, అధ్యక్షుడు, పార్లమెంటులో బిల్లును ప్రవేశపెట్టి దానిఆమోదము పొందగలడు. ఈ చట్టనిర్మాణముతో కమీషన్‌కు సంబంధముండదు. వెనుకబడియున్న తరగతులవారికి, కొన్ని ఉద్యోగములు ప్రత్యేకించునప్పుడు కమీషన్ సలహా పొందనవసరములేదు.

సంవత్సరమున కొకపరి, యూనియన్ పబ్లిక్ సర్వీసుకమీషన్ తాముచేసిన కార్యక్రమ సమీక్ష, రిపోర్టుద్వారా అధ్యక్షునికి అందజేయగలదు. అధ్యక్షుడు ఈ రిపోర్టును విమర్శకొరకు పార్లమెంటుకందజేయగలడు. కమీషన్ సలహాలకు వ్యతిరేకముగ ఉద్యోగనియామకములు జరిగిన, ఇట్టి విపరీత చర్యకు తగినన్ని ప్రబలకారణములను అధ్యక్షుడు పార్లమెంటులో విశదీకరించవలెను.

యూనియన్ పబ్లిక్ సర్వీసు కమీషన్‌కు భారత సమాఖ్యలో ప్రత్యేక గౌరవ స్థానము గలదు. కమీషన్ నిర్ణయములను అధ్యక్షుడు సహితము సామాన్యముగ త్రోసిపుచ్చ జాలడు. వారి సలహాల నంగీకరించ నప్పుడు, ప్రబల కారణముల జూపవలసి యుండును. మంత్రులు చేయు నిర్ణయములను, కార్యరూపమున బెట్టు గురుతర బాధ్యత సివిలు సర్వీసు ఉద్యోగులపై గలదు. వారు నీతి, ధర్మబుద్ధితో పాటు సమర్థత గలవారై యుండవలెను. అట్టివారిని నియమించు బాధ్యత కమీషన్ పైన గలదు. వారు బహుజాగరూకులై సమర్థులైనవారిని యెన్నుకొనినప్పుడే, ప్రభుత్వ కార్యక్రమము, సమర్థవంతముగ నడుపబడు నవకాశము గలదు. ప్రభుత్వబాధ్యత విశేషముగ నధికారుల పైననే గలదు. వారు సమర్థులు, ప్రజాహితైక తత్పరులైన, ప్రజ సుఖించును. ఉన్నతాధికారుల నెన్నుకొనునప్పుడు, శీలమునకు సమర్థతతో సమానముగ ప్రాధాన్యత నీయవలెను. చిల్లిబడిన నౌకలో ప్రయాణము జేయుట యెంత ప్రమాదకరమో, అవినీతిపరులతో గూడుకొనిన ప్రభుత్వమును నమ్మట యంత ప్రమాదభూయిష్ఠము. ప్రపంచ రాజ్యములలో ప్రముఖస్థానము నాక్రమించగోరు ప్రభుత్వము, సమర్థులు, శీలవంతులు, ఆత్మగౌరవము, దేశాభిమానముగల ఉద్యోగస్థుల నాదరించి నియమించుకొనవలెను. ఇట్టి మహత్వపూరిత కార్యములో ఉత్తమసలహాలనొసంగి, యోగ్యులగు యువకుల నెన్నుకొనుభాగము యూనియన్ సర్వీసు కమీషన్‌పై గలదు. కమీషన్ సభ్యులు నిష్పాక్షికముగ నుండుటే గాక, యోగ్యతాయోగ్యతలను చక్కగా పరిశీలన జేయుశక్తి గలవారై యుండవలెను. మంత్రి మండలి, తదితర ఉన్నతాధికారుల మోమాటమునకు లోనుగాకుండ, తమ ఆత్మయే సాక్షిగా, విద్యుక్త ధర్మమును, నెరవేర్చు వారై యుండవలయును. దేశక్షేమము విశేషముగ వారి కృషిపై నాధారపడి యుండును.



౮

# సమాఖ్యా ఆర్థిక వ్యవస్థ

సమాఖ్య ఆర్థికవ్యవస్థను పరిశీలించి తగు సలహాలనిచ్చుటకై, అయిదుగురు సభ్యులతో గూడిన ఆర్థిక సలహాసంఘమును, అధ్యక్షుడు నియమించును. సభ్యుల యోగ్యతలను, వారిని ఎన్నుకొను విధానమును, పార్లమెంటు చట్టముద్వారా నిర్ణయించును. అయిదు సంవత్సరములకొక పర్యాయము, సంఘసభ్యులలో మార్పు జరుగగలదు. రాష్ట్రములకు కేంద్రమునుండి యిచ్చు గ్రాంటులను, ఎట్టి అవసరములకు, ఏయే నిబంధనలతో యివ్వవలసినదో యీ సంఘము నిర్ణయించును. కొన్ని ప్రత్యేక పన్నులనుండి వచ్చు ఆదాయమునుండి కేంద్రమునకు రాష్ట్రములకు రావలసిన భాగములనుకూడ ఈ సంఘము నిర్ణయించును. బి. వర్గములోని రాష్ట్రములతో చేసికొనిన ఆర్థిక ఒడంబడికలలోని షరతుల నిర్ణయమును అందు జేయవలసిన మార్పులను యీ సంఘము సూచించును. దేశ ఆర్థిక సౌష్టవమును పెంపొందింప జేయుటకై, తీసికొనవలసిన చర్యలను నిర్దేశించును.

ఆర్థిక సలహాసంఘనివేదికను, పార్లమెంటు యెదుటనుంచి, అందలి సలహాల ననుసరించి తీసికొనిన చర్యలను అధ్యక్షుడు విశదీకరించును.

కొన్నిపన్నులు కేంద్రముచే విధింపబడినప్పటికి, రాష్ట్రప్రభుత్వములువసూలుచేసి స్వోపయోగమునకు ఉపయోగించుకొనును. మందులు, పరిమళద్రవ్యములు, స్టాంపులపై పన్నులు, ఇట్టివి. సి. వర్గమురాష్ట్రములలో, యిట్టిపన్నులు కేంద్రప్రభుత్వముచే వసూలుచేయబడును.

కొన్ని పన్నులు కేంద్రప్రభుత్వముచే విధింపబడి, వసూలు జేయబడినప్పటికీ, దానిపై వచ్చు ఆదాయము రాష్ట్రములకు కేటాయించబడును. వ్యవసాయేతర భూములపై శిస్తు, వారసత్వపు పన్నులు, ప్రయాణీకుల టిక్కట్లు, సామానులపై పన్నులు, ప్రయాణాంతమందు, టిక్కట్లు, సామానులపై విధింపబడు పన్నులు ( Terminal-Taxes )స్టాక్ ఎక్స్చేంజి, ప్రత్తి, జనపనార మార్కెటులందలి ఒడంబడికలకై స్టాంపుల డ్యూటీ, వార్తా పత్రికలు, అందలి ప్రకటనలపై అమ్మకపుపన్ను మున్నగునవి యీ శ్రేణికి జెందినవి. ఈ పన్నులు రెండు మూడు రాష్ట్రాలలో సమష్టిగా విధించినప్పుడు, రాష్ట్రముల మధ్య ఆదాయ విభజన పార్లమెంటు చట్టము ద్వారా జరుగగలదు.

ఆదాయపుపన్ను, భూమ్యాదాయముపై పన్ను, కేంద్రప్రభుత్వముచే విధింపబడి, వసూలుజేయబడినప్పటికి, అందు కొంతభాగము రాష్ట్రములకు సహాయముగ నీయబడును. సి. వర్గ రాష్ట్రములలో ఆదాయపుపన్ను కేంద్రమునకు సంక్రమించును. కేంద్రమునకువచ్చు ఆదాయమునుంచి రాష్ట్రములకీయవలసిన సహాయమును, ఆర్థికసలహా సంఘ అభిప్రాయమననుసరించి అధ్యక్షుడు నిర్ణయించును. జనపనార, జనపనారతో చేయబడినవస్తువుల యెగుమతిపై కేంద్రప్రభుత్వము పన్నువిధించును. ఈపన్ను నాలుగురాష్ట్రములలో వసూలు చేయబడుచున్నది (బీహారు, ఒరిస్సా, పశ్చిమబెంగాలు, అస్సాం). పై ఆదాయమునుండి, ఈనాల్గురాష్ట్రములకు ప్రత్యేకధనసహాయము (గ్రాంటు) ఇవ్వబడుచున్నది. ధనసహాయ ప్రమాణమును, ఆర్థికసలహా సంఘపు సంప్రదింపుతో అధ్యక్షుడు నిర్ణయించును.

రాష్ట్రముల ఆర్థిక పరిస్థితి అస్తవ్యస్థమైనప్పుడు, లేక అనుబంధములో చేర్చబడిన, కులములు, జాతుల అభివృద్ధికై యేర్పడిన ప్రత్యేకప్రణాళికల వ్యయమునిమిత్తం, కేంద్రమునుంచి, తత్సంబంధమైన రాష్ట్రములకు ఆర్థికసహాయము యీయబడును. ఇట్టి అభివృద్ధి ప్రణాళికల సిద్ధము చేయుటకు కేంద్రప్రభుత్వానుమతి యావసరము.

ఉద్యోగస్థులు, వ్యాపారులు, న్యాయవాదులు, డాక్టర్లు మున్నగు వారిపై వృత్తిపన్ను, ఆస్తిపన్ను విధించుటకు రాష్ట్రప్రభుత్వముల కధికారము గలదు. ఒకే వ్యక్తినుంచి యిట్టిపన్నులు రు 250/-ను మించి వసూలు చేయరాదు. ఈపన్నులు కేంద్రప్రభుత్వము విధించు ఆదాయపు పన్నుకంటె భిన్నముగావున, వీనిలో కేంద్రప్రభుత్వమున కెట్టి సంబంధము లేదు.

౯

# అసాధారణ సన్నివేశములు

దేశ కాల పరిస్థితులు అనుగుణ్యముగానున్నప్పుడు రాజ్యాంగ విధానము నడిపించుట సులభము. ప్రతికూలపరిస్థితు లేర్పడినప్పుడు, గడ్డుసమస్యల నెదుర్కొనవలసినప్పుడు, రాజ్యాంగ విధానము కన్నా భిన్నముగానివిధముగా కాలానుగుణ్యముగ చేయవలసిన మార్పులను ముందే ఆలోచించుకొనుట ఉత్తమ లక్షణము. మూడు విధములైన ప్రతికూల పరిస్థితులు సాధారణముగ యేర్పడవచ్చును. 1. దేశములో శాంతి భద్రతలకు భంగము వాటిల్లుట లేక శత్రువులతో యుద్ధము లేక దురాక్రమణ. 2. ఏదైనా రాష్ట్రములో ప్రజా ప్రతినిధి ప్రభుత్వము యేర్పడక, పరిపాలన స్థంభించిపోవుట. 3. ధనలోపమువాటిల్లి ఆర్థికవ్యవస్థ భగ్నమగుట.

ఇట్టి అసాధారణ పరిస్థితి యేర్పడినప్పుడు, అధ్యక్షుడు వెంటనే, పై పరిస్థితుల వివరించుచు ప్రకటన జేయగలడు. ఈ ప్రకటనతో భారత కేంద్ర ప్రభుత్వమునకు కొన్ని అసాధారణ అధికారములు లభించగలవు. రాష్ట్ర పరిపాలన స్థంభించినప్పుడు, సర్వాధికారములు కేంద్ర పార్లమెంటుకు లభించగలవు. ఇట్టి ప్రకటన రెండు నెలల కాలము అమలులో నుండగలదు. ఈలోపుగా పార్లమెంటులో, యీ ప్రకటన చర్చింపబడి ఆమోదింపబడిన, కాలపరిమితి పార్లమెంటు నిర్ణయము ప్రకారము పొడిగింపబడును. పరిస్థితులు సౌమ్యములగుచో, అధ్యక్షుడు యీలోపుగా ప్రకటనను ఉపసంహరింపవచ్చును.

ప్రకటన అమలులోనున్న కాలములో, రాష్ట్రప్రభుత్వము లెట్లు నడుచుకొనవలెనో, కేంద్రప్రభుత్వము నిర్ణయింపగలదు. కేంద్రము, రాష్ట్రముల మధ్యనుండు ఆర్థిక విభాగమును, అధ్యక్షుడు అనుగుణ్యముగా సవరింపవచ్చును. ఏడవ అనుబంధములో నుదహరింపబడిన సర్వ విషయములపై, పార్లమెంటు శాసింపవచ్చును. అధ్యక్షుడు, రాష్ట్రగవర్నరు లేక రాజప్రముఖుని అధికారముల స్వీకరించవచ్చును. రాష్ట్ర శాసనసభల యధికారములు పార్లమెంటుకు సంక్రమింపజేయవచ్చును. అధ్యక్షుడు హైకోర్టుల అధికారముల స్వీకరించుటకు వీలు లేదు. రాజ్యాంగములో హైకోర్టులగురించి చేర్చబడిన మరే విషయమునుగాని కొంతయు మార్పజాలడు. ఎంతటి క్లిష్టపరిస్థితి యేర్పడినప్పటికి న్యాయాధికారములు, న్యాయరక్షణ స్వతంత్రముగ నుండవలెను.

రాష్ట్రశాసనాధికారములు పార్లమెంటుకు సంక్రమించినప్పుడు, పార్లమెంటు, అట్టి అధికారములను అధ్యక్షునికి, కేంద్రప్రభుత్వోద్యోగులకు అప్పగించవచ్చును. రాష్ట్రముల మూలధనమునుండి ఖర్చుచేసి, తరువాత పార్లమెంటు ఆమోదము పొందుటకు, అధ్యక్షునకధికారము ఉండగలదు. కేంద్రప్రభుత్వాధికారులు, రాష్ట్రప్రభుత్వమును వశపరుచుకొని, కేంద్రప్రభుత్వ ఆదేశానుసారము, పరిపాలన సాగించవచ్చును. రాష్ట్రప్రభుత్వముల స్వాధీనముజేసికొను ప్రకటన, ఆరునెలలకొక పర్యాయము పార్లమెంటు ఆమోదమును పొందితీరవలెను. అంతేకాక, మొత్తము మూడుసంవత్సరములకన్న యెక్కువ కాలము యీ ప్రకటన అమలులో నుండరాదు.

భారత సమాఖ్య అస్తిత్వమునకే ముప్పువచ్చిన క్లిష్టసమయములలో, దేశరక్షణ దృష్ట్యా ప్రాథమిక హక్కులలో, అవసరమని తోచినవానిని, పార్లమెంటు అంగీకారముతో, అధ్యక్షుడు అమలులో లేకుండచేయవచ్చును. 32 మరియు 226 సూత్రములలో హైకోర్టు ద్వారా రక్షింపబడుటకు ప్రజలకుగల యధికారమును ఉపసంహరింప

వచ్చును. అధ్యక్షుడు ఇట్టి ప్రకటనను బహుజాగరూకతతో ఆలోచించి చేయవలెను.

భారత్ సమాఖ్యకు ఆర్థికలోపము కలిగినప్పుడు కేంద్రఉద్యోగస్థుల జీతములు తగ్గించుటకును, రాష్ట్రములలోగూడ ఇదేమాదిరిగ జేయవలసినదని ఆజ్ఞాపించుటకును అధ్యక్షునకధికారముగలదు. ఇట్టి ప్రకటన రెండు నెలలకాలము అమలులో నుండును. ఈలోపుగా పార్లమెంటు ఆమోదించినచో, కాలపరిమితి పొడిగించవచ్చును. రాష్ట్రశాసనసభలలో అంగీకరింపబడిన ఆర్థికబిల్లులను అధ్యక్షుడు తెప్పించుకొని, అందు అవసరమగు మార్పులుజేసి, తన సంతకముతో అమలు జరుపవచ్చును.

ఇంగ్లాండులోఇట్టిప్రకటన కాలపరిమితి వారము రోజులుమాత్రమే. భారతదేశములో యీ కాలపరిమితి రెండు నెలలు. రెండునెలలలోగా పార్లమెంటు యీ ప్రకటనను ఆమోదించనిచో, లేక చర్చించకనే విడిచినచో, రెండునెలల గడువుతో ప్రకటనప్రభావము సహజముగా రద్దుకాగలదు. భారత రాజ్యాంగ విధానములో, అధ్యక్షుని యిట్టి ప్రత్యేకాధికారములు, అమెరికా అధ్యక్షునికిగల విశేష కార్యనిర్వాహణాధికారములకు అనుకరణమని గ్రహించునది. భారతరాజ్యాంగము కొన్ని విషయములలో ఇంగ్లాండును, మరికొన్ని విషయములలో అమెరికాను అనుకరణముగా నున్నది.

# ౧౦

# ఎ. బి. సి. డి. వర్గములలో చేరిన రాష్ట్రముల పరిపాలన

## ( కార్యనిర్వహణ శాఖ )

**1.** అస్సాం 2. బీహారు 3. బొంబాయి 4. మధ్యప్రదేశము 5. మద్రాసు 6. ఒరిస్సా 7. పంజాబు 8. ఉత్తరప్రదేశము 9. పశ్చిమ బెంగాలు. ఇవి తొమ్మిది ఎ. వర్గములో చేరిన రాష్ట్రములు

ప్రతి రాష్ట్రమునకు అధిపతి గవర్నరు. ఇతనిని అధ్యక్షుడు నియమించును. ఉద్యోగ కాలపరిమితి ఐదు సంవత్సరములు. ఈ లోపుగా, అధ్యక్షునికి తెలిపి గవర్నరు ఉద్యోగమునుండి విరమించుకొనవచ్చును. నూతన గవర్నరు పదవి స్వీకరించువరకు ప్రాతగవర్నరు అధికారములో నుండగలడు. గవర్నరు భారత పౌరుడై యుండి 35 సంవత్సరముల వయసుకు మించి యుండవలెను.

(1) హైదరాబాదు (2) జమ్ము, కాశ్మీరు (3) మధ్యభారతము (4) మైసూరు (5) పటియాలా, తూర్పు పంజాబు రాష్ట్రముల సమూహము ( PEPSU ) (6) రాజస్థానము (7) సౌరాష్ట్రము (8) కొచ్చిన్- తిరువాన్కూరు (9) వింధ్యప్రదేశము. ఇవి తొమ్మిది బి. వర్గములో చేరిన రాష్ట్రములు. వీనికి అధిపతి ( గవర్నరు స్థానే ) రాజప్రముఖుడు.

హైదరాబాదులో నిజాము ప్రభువు, జమ్ముకశ్మీరు, మైసూరులలో అచ్చట మహారాజులును రాజప్రముఖులుగా అంగీకరించనైనది. కడమ రాష్ట్రములలో పూర్వపు సంస్థానాధీశ్వరులలో నొకరిని, రాజప్రముఖునిగా, అధ్యక్షుడు అంగీకరించినాడు.

రాజప్రముఖునకు ఉద్యోగ కాలపరిమితి లేదు. అధ్యక్షుడు అనుగ్రహించినంత కాలము వారు పదవిలోనుండగలరు. ఏ కారణము వల్లనైన అధ్యక్షుని ఆగ్రహమునకు పాత్రుడైన రాజప్రముఖుడు, తన పదవిని గోల్పోవగలడు. భారత సమాఖ్య ఐకమత్యమునకు వ్యతిరేకముగ వ్యవహరించిన బరోడా రాజప్రముఖుడు పదవీచ్యుతుడు గావింపబడిన యుదంతము యీసందర్భములో గమనించదగినది. రాజప్రముఖునకు వయసు నిబంధనలుగూడ లేవు.

గవర్నర్లకు రాజప్రముఖులకు తమతమ రాష్ట్రములలో సమానాధికారములు గలవు. కేంద్రమును అధ్యక్షుడు మంత్రిమండలి సహాయముతో పాలించునట్లు, రాష్ట్రములను గవర్నర్లు (రాజప్రముఖులు), తమతమ రాష్ట్ర మంత్రిమండలుల సహాయముతో పరిపాలించగలరు. కేంద్రప్రధానమంత్రికి, అధ్యక్షునికిగల యధికారములే, శాసననిర్మాణములో, రాష్ట్రప్రధానులకు, గవర్నర్లకు (రాజప్రముఖులకు) గలవు.

ఇకముందునుంచి గవర్నరు అను పదము వ్రాసిన ప్రతి సందర్భమునకు రాజప్రముఖుడు గూడ, అవే అధికారములు గలిగియున్నాడని గ్రహించవలెను.

గవర్నరు కేంద్ర పార్లమెంటులోగాని, రాష్ట్రశాసనసభలలో గాని సభ్యుడుగా నుండరాదు. ప్రభుత్వోద్యోగిగా నుండరాదు. అట్టివారు గవర్నరుపదవికి నియమింపబడినప్పుడు, తమ పూర్వ సభ్యత్వమును, పదవిని వదలుకొనవలెను. గవర్నరు స్థానము ఖాళీఅయినప్పుడు అధ్యక్షుడు, తగువ్యక్తిని ఆపదవికి నియమించగలడు, ఏడవ

అనుబంధమున్న, కేంద్ర విషయసూచికలో చేరిన విషయములపై గవర్నరు శాసనసభలో మంత్రిమండలిద్వారా, బిల్లుల ప్రవేశపెట్టగలడు. కేంద్రమున అధ్యక్షునకు ప్రధానమంత్రికిగల అధికారములు మరియు సంబంధములే, గవర్నరు మరియు రాష్ట్రముఖ్యమంత్రి మధ్యన గూడ కలవు. గవర్నరు అధికారములన్నిటిని ముఖ్యమంత్రి, మంత్రిమండలి ద్వారా అమలు పరుచును. గవర్నరు రాష్ట్రశాసనసభలో అధిక సంఖ్యాకవర్గనాయకుని ముఖ్యమంత్రిగా నియమించి, అతని సలహాతో ఇతర మంత్రుల నియమించును. మంత్రుల అధికార నిర్ణయము, ప్రభుత్వ శాఖల విభజన ముఖ్యమంత్రి సంప్రదింపుతో గవర్నరు జేయును. ప్రభుత్వ పక్షమున వెలువడు ఆజ్ఞలన్నియును గవర్నరు పేరుతో, ప్రధానమంత్రిసంతకముతో, అమలు జరుపబడును.

మంత్రిమండలి సమావేశములో జరుగు నిర్ణయముల, ముఖ్యమంత్రి, గవర్నరుకు తెల్పుచుండ గలడు. ముఖ్య మంత్రి, మంత్రివర్గముతో సహా శాసనసభకు, బాధ్యత వహించగలడు. శాసనసభలో అధికసంఖ్యాక బలమున్నంతవరకు ముఖ్యమంత్రిని తొలగించుటకు వీలులేదు. గవర్నరు, అడ్వకేటు జనరలును నియమించి, అతనికి ఇయ్యవలసిన ప్రతిఫలమును నిర్ణయించును. పబ్లిక్ సర్వీసు చైర్మన్, కడమసభ్యుల, నియమించును గాని, వారిని పదవినుండి తొలగించజాలడు రాష్ట్రశాసనసభలో చట్టరీత్యా, ఉద్యోగస్థులవిద్యావిశేషములబట్టి వారినికమీషన్ ద్వారా యేరుకొనుక్రమవిధానము, మున్నగునవి, నిర్ణయింపబడునంతవరకు, గవర్నరు తాత్కాలిక నిబంధనల నేర్పరచగలడు. రాష్ట్రీయ సివిలు ఉద్యోగస్థులను, సర్వీసు కమీషన్ సలహాననుసరించి గవర్నరు నియమించును. అతని అనుగ్రహమునకు పాత్రులై, ఉద్యోగస్తులు పనిజేయుదురు. కొన్ని రాష్ట్రములలో, అనుబంధములోచేరిన జాతులు, ప్రదేశములు గలవు. వాని పరిపాలనా బాధ్యత గవర్నరుపై గలదు. వారి అభ్యున్నతికైనొక సలహాసంఘము నతడు నియమింపవచ్చును. ప్రతి సంవత్సరాంతమున దు పరిపాలనా నివేదికను, భారతాధ్యక్షునికి సమర్పించవలెను.

1. బీహారు 2. మదరాసు 3. బొంబాయి 4. ఉత్తరప్రదేశము 5. పశ్చిమ బెంగాలులోను, మైసూరులోను, రెండు, రెండు శాసనసభలుగలవు. అందు ఉన్నత శాసనసభ(Upper Chamber)ను, రాష్ట్రశాసనసమితియందురు. ఉభయశాసనసభల పరస్పరసంబంధము కేంద్రములోవలెనే యుండును. సాహిత్య, విజ్ఞాన, కళాకోవిదులగు వారినిగొందరిని శాసనసమితికి గవర్నరు నియమింపవచ్చును. శాసనసభలో, ఆంగ్లో-ఇండియన్ జాతివారికి సరియైన ప్రాతినిధ్యములేకున్న ఒకరిద్దరు సభ్యులను శాసనసభకుగూడ నియమించవచ్చును.

ఉభయశాసనసభల సమావేశపరుచుట, ఉపసంహరించుట, సంయుక్తసమావేశములో ఉపన్యసించుట గవర్నరు కర్తవ్యములు. పైసభలు, సంవత్సరమునకు రెండుపర్యాయములు, రెంటికిమధ్య ఆరునెలలకన్న ఎక్కువ వ్యవధిలేకుండా, తప్పక సమావేశపరచవలెను. శాసనసభసభ్యులు, ప్రజాభిప్రాయమునకు వ్యతిరేకముగ, మంత్రిమండలి ప్రతిపాదనల త్రోసిపుచ్చుచున్నారని ముఖ్యమంత్రి భావించినయెడల, అతనిసలహాపై గవర్నరు శాసనసభనుమాత్రము రద్దుజేసి, క్రొత్త యెన్నికలుజరిపించవలెను. అతనికి శాసనసమితిని రద్దు (Dissolve) జేయు అధికారము లేదు.

చిత్తు శాసనములపై చర్చజరుగుచున్నప్పుడు గవర్నరు తన అభిప్రాయములను, విమర్శను శాసనసభకు తెలుపవచ్చును. శాసనసభ అట్టి విమర్శను, అభిప్రాయమును గమనించి తీరవలెను. అటుపైన, అధికసంఖ్యాకతీర్మానముతో నెగ్గిన చిత్తుచట్టమును గవర్నరు ఆమోదమునకై పంపుదురు. గవర్నరు సంతకముతో, అది అవశ్యపాలనీయమైన చట్టముకాగలదు. కొన్ని చిత్తు చట్టములను గవర్నరు భారతాధ్యక్షుని సంతకమునకై పంపును. అవసరమని తోచినబిల్లును శాసనసభకు తిరుగ పంపవచ్చును, శాసనసభ రెండవమారు ఆ శాసనమును ఆమోదించినయెడల గవర్నరు తప్పక సంతకము జేసితీరవలెను. ఆర్థికసంబంధమైన బిల్లులను తిరుగగొట్ట వీలులేదు. వాటిపై గవర్నరు వెంటనే సంతకము చేసితీరవలెను.

ఉభయ శాసనసభలు సమావేశము గానప్పుడు, అత్యవసర పరిస్థితు లేర్పడి, వెంటనే చర్య తీసికొనవలసినప్పుడు ముఖ్యమంత్రి సలహాతో గవర్నరు తాత్కాలిక శాసనముల నమలుపరుపవచ్చును (ordinances) శాసనసభలు సమావేశమైన తేదినుండి, ఆరువారములు తరువాత, తాత్కాలిక శాసనము రద్దు కాగలదు. ఈ లోపుగా, శాసనసభలు తీర్మానించిన గాని లేక గవర్నరు స్వయముగా ఉపసంహరించిన గాని, ఇట్టి తాత్కాలిక శాసనములు రద్దు కాగలవు.

1. ఏప్రిలులో ఆరంభమయే ప్రతి ఆర్థిక సంవత్సరారంభమందు, రాష్ట్ర ఆదాయ వ్యయముల పట్టికను, ఆదాయమును వృద్ధి చేయుటకై క్రొత్త పన్నుల సూచనలు, క్రొత్త ప్రణాళికలను గూర్చి, మున్నగు వాటిని, బడ్జెటు రూపమున, శాసనసభకు గవర్నరు నివేదించవలెను. బడ్జెటుపై చర్చ చాల ముఖ్యమైనది. గవర్నరు ప్రధాన, ఆర్థికమంత్రి శాసనసభలో సమాధానము లొసగగలరు. ఆర్థిక సంబంధమైన ఏ ప్రతిపాదన గాని, గవర్నరు సమ్మతి లేనిదే, శాసనసభలో ప్రవేశపెట్టుటకు వీలులేదు. గవర్నరు ఆర్థిక బిల్లులపై సంతకము చేయక నిరాకరించుట గాని, అందు మార్పులు చేయుట గాని, చేయజాలరు.

రాష్ట్రమునందలి ప్రధాన న్యాయస్థానమునకు న్యాయమూర్తుల నియమించుటకు ముందు, అధ్యక్షుడు గవర్నరుతో సంప్రదించును. నియమితుడైన న్యాయమూర్తి, గవర్నరు యెదుట ప్రమాణ స్వీకారము చేయగలడు. బి. వర్గ రాష్ట్రములలో న్యాయమూర్తుల కీయవలసిన వేతనమును, రాజ ప్రముఖుని సంప్రతించి అధ్యక్షుడు నిర్ణయించును. జిల్లా జడ్జీలను గవర్నరే, హైకోర్టు సలహా ననుసరించి నియమించును. సబ్ జడ్జీలను, మున్సిఫులను, మేజిస్ట్రేట్లను నియమించునప్పుడు, హైకోర్టుతో పాటు, పబ్లిక్ సర్వీసు కమీషను నుండి కూడ సలహా పొందగలడు. ప్రధాన న్యాయమూర్తి తన క్రింది న్యాయాధిపతుల

నియమించునప్పుడు సర్వీసు కమీషను సలహా పొందవలెనని, గవర్నరు నియమించవచ్చును. మేజిస్ట్రేటులు, జడ్జీల నియామకము వరకే గవర్నరుకు అధికారము కలదు గాని, న్యాయవిచారణ యందు, అతనెట్టి జోక్యము కలుగజేసికొనరాదు.

రాష్ట్రీయ శాసనముల నతిక్రమించినందున కోర్టులచే విధింపబడిన శిక్షలను, గవర్నరు తగ్గించవచ్చును; లేక క్షమించి విడిచిపెట్టవచ్చును, లేదా కొంతకాలమువరకు శిక్షను నిలుపుదలజేయవచ్చును.

అనుబంధములో చేర్చబడిన ప్రత్యేకప్రాంతముల పరిపాలన, గవర్నరు, తన స్వంత బాధ్యతమీద, అధ్యక్షుని ఆజ్ఞలననుసరించి చేయవలెను. పరిపాలనా విషయిక సాంవత్సరికనివేదికను, అధ్యక్షున కందజేయవలెను. ఇట్టిప్రాంతముల పరిపాలనకై, నిబంధనలను ఏర్పరచి, అమలు జరుపవచ్చును. నిబంధనలను సూచించుటకు, అమలుజరుపుటకు, ఒక సలహాసంఘమును గవర్నరు నియమించవచ్చును. ఇట్టి నిబంధనలకు, భారతాధ్యక్షుని ఆమోదము అవసరము.

## రాష్ట్ర మంత్రిమండలి

మంత్రిమండలి నియామకము, కార్య నిర్వహణములో, కేంద్రమునకు, రాష్ట్రములకు, ఈషణ్మాత్రమైన భేదము లేదు. గవర్నరుకు ముఖ్య సలహాదారునిగా ముఖ్యమంత్రి వ్యవహరించగలడు. రాష్ట్ర శాసనసభలో అధికసంఖ్యాకసభ్యుల విశ్వాసమునకు పాత్రుడైన నాయకుని గవర్నరు, ముఖ్యమంత్రిగా నియమించగలడు. అతనిసలహాపై యితర మంత్రుల నియమించి వారు నిర్వహించవలసిన ప్రభుత్వశాఖల విభజన చేయును. మంత్రిమండలి సమావేశములలో జరుగు నిర్ణయము

లను, ముఖ్యమంత్రి గవర్నరుకు నివేదింపగలడు. అతనిచ్చిన సలహాల తిరిగి మంత్రిమండలితో చర్చించగలడు.

రాష్ట్ర పరిపాలన గవర్నరు పేరుతో జరిగినప్పటికి నిజముగా, ఆజ్ఞల నిచ్చునది మంత్రులే. మంత్రిమండలి ఒక సంస్థగా పనిచేయును గావున, ఒంటొకరు జేసిన పనులకు ఇతరులు సమిష్టిగా బాధ్యులు. తాముజేయు పనులను, వారు శాసన సభలో సమర్థించుకొనవలెను. సభ్యుల ప్రశ్నలకు శాసనసభలో సరియగు సమాధానముల నీయ వలెను. ఆర్థిక బిల్లులను, ప్రవేశపెట్టుటకు, మంత్రులకే యధికారము గలదు.

శాసన సభలో, అధికసంఖ్యాక బల మున్నంతవరకు, ముఖ్య మంత్రిని మార్చుటకు వీలులేదు. అతనిసలహాలను, గవర్నరు మన్నించి తీరవలెనను, రాజ్యాంగ సంప్రదాయముగలదు (Constitutonail Convention) గవర్నరు అధికారములక్రింద సూచించిన పనుల న్నియు ముఖ్యమంత్రియే చక్కబెట్టుచుండును. యదార్థములో గవర్నరే, ముఖ్యమంత్రికి సలహాదారుడు, సర్వాధికారములు ముఖ్య మంత్రివే. కేంద్రములో ప్రధానమంత్రికి, పార్లమెంటుకు గల, సంబం ధమే ముఖ్యమంత్రికి, రాష్ట్ర శాసన సభలోగలవు. ఆ వివరములు, కేంద్రమంత్రిమండలి శీర్షికక్రింద నుదహరింపబడినవి.

మంత్రులందరు శాసనసభాసభ్యులై యుండవలెను. సభ్యులు కానివారిని మంత్రిపదవికి నియమించిన, ఆరునెలలలోగా అట్టి సభ్యత్వ మును సంపాదించుకొనవలెను. లేదా మంత్రిపదవినుంచి విరమింప వలసియుండును. ఈ విధముగ శాసనసభకు, మంత్రిమండలికి యెల్ల ప్పుడు అవినాభావసంబంధము గలదు.



౧౧

# రాష్ట్ర శాసనసభలు

బీహారు, మద్రాసు, తూర్పు పంజాబు, ఉత్తరప్రదేశము పశ్చిమబెంగాలు, మైసూరు రాష్ట్రములలో, రెండు, రెండు శాసన సభలు గలవు. అందొకటి ప్రజాసభ, రెండవది ఉన్నతసభ. ఉన్నత సభను శాసనసమితి, అని, ప్రజాసభను, శాసనసభ అని వ్యవహరించెదరు.

శాసనసమితిలో (40) సభ్యులకు తక్కువ గాకుండా, శాసన సభా సభ్యుల సంఖ్యలో నాల్గవవంతును మించకుండా, సభ్యులుండ గలరు. అందు కొన్ని స్థానములకు గవర్నరు, సాహిత్యము, విజ్ఞానము, కళ, సహకారోద్యమము, సంఘసేవలందు ప్రవీణులగు వారిని నియమించును. సమితిసభ్యులు, భారతపౌరులై యుండి (30) సంవత్సరముల వయసును మించినవారై యుండవలయును. మిగతా స్థానములకు నాల్గు రకములగు నియోజక వర్గములనుండి, సభ్యులు యెన్నుకొనబడుదురు. (1) మూడవవంతు సభ్యులను, పురపాలకసంఘములు, జిల్లా సంఘములు, తదితర స్థానిక ప్రభుత్వ సంస్థల సభ్యులు యెన్నుకొందురు. (2) మూడవవంతు సభ్యులను, శాసనసభాసభ్యులు, సభ్యులు కానివారినుండి యెన్నుకొందురు. (3) పన్నెండవవంతు సభ్యులను, కనీసము, మూడు సంవత్సరముల క్రితము పట్టభద్రులైనవారు యెన్నుకొందురు. (4) పన్నెండవవంతు సభ్యులను మూడు సంవత్సరకముల పైగా ఉపాధ్యాయవృత్తిలో నున్నవారు యెన్నుకొందురు. ఎనిల్లునక

సంఖ్యానిష్పత్తి ననుసరించి సంక్రమణీయ ఓటింగు విధానముద్వారా, జరుపబడును.

సమితి సభ్యులు తమలో నొకరిని, అధ్యక్షునిగాను, ఇంకొకరిని ఉపాధ్యక్షునిగాను యెన్నుకొందురు. వీరిరువురు, సమితి సభ్యత్వమును కోల్పోయినను, స్వచ్ఛందముగ రాజీనామా నిచ్చినను, అధికసంఖ్యాక సభ్యులు వీరిపై విశ్వాసరాహిత్య తీర్మానము నామోదించినను, తప్ప తమ పదవులనుండి విరమించుకొనరు.

శాసన సభవలె అయిదు సంవత్సరములకొకపరి విలీనముగాక, సమితి శాశ్వతముగ నుండును. ప్రతి రెండు సంవత్సరములకు, అందు మూడవవంతు సభ్యులు, వైదొలగి, ఆ స్థానములకు తిరిగి ఎన్నికలు జరుగును. ప్రాత సభ్యులు తిరిగి పోటీ చేయవచ్చును.

కోపమువచ్చినపుడు నూరువరకు లెక్కించి పిదప మాటలాడుమని యొక సామెతగలదు, ఈ లోపుగా, కోపోద్రేకము తగ్గిపోవుననుటకు సందేహము లేదు. ఒకవేళ తనవలన పొరపాటు జరిగిన సరిదిద్దుకొనుటకు వ్యవధి చిక్కును. ఇదే సదుద్దేశము మనసులో పెట్టుకొని ఉన్నత శాసనసభ అనగా సమితిని ఏర్పాటుచేసినారు. ఉత్సాహవంతులగు యువకులు, ఉద్రేకపూరితులై తొందరపడి, ఏదేని శాసనమును, శాసన సభలో ప్రవేశపెట్టినప్పటికి, అందలి యుక్తాయుక్తములను, లోపములను, విమర్శనాపూర్వకముగ సవరించుటకు, అనుభవ వయఃపరిపాకములుగల సమితిసభ్యుల కవకాశము లభించుచున్నది. ఉభయ శాసన సభల అంగీకారము పొందుటలో కొంత కాలహరణము జరుగుటవల్ల శాసన విషయమును సమరసభావముతో పరిశీలించుటకు, లోపాలోపముల గ్రహించి సరిదిద్దుకొనుటకు, వ్యవధి లభించుచున్నది. శాసన సభలో, సభ్యులు, పార్టీతత్వమునకు లోబడియుందురు గనుక, ఏ విషయమును నిష్పాక్షికముగ విమర్శింపజాలరు. సమితిలో పార్టీ విధానమునకు అవకాశము తక్కువ గావున, దేశ క్షేమదృష్ట్యా, విషయ

మును నిష్పాక్షికముగ విమర్శింపజాలుదురు. శాసనసభలో తొందర పాటులో జరుగు లోపములను సవరించుట సమితి యుద్దేశ్యము.

రాష్ట్రశాసనసభ:- శాసనసభాసభ్యులను, వయోజనవోటింగు విధానమునను సరించి, ప్రజలు నేరుగా యెన్నుకొనగలరు. ప్రతి 75000 జనసంఖ్యకొక సభ్యుని, నియామకము జరుగును. రాష్ట్రశాసనసభలో (60) సంఖ్యకు తక్కువగా కుండా, (500)ను మించకుండా, సభ్యు లుండ గలరు. ప్రతిసభ్యుడు, భారతపౌరుడై, 25 సంవత్సరముల వయసును మించినవాడై యుండవలెను.

ఆంగ్లోఇండియన్ జాతివారికి సభలో ప్రాతినిధ్యము లభించని యెడల, గవర్నరు ఆ జాతిసభ్యులకొందరిని శాసనసభకు నియమింప వచ్చును, అనుబంధములో చేర్చబడిన, కులములు, జాతులవారికి, వారి జనాభానను సరించి, సభలో ప్రాతినిధ్యము యివ్వబడినది. రాష్ట్ర ములో అయిదవవంతుజనాభా అనుబంధజాతీయులదైన, శాసనసభలో అయిదవవ తుస్థానములు వారికై ప్రత్యేకింపబడును.

శాసనసభాసభ్యులు తమలో నొక్కరిని అధ్యక్షునిగాను, మరొక రిని ఉపాధ్యక్షునిగాను యెన్నుకొనెదరు. వీరిని స్పీకరు, డిప్యూటీ స్పీకరు అని వ్యవహరించుటగలదు. వీరిరువురు, శాసనసభా సభ్యత్వ మును గోల్పోయినను, స్వచ్ఛందముగ రాజీనామానిచ్చినను, వీరిపై విశ్వాసరాహిత్య తీర్మానము అధికసంఖ్యాకసభ్యులచే ఆమోదింప బడినను, తమతమపదవులనుండి విరమింపగలరు.

శాసనసభ కాలపరిమితి అయిదుసంవత్సరములు. అధ్యక్షుని అనుమతితో గవర్నరుగాని, కేంద్రపార్లమెంటు తీర్మానముద్వారా గాని, కాలపరిమితిని పొడిగించవచ్చును. తడవకు ఒక సంవత్సరము కంటె యెక్కువకాలము పొడిగింపవీలులేదు. ముఖ్యమంత్రికి, శాసన సభకు అభిప్రాయభేదమువచ్చినప్పుడు, ప్రజాభిప్రాయమునకు భిన్న

ముగా సభ్యులు వ్యవహరించుచున్నారని, తోచినయెడల, అయిదు సంవత్సరముల కాలపరిమితిలోపుగానే, గవర్నరు శాసనసభనురద్దు చేసి నూతన్న యెన్నికలు జరిపించవచ్చును.

ఏడవ అనుబంధము, రెండవ పట్టీలోచేరిన విషయములపై శాసన నిర్మాణాధికారము రాష్ట్రసభలకే గలదు. పార్లమెంటుచే ఆమోదింపబడిన చట్టములకు వ్యతిరేకము గానిరీతిగా మూడవపట్టీలోని విషయములపైగూడ శాసనముల ప్రదిపాదింపవచ్చును.

శాసనసభచే ఆమోదింపబడిన చిత్తుచట్టము, గవర్నరు వద్దకు పంపబడును. అతను సంతకముజేసిన వెంటనే అది చట్టము కాగలదు. సంతకముచేయక, పునర్విచారణకై, శాసనసభకు పంపవచ్చును. శాసనసభ రెండవమారు చిత్తుశాసనమును ఆమోదించినయెడల, గవర్నరు, సంతకము చేసితీరవలెను. ఆర్థిక బిల్లులపై గవర్నరు సంతకము తప్పనిసరిగా చేయవలెను. ఆర్థిక విషయములలో శాసనసభదే తుది నిర్ణయము.

(1) జీవితావసరములకు ముఖ్యములగు వస్తువులని పార్లమెంటుచే నిర్ణయింపబడినవానిపై అమ్మకపుపన్ను విధించు చిత్తుబిల్లును భారతాధ్యక్షుని ఆమోదమునకై పంపవలెను.

(2) రాష్ట్రశాసనమును అమలుపరిచిన రాష్ట్ర హైకోర్టు అధికారముల సంకుచిత పరుచుటగాని, అవరోధము కల్పించుటగాని సంభవమనితోచిన, అట్టి బిల్లును అధ్యక్షుని సంతకమునకై పంపవలయును.

(3) రెండుమూడు రాష్ట్రములనుండి ప్రవహించు నదీప్రవాహము నరికట్టి, నిర్మించిన జలాశయము లేక విద్యుచ్ఛక్తి సరఫరా కేంద్రము నుండి యీయబడు నీటిపైగాని, విద్యుచ్ఛక్తిపై గాని పన్ను విధించుటకు తీర్మానించిన చిత్తుబిల్లును, తప్పక అధ్యక్షుని ఆమోదమునకై పంపవలెను.

(4) ఒకేరాష్ట్రములో, లేక ఉభయరాష్ట్రములమధ్య వర్తక వాణిజ్య సౌకర్యముల సంకుచిత పరుచుటకై బిల్లు ఉద్దేశింపబడిన యెడల దానిని మున్ముందు అధ్యక్షుని అనుమతిలేనిదే, శాసనసభలో ప్రవేశపెట్టరాదు.

(5) కొన్ని రాష్ట్రశాసనములను, ముఖ్యనౌకాశ్రయములకు, విమానాశ్రయములకు వర్తింపరాదని అధ్యక్షుడు శాసింపవచ్చును.

ప్రతి సంవత్సరారంభమందు, రాష్ట్ర ఆదాయ వ్యయ పట్టికను, శాసనసభలకు, ఆర్థికమంత్రి నివేదించవలెను. దీనినే బడ్జెటు అందురు. క్రొత్తపన్నులు విధించుటకు శాసనసభ ఆమోదము పొందవలెను, ఇట్టి ఆర్థికబిల్లులను, మంత్రిమండలియే ప్రవేశపెట్టును. సామాన్యసభ్యులకు ఆర్థికబిల్లును ప్రవేశపెట్టు నధికారము లేదు. సభ్యులు బడ్జెటులో సవరణల ప్రతిపాదించవచ్చును. ఖర్చులు తగ్గించమని కోరవచ్చును. కొన్నిఖర్చుల నిరాకరించవచ్చును. ఈ విధముగ బడ్జెటు ప్రతిపాదనల శాసనసభ ఆమోదించినపిమ్మట, పన్నులు వసూలుచేయు నధికారము ప్రభుత్వమునకు కలుగును. గవర్నరు జీతము, అలవన్సులు, స్పీకరు, డిప్యూటీ స్పీకరు, సమితి అధ్యక్షుడు, ఉపాధ్యక్షుడు, హైకోర్టు జడ్జీలు వీరి వేతనములు, రాష్ట్ర ప్రభుత్వము చెల్లింపవలసిన అప్పులు, డిక్రీ బాకీలు, వీటిని గురించి శాసనసభలో చర్చించినప్పటికి, ఖర్చులు మాత్రము నిరాకరింప వీలులేదు.

ప్రత్యేక ప్రణాళికలను అమలుపరుచుటకు ఖర్చుచేయు నధికారము మంత్రిమండలి కోరవచ్చును, శాసనసభ్యులు ఇట్టి ప్రణాళిక ఖర్చుల తగ్గించి ఆమోదింపవచ్చును, లేదా నిరాకరింపవచ్చును. ఇట్టి నిరాకరణ మంత్రిమండలిపై విశ్వాసరాహిత్య తీర్మానముగ పరిగణింపబడును, మంత్రిమండలి తమ ప్రణాళికలను ఉపసంహరించుకొనవలెను, లేదా, తమ పదవికి రాజీనామా నొసంగవలెను.

ఆర్థికసంబంధమైన బిల్లులను, తప్పక శాసనసభలోనే ముందు ప్రవేశపెట్టవలెను. సామాన్యబిల్లులను, ఉభయసభలలో నెచ్చటనైన ప్రారంభించవచ్చును. ఆర్థికబిల్లులకు సమితి ఆమోదముతో పనిలేదు, కాని ఇతరబిల్లులు, ఉభయసభలు ఆమోదించిన తరువాతనే, గవర్నరుసంతకముతో చట్టబద్ధముకాగలవు. సవరణలుగూడ ఉభయసభలచే ఆమోదింపబడవలెను. శాసనసభచే ఆమోదింపబడిన బిల్లును, శాసనసమితి నిరాకరించినయెడల, లేక మూడుమాసములలోగ తమ ఆమోదమును తెల్పక నిలిపియుంచినయెడల, ఆదేబిల్లును, శాసనసభ రెండవమారు చర్చించవచ్చును. రెండవమారు, బిల్లు శాసనసభచే ఆమోదింపబడిన, సమితి అంగీకారములేకయే, గవర్నరుసద్దకు సంతకమునకై పంపబడి, చట్టముకాగలదు. శాసనసభలో ప్రవేశపెట్టబడినబిల్లు, ఆర్థికబిల్లు అగునా కాదా యను విషయమున తుదినిర్ణయము స్పీకరు చేయగలడు.

ఉభయ శాసనసభలలో బిల్లును ప్రవేశపెట్టుటకొక నిర్ణీతవిధానముగలదు. సామాన్యసభ్యుడు బిల్లును ప్రవేశపెట్టుటకు నెలరోజులు ముందుగా, శాసనసభకు తెల్పి, సభ అంగీకారమును పొందవలెను. మంత్రిమండలిచే ప్రవేశపెట్టబడు బిల్లులకు, మున్ముందుగా సభ అంగీకారము పొందనవసరములేదు, గాని బిల్లు ప్రవేశపెట్టుచున్నట్లు సభలో ప్రకటించవలెను. అటుతరువాత చిత్తుబిల్లును గవర్నమెంటు గెజటులో ప్రకటించవలెను. బిల్లులోని వివిధభాగములను క్లాజు లందురు. శాసనసభలో ఇట్టిబిల్లును క్లాజువారీగా మొదటిపర్యాయము చదివి వినిపించెదరు.

ప్రజాభిప్రాయమును తెలుసుకొనుటకు ప్రకటించవలసినదని గాని, సెలెక్టుకమిటీకి విమర్శకై పంపవలసినదనిగాని, రెండవపర్యాయము, బిల్లును సభలో చదువవలసినదనిగాని, సభ్యులు తీర్మానించ వచ్చును. సాధారణముగ, సెలెక్టుకమిటీకి అప్పజెప్పుటలో, ప్రజాభి

కమిటీసభ్యులు, బిల్లును కూలంకషముగ, క్లాజువారీగా చర్చించి, తమ అభిప్రాయములతో సహా, నివేదికను, కమిటీఅధ్యక్షునిద్వారా, సభకు అందజేయుదురు. బిల్లును, సభలో రెండవమారు, చదువవలయునను తీర్మానము ప్రవేశపెట్టబడి, ప్రతి క్లాజుపైనను సభలో చర్చలు జరుగును. సభ్యులు, క్లాజువారీగా సవరణల సూచింపవచ్చును. ముందు సవరణలపై, సభ్యుల అభిప్రాయముతీసికొని, అధికసంఖ్యాకసభ్యులచే ఆమోదింపబడిన సవరణలను, క్లాజులో చేర్చుకొనెదరు, ప్రజాభిప్రాయమును తెలుసుకొనుటకై ప్రకటింపబడినబిల్లును, అభిప్రాయములు స్వీకరించు కాలపరిమితితీరగానే, సెలెక్టుకమిటీకి అప్పగింతురు. రెండుమార్లు బిల్లును సభలోచదివి సవరణలను అంగీకరించినతరువాత, మూడవమారు బిల్లు సభలో ప్రవేశపెట్టబడును. ఈసారి బిల్లులోని భాషాలోపములమాత్రమే సవరింపవచ్చును. ఈ విధముగ మూడు పర్యాయములు, సభచే అంగీకరింపబడినబిల్లును, (రెండు సభలున్న రాష్ట్రములలో) రెండవసభ అంగీకారమునకై పంపుదురు. ఉభయ సభల ఆమోదముపొందినతరువాత గవర్నరుసంతకమునకై పంపబడును. గవర్నరు, తన ఆమోదమును తెల్పక, పునర్విచారణకై బిల్లును పంపవచ్చును. శాసనసభలో తిరిగి బిల్లు ఆమోదింపబడిన యీమారు గవర్నరు తప్పక సంతకముచేసితీరవలెను. కొన్ని బిల్లులను, వాటి విషయప్రాముఖ్యతనుబట్టి, అధ్యక్షుని సంతకమునకై పంపవచ్చును. అట్టి సందర్భములు పైన పేర్కొనబడినవి.

## రాష్ట్ర పబ్లికుసర్వీసు కమిషను

ప్రతి రాష్ట్రములో నొక పబ్లికు సర్వీసు కమిషన్ ఉండవలయును. కమిషన్ చైర్మనును, ఇతర సభ్యులను, గవర్నరు నియమించగలడు, వారి ఉద్యోగ కాల పరిమితి ఆరు సంవత్సరముల మించరాదు

(60) సంవత్సరములు దాటినవారు యీ ఉద్యోగమున కనర్హులు. అందు సగముమంది సభ్యులు, కనీసము పది సంవత్సరములపాటు ప్రభుత్వోద్యోగము చేసినవారై యుండవలెను. గవర్నరుకు వీరిని నియమించుటకే యధికారముగాని, తీసివేయుటకు లేదు. అధ్యక్షుడు సుప్రీంకోర్టుచే విచారణ జరిపించి యూనియన్ సర్వీసు కమీషన్ సభ్యులను తీసివేసినట్లు రాష్ట్ర సర్వీసు కమీషన్ సభ్యులను పదవినుండి తొలగించవచ్చును.

రాష్ట్రీయ ఉద్యోగస్థుల నియామకమునకు పూర్వము వారి అర్హత తెలుసుకొనుటకై పరీక్షల జరిపించుట, ముఖాముఖి ప్రశ్నించి వారి యోగ్యతను గమనించుట, కమీషన్ విధులలో చేరినది. కమీషన్‌వారు నిర్ణయించిన యోగ్యత ననుసరించి, రాష్ట్రప్రభుత్వము, ఉద్యోగస్థుల నియమించును. ప్రతి సంవత్సరము తాము జేసిన కృషిని సమీకరించి ఒక నివేదికను, ఛైర్మను, గవర్నరుకు అందజేయును. గవర్నరు, యీనివేదికను రాష్ట్రశాసనసభ యెదుట, సవిమర్శకముగ నుంచును. కమీషన్ సలహాలను తిరస్కరించిన ఘట్టములలో, అందుకు తగిన ప్రబలకారణముల గవర్నరు చూపించవలెను.

రెండు మూడు రాష్ట్రములు కలసి, సంయుక్తముగ ఒకే సర్వీసుకమీషను నియమించుకొనవచ్చును. ఉభయరాష్ట్ర శాసనసభలు, అధికసంఖ్యామోదముతో, పార్లమెంటుకు తమ తీర్మానముల తెల్పిన, పార్లమెంటు సంయుక్త పబ్లికుసర్వీసుకమీషన్ నియామకమునకై బిల్లునామోదించును. అప్పుడు సమాఖ్య సర్వీసుకమీషను నియమించినట్లే, అధ్యక్షుడు సంయుక్తకమీషన్ సభ్యుల నియమించగలడు. వారు ప్రతిసంవత్సరాంతమున, ఉభయరాష్ట్ర గవర్నర్లకు, విడివిడిగా నివేదికల నంపగలరు.

రాష్ట్రసర్వీసుకమీషన్‌కు, సమాఖ్య సర్వీసుకమీషన్‌తో సమానమైన అధికారములు లేవు; దాని సలహాలు రాష్ట్రీయోద్యోగస్థుల

వరకే పరిమితమైయుండును. సర్వీసు కమీషన్ అధికారముల, రాష్ట్రీయశాసనముద్వారా హెచ్చించవచ్చును. లేదా ఉద్యోగస్థుల నియామకమునకై ప్రత్యేకనిబంధనల నేర్పరచవచ్చును. రాష్ట్రసివిలు ఉద్యోగస్థుల నియామకము, మార్పులు, ఉన్నతి (Promotions) అభ్యర్థుల అర్హత, ఉద్యోగస్థుల క్రమశిక్షణకు సంబంధించినవిషయములు, ఉద్యోగరీత్యా నష్టపడినవారికి నష్టపరిహారము లేక ఉపకార వేతనము, ప్రభుత్వ నిర్వహణకు సంబంధించినవిషయములలో, ఉద్యోగస్థులపై తేబడిన అభియోగములలో వాదించుటకగు ఖర్చులు, లేక గవర్నరు ప్రత్యేకముగ కోరినవిషయములపై, సర్వీసుకమీషన్ తన సలహాల నివ్వగలదు.

దేశరక్షణకు సంబంధించిన ఉద్యోగస్థుల విషయమై, కమీషన్ సలహా పొందనవసరములేదు. వెనుకబడియున్న తరగతులవారికి, అనుబంధములో చేరిన జాతులవారికి ఉద్యోగముల ప్రత్యేకించుటలో కమీషన్ సలహా అవసరములేదు. కమీషన్ సలహా పొందనవసరములేని యితర విషయములను, శాసనసభలో చర్చించి చట్టము ద్వారా, నిర్ణయించవచ్చును.

## రాష్ట్ర న్యాయపరిపాలనశాఖ (State Judiciary)

ప్రతిరాష్ట్రములో నొక ఉన్నత న్యాయస్థానముండవలెను. రాజ్యాంగచట్టము అమలులోనికి వచ్చుటకుపూర్వము, రాష్ట్రములలో గల హైకోర్టులు, నూతన రాజ్యాంగవిధానము ననుసరించి యేర్పరుపబడిన హైకోర్టులని భావింపబడును. ప్రతి హైకోర్టులో జడ్జీలసంఖ్యను అధ్యక్షుడు నిర్ణయించును. హైకోర్టు ప్రధానన్యాయమూర్తిని, సుప్రీంకోర్టు ప్రధానన్యాయమూర్తి, మరియు రాష్ట్రగవర్నరు సలహా ననుసరించి, అధ్యక్షుడు నియమించును. పైముగ్గురి సలహాతో మిగతా

న్యాయమూర్తులను అధ్యక్షుడే నియమించును. న్యాయనిర్వహణ శాఖలో పది సంవత్సరముల యనుభవముగల జిల్లా జడ్జీలనుండిగాని, ఆ పదిసంవత్సరముల యనుభవముగల అడ్వకేట్లనుండిగాని, హైకోర్టు జడ్జీలు నియమింపబడుదురు. సమయానుకూలముగ, ఉపకార వేతనము పొందుచున్న హైకోర్టుజడ్జీలను, కొన్ని కేసుల విచారించ వలసినదిగా, ప్రధానన్యాయమూర్తి కోరవచ్చును.

హైకోర్టుజడ్జీలను పదవినుండి తొలగించుటకు అధ్యక్షునకే యధికారముగలదు. పార్లమెంటులోని ఉభయశాసనసభలలో, మొత్తము సభ్యులలో అధికసంఖ్యాకులు హాజరయి, అందు 2/3 వంతు సభ్యుల ఆమోదముతో, హైకోర్టుజడ్జీని పదవీచ్యుతుని జేయవలెనని తీర్మానించినయెడల, అట్టిజడ్జీని పదవినుండి తొలగించినట్లు, అధ్యక్షుడు ఆజ్ఞాపించగలడు.

ప్రతి హైకోర్టుకు న్యాయవిచారణలో సంపూర్ణాధికారములు గలవు. హైకోర్టు అధికారమును నిరసించి, ఆజ్ఞలను పాలింపనివారిని, శిక్షించుటకు, దానికే యధికారముగలదు. రాష్ట్ర సరిహద్దులలో (32) సూత్రము మరియు (266) సూత్రములలో సూచించబడ్డ, హేబియస్, కార్పసు మున్నగు, రిట్ ఆజ్ఞలను జారీచేయు నధికారము హైకోర్టులకు గలదు. ఇతర రాష్ట్రములందు నివసించు వారిపైగూడ, పైరిట్ ఆజ్ఞల జారీచేయవచ్చును. హైకోర్టు అధికారపుహద్దుల నిర్ణయించు నధికారము పార్లమెంటుకు మాత్రమే కలదు.

రాష్ట్ర సరిహద్దులలోనున్న ఇతర కోర్టువ్యవహారములు పర్యవేక్షణ చేయునధికారము హైకోర్టుకుగలదు. క్రింది కోర్టులు నడుచుకొనవలసిన క్రమవిధానమును, వసూలుచేయు ఫీసు, తత్సంబంధమైన లెక్కలనుంచు పద్ధతి, పరిష్కరింపబడిన కేసుల వివరములు హైకోర్టుకు తెల్పుట, మున్నగుచర్యలను, హైకోర్టు నిర్ణయించి, పర్యవేక్షణ చేయుచుండును. పైనిర్ణయము లన్నింటికి గవర్నరు ఆమోదముపొంద

వలసి యుండును. సైనికదళములకు సంబంధించిన కోర్టులపై, హైకో ర్టున కెట్టియధికారములు లేవు.

ఆయా రాష్ట్రములలో జిల్లా జడ్జీలను, గవర్నరు, ఆరాష్ట్ర హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి సలహాననుసరించి నియమిం చును. కనీసము ఏడుసంవత్సరముల కాలము, ప్రాక్టీసు చేయు చున్న అడ్వకేటులను గూడ, హైకోర్టువారి ప్రతిపాదనపై, జిల్లాజడ్జి లుగా నియమించవచ్చును. మున్సిఫులను, మేజస్ట్రేట్లను తదితర ఉద్యో గసులను, పబ్లికు సర్వీసుకమీషన్, మరియు హైకోర్టు సలహాల ననుస రించి, గవర్నరు నియమించును. ప్రభుత్వముచే ఏర్పరుపబడిన సర్వీసు నిబంధనల ననుసరించి, క్రింది ఉద్యోగుల, మార్పు, నియామకము, ఉన్నతులను హైకోర్టు పాలించుచుండును. పైనిబంధనలు, మేజస్ట్రే ట్లకు గూడ వర్తించును.

## సి. వర్గములోని రాష్ట్రములు

(1) అజ్మీరు (2) భూపాలు (3) బిలాసపూరు (4) కూర్గు (5) ఢిల్లీ (6) హిమాచలప్రదేశము (7) కచ్ (8) మణిపురము (9) త్రిపుర (10) వింధ్యప్రదేశము. కూచ్‌బీహారు పశ్చిమబెంగాలులో కలిపి వేయబడినది. ఇవి పది సి. వర్గములోని రాష్ట్రములు. ఛీఫ్‌కమీ షనర్, లేక లెఫ్టనెంటు గవర్నరుద్వారా, యీరాష్ట్రములను అధ్య క్షుడు, నేరుగాపాలించును. పార్లమెంటు యీరాష్ట్రములకు ఉచిత మనితోచిన శాసనసభను నిర్మించి, ప్రభుత్వ సలహాదారులు లేక మంత్రిమండలిని నియమించవచ్చును. శాసనసభ్యులను పార్లమెంటు నియమించవచ్చును. లేదా కొందరిని నియమించి, ఇతరుల యెన్నికకై యేర్పాట్లు చేయవచ్చును. అధ్యక్షుడు కొన్నిరాష్ట్రముల పరిపాల నను, దగ్గరలోనున్న ఎ లేక బి వర్గ రాష్ట్రప్రభుత్వమునకు అప్పగించ

వచ్చును. అప్పగించుటకుముందు, ఆరాష్ట్రప్రజల యభిప్రాయమును తెలుసుకొనుట అవసరము. పార్లమెంటు యీ వర్గములోని రాష్ట్రములకు ప్రత్యేక హైకోర్టుల నియమింపవచ్చును లేదా యిదివరకే అమలులోనున్న హైకోర్టును నూతన రాజ్యాంగము ప్రకారము అంగీకరించవచ్చును. ప్రజలలో రాజకీయ చైతన్యము హెచ్చినకొద్దీ, యీ రాష్ట్రములలో సంపూర్ణ ప్రజాప్రాతినిధ్యముతో గూడుకొనిన బాధ్యతాయుత ప్రభుత్వము నెలకొల్పబడును.

## డి. వర్గములోని ప్రదేశము

అండమాన్ నికోబారుదీవులు డి వర్గములో చేర్చబడినవి. ఇది ఒక రాష్ట్రముగాక ప్రదేశముగానే నిర్దేశింపబడినది. అధ్యక్షుడు, ఛీఫ్‌కమీషనర్ ద్వారా, యీ ప్రదేశమును పరిపాలించును. దేశములో శాంతిసౌభాగ్యముల నెలకొల్పుటకు, అధ్యక్షుడే, శాసనములను, నిబంధనలను యేర్పరచగలడు. పార్లమెంటరీచట్టములు, అధ్యక్షుడు అనుమతించినవరకే, ఇచ్చట అమలులో నుండగలవు, క్రమేణ యీ ప్రదేశమును డి వర్గ రాష్ట్రములోవలె పాలించుటకు యేర్పాట్లు జరుగగలవు.

## కేంద్రమునకు రాష్ట్రములపైగల ప్రత్యేకాధికారములు

రాష్ట్రముల శాసనాధికారములు, ఏడవఅనుబంధము రెండవ పట్టికలో నుదహరింపబడినవి. ప్రత్యేక కారణములజూపించి, పార్లమెంటు, రాష్ట్రవిషయములపై శాసనముల ఆమోదించవచ్చును. కౌన్సిలుఆఫ్‌స్టేటు అనగా కేంద్రశాసనసమితిలో 2/3 వంతుల అంగీ

కారముతో, కొన్ని రాష్ట్రవిషయములపై పార్లమెంటులోనే శాసనముల ప్రతిపాదింపవలెనని, తీర్మానించిన పార్లమెంటుకు శాసనాధికారము లభింపగలదు. ఇట్టిఅధికారము సంవత్సరకాలమునూత్రమే యుండగలదుగాని సమితి, యీ గడువును ప్రతిసంవత్సరము పొడిగించవచ్చును. గడువుకాలములో గావింపబడిన చట్టములు, గడువు ముగిసిన తరువాత ఆరునెలలవరకు అమలులోనుండగలవు.

ఏదేని రాష్ట్రములో అసాధారణపరిస్థితి యేర్పడినదని, అధ్యక్షుడు ప్రకటించినయెడల, ఆ రాష్ట్రములో శాసనసభ రద్దుఅయి, శాసనాధికారములు, పార్లమెంటుకు సంక్రమించగలవు. అసాధారణపరిస్థితి అంతమొందిన, ఆరునెలల తరువాతవరకు, ఈమధ్యకాలములో గావింపబడిన శాసనములు, అమలులోనుండగలవు.

రాష్ట్ర శాసనసభ స్వేచ్ఛందతీర్మానము ద్వారా తనశాసనాధికారమును, తాత్కాలికముగ, పార్లమెంటు కప్పగించవచ్చును. పార్లమెంటు ఆమోదించిన శాసనము రాష్ట్రములో అమలు జరుగును. ఇట్టిశాసనమునకు వ్యతిరేకముగ; తిరిగి, రాష్ట్ర శాసనసభలో తీర్మానించుటకు వీలులేదు. ఇట్టిశాసనమును రద్దుచేయను సవరించను, కేంద్ర పార్లమెంటుకే అధికారముగలదు.

ఏడవ అనుబంధములోగల విషయసూచిక సమగ్రముగ లేదు. అందుదహరింపబడిన విషయములపై, శాసన నిర్మాణాధికారము కేంద్రపార్లమెంటునకేగలదు. అంతర్జాతీయఒడంబడికలు, సహకారము లేక ఒప్పందముల, కార్యరూపమునబెట్టుటకై, రాష్ట్ర శాసనసభలతో నిమిత్తములేక కేంద్ర పార్లమెంటునకే సర్వాధికారములుగలవు. కేంద్రశాసనముల రాష్ట్రములలో అమలుపరుచునిమిత్తము కేంద్ర మంత్రివర్గము, రాష్ట్రప్రభుత్వములకు ఆజ్ఞల నీయవచ్చును. కేంద్ర ప్రభుత్వాధికారులు, నిరాఘాటముగ రాష్ట్రములలో ప్రవేశించి, తమ యధికార వినియోగము చేయవచ్చును. రాష్ట్రప్రభుత్వములు,

కేంద్రోద్యోగులతో సహకరించుచు, వారి కెట్టి ఆటంకము గలుగకుండు నటుల చూడవలెను. రహదారులు, రైల్వేలరక్షణకై తగుచర్యల తీసు కొనవలసినదిగా, రాష్ట్రప్రభుత్వములను కేంద్రము శాసింపవచ్చును. సైనికప్రాముఖ్యత, జాతీయప్రాముఖ్యతగల, తంతి, తపాలా, రవాణా రోడ్లు, రైల్వే సౌకర్యములను తమ స్వంతవ్యయములో నిర్మించి, కాపాడుచుండవలసినదని, రాష్ట్రప్రభుత్వముల నాజ్ఞాపింపవచ్చును.

రాష్ట్రప్రభుత్వ సమ్మతితో, కొన్ని కేంద్ర ప్రభుత్వాధికారము లను, అధ్యక్షుడు, రాష్ట్రప్రభుత్వముల కప్పజెప్పవచ్చును. ఇట్టి అధి కార నిర్వహణములో, రాష్ట్రప్రభుత్వమున కగు, వ్యయములను, కేంద్రప్రభుత్వము భరించగలదు. తెలంగాణములో శాంతి భద్రతల, కాపాడు నిమిత్తమగు, అధికవ్యయములో, కొంతభాగము, కేంద్ర ప్రభుత్వమిట్లే భరించుచున్నది.

కేంద్రశాసనములకు సంబంధించిన విచారణలనుచేయు న్యాయ స్థానముల సంఖ్యను, కొన్ని రాష్ట్రములలో హెచ్చించుటకు, పార్ల మెంటున కధికారముగలదు. బి వర్గ రాష్ట్రములో, మంత్రుల నియామ కము, కీలక స్థానములలో, ఉన్నత ప్రభుత్వోద్యోగుల నియామకము కేంద్ర ప్రభుత్వాంగీకారముతో జరుగవలెను. ఈ విధముగ బి వర్గ రాష్ట్రములు, ఎ వర్గ రాష్ట్రములకన్న, తక్కువస్థాయిలో నుంచబడినవి.



## ౧౭

# రాజ్యాంగచట్టము — సవరణలు

(1) మన రాజ్యాంగ చట్టములోని 15 వ సూత్రమునకు ఇప్పుడున్న మూడు క్లాజులుగాక మరొక నాల్గవక్లాజు చేర్చబడినది మద్రాసు రాష్ట్రములో చిరకాలమునుండి అమలులోనున్న కమ్యూనలు జి. వో. (కులప్రాతినిధ్యచట్టము) చెల్లనిదనుచు, మద్రాసు హైకోర్టు, మరియు సుప్రీంకోర్టులు తీర్పు చెప్పినందున కొన్ని వెనుకబడియున్న తరగతులకు ప్రత్యేక సౌకర్యము కల్పించుటకై, యీ క్లాజు చేర్చబడినది. క్లాజుపాఠము యీ క్రిందివిధముగ గలదు.

ఈ సూత్రములోని ఏ అంశముగాని, 29 సూత్రము, రెండవ క్లాజులోని ఏ అంశముగాని, అనుబంధములో చేర్చబడిన కులములకు లేక జాతులకు లేక సాంఘికముగా, విజ్ఞానికముగా, వెనుకబడియున్న తరగతులకు చెందిన పౌరుల అభివృద్ధికి మరియు వారికి కల్పించబడు ప్రత్యేక సౌకర్యములకు, ఆటంకముగా నుండజాలదు.

(2) 19 సూత్రములోని, రెండవ క్లాజునకు బదులుగా, యీ క్రింది విధముగ క్రొత్త క్లాజునుచేర్చిరి. దేశములో శాంతి భద్రతల నెలకొల్పుట, విదేశములతో స్నేహభావము పెంపొందజేయుట, న్యాయస్థాన ధిక్కారము, నిందారోపణ మొదలగు నేరముల నరికట్టుటకై యేర్పడిన శాసనముల, రక్షణకొరకు, ప్రభుత్వము అవసరమని తలంచినచో, మొదటిక్లాజు ప్రథమభాగమునకు [illegible]

హక్కులను, సంకుచితపరుచు, శాసనముల నిర్మించి, అమలుపరచుటకు, ప్రభుత్వమున కధికారము ఉండగలదు.

ఇదేసూత్రములో (6) క్లాజులోచివర సగభాగమునకు బదులుగా, యీక్రిందివిధముగ అర్థమునిచ్చు క్రొత్త వాక్యములు చేర్చబడినవి.

ఏదైన వృత్తి నభ్యసించుటకు, ఉద్యోగము, వర్తకము, వ్యాపారముసాగించుటకు, మరియు పైవాని కవసరమగు వృత్తి విషయక, సాంకేతిక అర్హతలు సంపాదించుటకు భారతీయులు కానివారిచే రాష్ట్రములో సాగించబడు వర్తక, వ్యాపార, పరిశ్రమలకు, సానుకూలము కల్పించువిధముగా శాసననిర్మాణము చేయుచో, యీ క్లాజులోని ప్రథమభాగము ప్రతిబంధకముగా నుండజాలదు. రాజ్యాంగ ప్రారంభమునకు సన్నిహితపూర్వమందు, భారతదేశమందు అమలులో నున్న ఎట్టిశాసనము, యీ సూత్రమునకు, తేబడిన సవరణల మరియు మార్పులననుసరించి, క్రొత్తగా యర్థము చెప్పునప్పుడు, అప్రామాణికము లేక (Ultra vires) నిరర్థకమైనట్లు భావింపరాదు. అనగా ప్రాథమికహక్కులను సంకుచితపరచుచు, చేసిన శాసనము నిబంధనలు, సహేతుకములా కాదా యను విచారణలో న్యాయస్థానములకు పని లేదు. రెండవక్లాజు, ఆరవక్లాజులో, క్రొత్తగాచేర్చబడిన విషయములను అతిక్రమించి, శాసనముగావింపబడినచో, న్యాయస్థానములు విచారించి, శాసనముల ప్రామాణికత్వమును నిర్ణయించవచ్చును.

(3) 31. వ సూత్రమునకు 31-A 31-B అని రెండు క్రొత్త సవరణలు చేర్చబడినవి. వివిధరాష్ట్రములలో, చేయబడిన జమీందారీ యెస్టేటు రద్దుశాసనములు, అప్రామాణికములు లేకుండుటకై, ఈసవరణలు ఆమోదింపబడినవి. ఈవిధముగ, ముందు చేయబోవు శాసనములుకూడ అప్రామాణికములు కాజాలవు.

రాష్ట్రశాసనసభలచే ఆమోదింపబడిన, భూస్వాధీన సంబంధక శాసనములు, భారతాధ్యక్షుని ఆమోదముతో, అమలుపెట్టబడును. అధ్యక్షుని ఆమోదము పొందినతరువాత అట్టిశాసనము, 31 సూత్రమునకు, వ్యతిరేకముగానున్నదనిగాని తద్వారా సంక్రమించినహక్కులను సంకుచిత పరుచుచున్నదనిగాని, అప్రామాణికము, నిరర్థకమని నిర్ణయించుట కెట్టి న్యాయస్థానమునకు, అధికారముండజాలదు. అధ్యక్షుని ఆమోదము న్యాయవిచారణ కతీతముగావున అతనిచే ఆమోదింపబడిన శాసనమును, వితర్కించుటకు న్యాయస్థానముల కధికారములేదు.

(4) 85 వ సూత్రము ప్రకారము, అధ్యక్షుడు పార్లమెంటును సంవత్సరమునకు రెండుమార్లు సమావేశ పరచవలసియుండెను. రెండు సమావేశములకు మధ్య, ఆరు నెలలకు మించిన వ్యవధియుండరాదు, ఇప్పుడీ సూత్రము పూర్తిగా రద్దుచేయబడి, క్రొత్తసూత్రము చేర్పబడినది. తత్ఫలితముగా అధ్యక్షుడు పార్లమెంటును, సంవత్సరమునకొకసారి మాత్రమేగాని, రెండుసార్లకంటె యెక్కువగా గాని సమావేశ పరచవచ్చును. రెండుసమావేశములకు మధ్య ఆరునెలలను మించినవ్యవధి యుండరాదన్న నిషేధము తొలగించబడినది. అధ్యక్షునకు సందర్భానుసారముగ, ఏ సభనుగాని దీర్ఘవాయిదా వేయుటకు, మరియు కేంద్రశాసనసభ (ప్రజాసభ)ను రద్దుచేయుటకు అధికారము, క్రొత్తగా యీయబడినది. సందర్భనిర్ణయము చేయువారు భారత ప్రధాని, భారతాధ్యక్షుడు మాత్రమే.

(5) 87వ సూత్రములో కొన్ని మార్పులు చేయబడినవి. పార్లమెంటుయొక్క ప్రతిసమావేశమునకు, అధ్యక్షుడు సందేశము నంపుట మరియు యితర విషయములకంటె ముందు, సందేశ విషయముల చర్చించుట యిప్పటి ఆచారము. ఇకముందు, అధ్యక్షుడు ప్రతిసంవత్సరము ఒకసారిమాత్రమే ప్రథమ సమావేశమునకు సందేశము నిచ్చును. సందేశమును ప్రప్రథమమున చర్చించవలసిన బాధ్యత తొలగింపబడినది.

పరిషత్సభను, ప్రతిసాధారణ ఎన్నికల తరువాత మొదటి సమావేశమునకు సందేశమంపబడును.

(6) 85 వ సూత్రములో అధ్యక్షునకీయబడిన యధికారముతో 174 వ ప్రాతసూత్రము రద్దుచేసి, క్రొత్త సూత్రముద్వారా గవర్నర్లకు రాజప్రముఖుల కీయబడినవి.

(7) ఆదేవిధముగ 176 సూత్రము సవరింపబడి, 87 వ క్రొత్త సూత్రమువలె, మార్పులు చేయబడినవి. 87 సూత్రముద్వారా అధ్యక్షునికి సందేశమంపు యధికారములు రాష్ట్రములలో గవర్నర్లకు, మరియు రాజ ప్రముఖుల కొసగబడినవి.

భారతరాజ్యాంగమును సవరించువిధానము 368వ సూత్రములో చెప్పబడినది. భారత రాజ్యాంగమును సవరించు అధికారముగాని, హక్కుగాని, యీ సూత్రముద్వారా యీయబడలేదు. సవరణల సూచించుటకు, ఆంగ్లభాషలో మూడు, ప్రత్యేక విభిన్నపదములు గలవు. (1) సవరణ Amendment (2) పునర్విమర్శ Revision (3) ఉపసంహారణ-సవరణ Repeal అనగా, భావమునకు పదమునకు మెఱుగులుదిద్దుట. అర్థము స్పష్టముగా లేనిచో స్పష్టపఱుచుట. వాక్యములను తీసివేసి క్రొత్త వాక్యములను చేర్చుట. (2) ఒక పదమును తీసివేసి, వేరుఅర్థము, వేరుభావమునిచ్చు పదమునుగాని, పదసముదాయమును చేర్చుటను Revision పునర్విమర్శ అందురు. (3) ఉన్న సూత్రమును పూర్తిగా తీసివేయుటను ఉపసంహారణ అందురు. క్రొత్తసూత్రమునుచేర్చుట రాజ్యాంగనిర్మాణమనియే చెప్పవలెను. ప్రస్తుత రాజ్యాంగసవరణలు, పునర్విమర్శ మరియు ఉపసంహారణకు మాత్రమే సంబంధించినవి; అనగా ఉన్న సూత్రములరద్దు, తొలగు, మార్పుకు ముఖ్యముగా సంబంధించినవి. ఈ సవరణలవలన రాజ్యాంగ విధానముయొక్క స్వరూపములో మార్పువచ్చినదని గమనింపవలెను.

రాజ్యాంగమును సవరించు అధికారము, హక్కు 368 వ సూత్రముద్వారా గాక 12, 13, సూత్రములద్వారా లభించుచున్నది, 368 వ సూత్రములోని విధానము (Procedure) 12, 13, సూత్రములలోని యధికారములకు లోబడియుండవలెను; గాని, అతిక్రమము కాజాలదు. 13 వ సూత్రము. 2 క్లాజుద్వారా కూడదన్న పనులు 368 సూత్రము ననుసరించి కూడ చేయుటకు వీలులేదు.

368 వ సూత్రము ననుసరించి చేయుసవరణలు, పార్లమెంటులోని ఉభయశాసన సభలచే ఆమోదింపబడవలెను ప్రస్తుతము కేంద్ర శాసనసమితి, (Council of State) అస్తిత్వములో లేదు. ప్రస్తుత పార్లమెంటు, అసమగ్రమైనది. సాధారణ ఎన్నికలు జరిగి, ఉభయ శాసన సభలు యేర్పడి, పార్లమెంటు సమగ్రరూపమును ధరించిన తరువాతనే 369 సూత్రము ననుసరించి, పార్లమెంటు, సవరణల ఆమోదింపగలదు. అంతవరకు యీచేయబడిన సవరణలు అప్రామాణికములని, రాజ్యాంగ కర్తల అభిప్రాయమై యున్నది. వివాదగ్రస్తమైన విషయము గావున, తుదినిర్ణయము; భారతసుప్రీంకోర్టుకు వదలి వేయుట మంచిది.

ప్రజాప్రతినిధులకు అధికారము, ప్రజలనుండి సంక్రమించినది. ప్రజల యధికారము, ప్రజాప్రతినిధుల యధికారముకంటె గొప్పది. ప్రజాప్రతినిధులు, తమఅధినేతలగు, ప్రజలయధికారమును సంకుచిత పరుపజాలరు. కావలసినచో, దానిని విస్తృతము జేయవచ్చును. ప్రజాధికారములు, రాజ్యాంగచట్టము, మూడవభాగములో చేర్పబడినవి. ప్రజాప్రతినిధుల యధికార వినియోగవిధానము 368 సూత్రములో నున్నది, 13 సూత్రము 2 క్లాజుద్వారా, ప్రజాధికారముల సంకుచిత పరుచుట నిషేధింపబడిన తరువాత, అట్టినిషేధమునకు వ్యతిరేకముగ 368 సూత్రము నూతగాగొని, చేయు శాసన నిర్మాణము, అధికార అతిక్రమణ మగును, కావున చెల్లనేరదు. ఇంగ్లాండులో. Magna-Carte; Bill of Rights, అను ప్రజాధికారముల నిర్వచించు శాసన

నములకు వ్యతిరేకముగ, శాసననిర్మాణము చేయు నధికారము, ఇంగ్లీషు పార్లమెంటుకు లేదు.

భారత రాజ్యాంగ విధానము, చాలవరకు, ఇంగ్లీషు రాజ్యాంగ విధానమున కనుకరణ మేగావున, ఇంగ్లీషు పార్లమెంటుకు లేని యధికారము, భారత పార్లమెంటుకు గలదని, చెప్పజాలము. అమెరికాలో, రాజ్యాంగ చట్టనిర్మాణము జరిగిన కొలదినెలలకే సవరణలు ఆమోదింపబడినవి. కాని ఆసవరణలు, ప్రజాధికారముల నిర్వచించి, విస్తృతి మొనర్చునవి-మనసవరణలవలె ప్రజాధికారములను సంకుచిత పరచునవి కావు కావున, అమెరికా యుదాహరణ మసంగతము.

A. K. గోపాలన్ పెట్టుకొనిన హేబియస్ కార్పస్ పెటిషన్‌పై, సుప్రీంకోర్టు చెప్పిన విడుదలతీర్పులో, ప్రజాధికారములు సమగ్రముగ చర్చించబడినవి. ఒక పర్యాయము విడుదలకాగ, వెంటనే శాంతిరక్షణదృష్ట్యా, మద్రాసు ప్రభుత్వము అతనిని అరెస్టుచేయగా, తిరిగి మద్రాసు హైకోర్టు, ప్రభుత్వచర్య అక్రమమని, తీర్మానించి, రెండవమారు విడుదలతీర్పు చెప్పెను. ఇదేవిధముగ బొంబాయి, పాట్నా హైకోర్టులు లిచ్చిన తీర్పులవలన, వివిధ ప్రభుత్వముల హోంశాఖలకు తలనొప్పి కలిగినది. ఏది యెట్లున్నను దేశములో, శాంతిభద్రతల కాపాడవలసిన బాధ్యత హోంశాఖపై కలదుగావున, కేంద్ర మంత్రివర్గ హోంశాఖామాత్యుడు, దేశరక్షణ దృష్ట్యా తనకు విస్తృతాధికారములు కావలెనని కోరియుండెను. అదేవిధముగ మద్రాసు హైకోర్టు, సుప్రీంకోర్టులు, మద్రాసు రాష్ట్రములోనున్న కమ్యూనల్ జి. వో., చట్టవిరుద్ధమని తీర్పుచెప్పినందున, మద్రాసు రాష్ట్రములోగల కొన్ని వెనుకబడియున్న తరగతులవారికి ప్రత్యేక సౌకర్యముల కల్పించుట, తప్పనిసరి, అయినందున, తదనుగుణముగ, 15 వ సూత్రములో క్రొత్త క్లాజును చేర్చవలయునని, మద్రాసు ప్రభుత్వము కోరియుండెను.

ఈ విధముగ పలువిధములగు ఒత్తిడులకు తాళజాలక, ప్రధాని నెహ్రూ, రాజ్యాంగ సవరణలబిల్లును ప్రతిపాదించి, పార్లమెంటుచే ఆమోదింపజేసెను. ఈ సవరణల సత్య స్వరూపము ఆచరణలో తెలియగలదు.

# మొదటి అనుబంధము.

## ఏ. వర్గరాష్ట్రములు

1. అస్సాం 2. బీహారు 3. బొంబాయి 4. మధ్యప్రదేశ్ 5. మద్రాసు 6. ఒరిస్సా 7. పంజాబు 8. ఉత్తరప్రదేశ్ 9. పశ్చిమ బెంగాలు.

## (2) బి. వర్గరాష్ట్రములు

1. హైదాబాదు 2. జమ్ము – కాశ్మీరు 3. మధ్యభారత్ 4. మైసూరు 5. పటియాలా, తూర్పుపంజాబుస్టేట్సు యూనియన్ (పెప్సు) 6. రాజస్థాన్ 7. సౌరాష్ట్ర 8. తిరువాన్కూరు - కొచ్చిను 9. వింధ్యప్రదేశ్

## (3) సి. వర్గరాష్ట్రములు

1. అజ్మీరు 2. భూపాలు 3. బిలాసపూర్ 4. కూచ్ బిహారు 5. కూర్గు 6. ఢిల్లీ 7. హిమాచలప్రదేశ్ 8. మణిపుర 9. త్రిపుర 10. కచ్

## (4) డి. వర్గ ప్రాంతములు

1. అండమాన్, నికోబారు, దీవులు

కూచ్–బిహారు అస్సాంరాష్ట్రములో చేర్చబడి, మధ్యప్రదేశ్ బి. వర్గమునుండి సి. వర్గమునకు మార్చబడినది.

# అయిదవ అనుబంధము

కౌన్సిలు ఆఫ్ స్టేటు - కేంద్ర శాసనసమితిలో వివిధ రాష్ట్రములకు కేటాయించబడిన స్థానములు.

| వర్గము | రాష్ట్రము | స్థానములు |
|---|---|---|
| A. | 1. అస్సాం | 6 |
| | 2. బీహారు | 21 |
| | 3. బొంబాయి | 17 |
| | 4. మధ్యప్రదేశ్ | 12 |
| | 5. మద్రాసు | 27 |
| | 6. ఒరిస్సా | 9 |
| | 7. పంజాబు | 8 |
| | 8. ఉత్తరప్రదేశ్ | 31 |
| | 9. పశ్చిమబెంగాల్ | 14 |
| A. వర్గ రాష్ట్రముల మొత్తము | | 145 |
| B. | 1. హైదరాబాదు | 11 |
| | 2. జమ్ము - కాశ్మీరు | 4 |
| | 3. మధ్యభారత్ | 6 |
| | 4. మైసూరు | 6 |
| | 5. పెప్సు | 3 |
| | 6. రాజస్థాన్ | 9 |
| | 7. సౌరాష్ట్ర | 4 |
| | 8. తిరువాన్కూరు - కొచ్చిను | 6 |
| | 9.. వింధ్యప్రదేశ్ | 4 |
| B. వర్గ రాష్ట్రముల మొత్తము | | 53 |
| C. | 1. అజ్మీరు<br>2. కూర్గు | 1 |
| | 3. భూపాలు | 1 |

| | |
|---|---|
| 4. బిలాసపూర్ | 1 |
| 5. హిమాచలప్రదేశ్ | |
| 6. కూచ్ బిహారు | 1 |
| 7. ఢిల్లీ | 1 |
| 8. కచ్ | 1 |
| 9. మణిపూర | 1 |
| 10. త్రిపుర | |
| | 7 |

మొత్తం 205. ఇందులో కూచ్ బిహారు, వింధ్యప్రదేశ్ స్థానములు తగ్గించబడును,

# ఆరవ అనుబంధము

## 1. యూనియన్ పట్టిక

(కేంద్రప్రభుత్వ అధికారులపట్టిక)

1. హిందూదేశము అందలి విభాగములరక్షణ; రక్షణకొరకై సంసిద్ధత. యుద్ధావసర సన్నాహకార్యములు. యుద్ధానంతరము సైన్యముల రద్దు. ఏతత్ సంబంధమగుపనులు.
2. నౌకా, సైనిక, వైమానిక దళములు. తదితర యూనియన్ సైన్యములు.
3. కంటోన్మెంట్ల స్థల నిర్ణయాధికారము. ఆ యా స్థలములలో స్థానిక స్వపరిపాలన. గృహనిర్మాణముపై నిర్బంధములు; అద్దెల కంట్రోలు. కంటోన్మెంటు అధికారులనియామకము, వారి అధికారములు.
4. నౌకా, సైనిక, వైమానికదళ సంబంధమైన నిర్మాణములు.
5. ఆయుధములు, రైఫిల్సు మొదలగునవి, మందుగుండు సామా

నులు, పేలుడు వస్తువులు.

6. పరమాణుశక్తి, దాని ఉత్పత్తి కవసరమగు ఖనిజ సంపద.

7. పార్లమెంటు చట్టరీత్యా నిర్ణయించిన దేశరక్షణ, యుద్ధావసర పరిశ్రమలు.

8. కేంద్ర అపరాధ పరిశోధనాలయము.

9. ఇండియా, భద్రత, రక్షణ, విదేశ వ్యవహార విషయములలో నేరారోపణ జేయక వ్యక్తుల నిర్బంధించుట (దోషరహిత నిర్బంధన). నిర్బంధింపబడిన వ్యక్తులు.

10. విదేశ వ్యవహారములు, ఇతర దేశములతో ఇండియాకు సంబంధము కల్పించు విషయములు.

11. రాయబారులు, రాజకీయ, వర్తక ప్రతినిధులు.

12. అంతర్జాతీయ మహాసభ (యు. ఎన్. ఓ)

13. అంతర్జాతీయ సంస్థలు, సభలు, సమావేశములలో పాల్గొనుట- అట్టి సభలలో చేయబడిన తీర్మానముల నములు జరుపుట.

14. విదేశములతో సంధులు, ఒడంబడికలు చేయుట. అట్టి సంధులు, ఒడంబడికలు, అంతర్జాతీయాచారముల నములు పరుచుట.

15. యుద్ధము-సంధి.

16. వైదేశిక పాలనాధికారము.

17. పౌరసత్వము-పౌరసత్వ సంపాదన. విదేశీయులు.

18. అపరాధుల పట్టియిచ్చుట.

19. ఇండియాలోనికి వచ్చుట, ఇండియానుండి వలసపోవుట. దేశ బహిష్కరణ. విదేశ యాత్రలకు అనుమతులు. రాష్ట్రములో పర్యటనకు అనుమతులు (వీసాలు)

20. మతసంబంధమైన విదేశ యాత్రలు.

21. సముద్రముపై లేక గాలిలో జరుగు దోపిడీలు, యితర నేరములు. భూమి, సముద్రము, వాయువు, ఆకాశములందు జరుగు అంతర్జాతీయ న్యాయ విరుద్ధములగు నేరములు.

22. రైల్వేలు.

23. పార్లమెంటుచే నిర్ణయింపబడిన యితర రాజమార్గములు.
24. పార్లమెంటుచే రాజమార్గములని నిర్ణయింపబడిన జలమార్గములపై యంత్రసహాయముతో నడుపబడు నౌకలు, యానము, తత్సంబంధమైన నిబంధనలు.
25. పోటుపాట్లకు గురియగు జలభాగములు, మరియు సముద్రములపై యానముచేయు నౌకలు, నౌకాయానము. వ్యాపార నౌకా దళమునకై నేర్పబడు విద్య, శిక్షణ; రాష్ట్రములు, తదితర సంస్థలు నేర్పు విద్యాశిక్షణకొరకు నిబంధనలు.
26. దీపపుఓడలు, దీపస్తంభములు, విమానములు, నౌకలరక్షణకై వెలిగించబడు దీపములు, తదితర ఉపాయనములు.
27. పార్లమెంటుచే నిర్ణయింపబడిన పెద్ద నౌకాశ్రయములు. వాని సరిహద్దుల నిర్ణయము. నౌకాశ్రయాధికారుల నియామకము, వారి అధికారనిర్ణయము.
28. నౌకాశ్రయములో నిర్బంధ వైద్యపరీక్ష. అట్టి వైద్యశాలలు, నౌకలలో వైద్యశాలలు, నావికుల వైద్యశాలలు.
29. వాయుమార్గములు. విమానములు. విమానయానము, విమానాశ్రయ నిర్మాణము. పై వాటి నిర్వహణ, నిబంధనలు. వైమానిక విద్యాశిక్షణల ఏర్పాట్లు, రాష్ట్రములు, తదితర సంస్థలచే చేయబడు ఏర్పాట్ల పర్యవేక్షణ.
30. జాతీయజలమార్గములపై యంత్రసహాయక నౌకలలో, రైలు, స్టీమరు. విమానములలో మనుష్యులను, వస్తువులను గొనిపోవుట.
31. తంతి, తపాలా, టెలిఫోన్, వైర్‌లెస్, రేడియోలద్వారా వార్తాప్రసారము.
32. సమాఖ్య ఆస్తి, ఆదాయము, A. B. వర్గరాష్ట్రములలోనున్న ఆస్తిపై, అచ్చటి చట్టములు, వాటికి పార్లమెంటు సవరణలకులోబడి వచ్చుఆదాయము.
33. సమాఖ్య అవసరములకై, ఆస్తుల స్వాధీనపరుచుకొనుట, లేక

నిర్బంధముగ ఉపయోగించుకొనుట.

34. సంస్థానాధి పతులలో మైనర్ల ఆస్తుల సంరక్షణ

35. సమాఖ్యచే ప్రజనుండి గైకొనబడిన అప్పు.

36. చెలామణి నాణెములు. వాటి తయారు. విదేశీయ మారకము.

37. విదేశములలో అప్పులు.

38. ఇండియా రిజర్వుబాంకు

39. తపాలా సేవింగ్సు బ్యాంకు

40. భారత ప్రభుత్వము, లేక రాష్ట్రప్రభుత్వములచే యేర్పాటు చేయబడిన లాటరీలు

41. విదేశములలో వర్తక వ్యాపారములు. సుంకపు సరిహద్దులదాటి, యెగుమతులు, దిగుమతులు. సుంకపు సరిహద్దుల నిర్ణయము.

42. వివిధ రాష్ట్రములమధ్య వర్తక వ్యాపారములు

43. సహకారసంఘములు మినహా, ఇతరవర్తకసంస్థలు, బాంకులు, భీమాకంపెనీలు, పెట్టుబడి సంఘములు—వీటి నిర్మాణము, పర్యవేక్షణ, ఉపసంహారము.

44. పెక్కు రాష్ట్రములతో సంబంధముగల, వర్తక లేక యితర సంస్థలనిర్మాణము; పర్యవేక్షణ; ఉపసంహారము. విశ్వ విద్యాలయము లిందులో చేరవు.

45. బాంకు వ్యవహారములు.

46. బిల్సుఆఫ్ ఎక్స్ఛేంజి (హుండీలు) చెక్కులు, ప్రామిసరి నోట్లు, తదితర పత్రములు.

47. భీమా.

48. స్టాకు ఎక్స్ఛేంజిలు, ఫ్యూచరు మార్కెట్లు.

49. పేటెంట్లు, వైజ్ఞానికసృష్టి, డిజైన్లు, కాపీరైట్లు, ట్రేడు మార్కులు, వాణిజ్య వస్తువుల ప్రత్యేక మార్కులు.

50. కొలత, తూనికల, మాన నిర్ణయము.

51. ఒకరాష్ట్రమునుండి మరియొక రాష్ట్రమునకు, లేక విదేశములకు ఎగుమతియగు సరకుల నాణ్యపరిశీలన.

ా క్షేమము కొరకు; సమూాఖ్యా పర్య వేక్షణలో నుండవలసిన శములు.

ంనెగనులు, నూనె ఖనిజముల, అభివృద్ధి. పర్య వేక్షణ. ్ లు, పెట్రోలియంనుంచి తీయబడు వస్తువులు. శీఘ్ర క నిప్పంటుకొను ఇతర ద్రవపదార్థములు, వస్తువులు.

ంనియన్ ఆధిపత్యమున జరుగుట ప్రజాహితార్థమని పార్ల ంటు నిర్దేశించిన గనుల, ఖనిజ సంపదయొక్క అభివృద్ధి, ్వేక్షణ.

నెగనులు, తదితర గనుల భద్రత, పనివారలకు సమపాయ లు.

ంహితార్థము, యూనియన్ ఆధిపత్యమవసరమని పార్ల ంటుచే నిర్దేశింపబడిన, నదులు, నదీతీరముల పర్యవేక్షణ, వృద్ధి.

్జలముల (Territorial waters) దాటి, చేపలబట్టుట. టి నభివృద్ధిపఱుచుట.

ాఖ్యనుంచి అనుమతి పొందినవారు, మరియు, తదితరులచే ్ తయారు, సరఫరా, పంపకముపై పర్య వేక్షణ, వాటి ంధనలు.

మందు తయారు, దానిపంట, ఎగుమతి, అమ్మకము.

ర్శనార్థము, సినిమాఫిల్ముల ననుమతించుట.

ాఖ్యఉద్యోగస్థులకు సంబంధించిన పారిశ్రామిక తగాదాలు.

రాజ్యాంగ చట్టమమలు లోనికి వచ్చునాటికి, పూర్తిగా ు, కొంతవరకుగాని ఇండియా ప్రభుత్వమునుండి ధనసహా ము పొందుచు, జాతీయ ప్రాముఖ్యతగల సంస్థయని పార్ల ంటుచే నిర్ణయింపబడిన, నేషనల్ లైబ్రరీ, ఇండియన్ ్యూజియం, ఇంపీరియల్ వార్ మ్యూజియం, విక్టోరియా మోరియలు, ఇండియన్ వార్ మెమోరియలు మొదలగు ర సంస్థలు.

63. కాశీ హిందూ విశ్వవిద్యాలయము. అలీఘుడు ముస్లిం విశ్వ విద్యాలయము. ఢిల్లీ విశ్వవిద్యాలయము, జాతీయ ప్రాముఖ్యము గలవని పార్లమెంటుచే నిర్ణయింపబడిన ఇతరసంస్థలు.

64. జాతీయ ప్రాముఖ్యతగలవి అనగా పార్లమెంటుచే నిర్ణయింపబడి, ఇండియా ప్రభుత్వముచే పూర్తిగాగాని, కొంతవరకు గాని పోషింపబడుచున్న, వైజ్ఞానిక, సాంకేతిక విద్యాసంస్థలు.

65. సమాఖ్య అధ్వర్యమున నడుపబడు క్రింది సంస్థలు.

(a) వృత్తి, పారిశ్రామిక, సాంకేతిక శిక్షణ, నొసగు, సంస్థలు

(b) ప్రత్యేక విజ్ఞానము, పరిశోధనకు సంబంధించిన సంస్థలు.

(c) అపరాధ పరిశోధనలో సహాయకారియగు వైజ్ఞానిక సాంకేతిక శిక్షణ.

66. శాస్త్రపరిశోధన, ఉన్నతవిద్యా, వైజ్ఞానిక, సాంకేతిక విద్యా సంస్థల సమగ్రీకరణ, ప్రమాణ నిర్ణయములు.

67. జాతీయ ప్రాముఖ్యముగలవిగా పార్లమెంటుచే నిర్ణయింపబడిన, ప్రాచీన, చారిత్రిక కట్టడములు, శాసనములు, పురాతత్వ వస్తు ప్రదేశములు.

68. సర్వేఆఫ్ ఇండియా, జియొలాజికల్, బొటానికల్, జూలాజికల్, అంత్రొపొలాజికల్ సర్వేలు, మిటియోరోలాజికల్ పరిశోధన కేంద్రములు.

69. జనాభా గణనము.

70. సమాఖ్య ఉద్యోగములు, యావద్భారత ఉద్యోగములు, సమాఖ్య పబ్లిక సర్వీసుకమీషన్.

71. భారతప్రభుత్వ మీయవలసిన ఉపకార వేతనములు, ఇండియా సమష్టినిధి (Consolidated fund of India) నుండి యీయ వలసిన ఉపకార వేతనములు.

72. పార్లమెంటు యెన్నికలు, రాష్ట్రశాసనసభల యెన్నికలు. అధ్యక్ష, ఉపాధ్యక్ష పదవులకై యెన్నికలు, ఎన్నికలకమీషన్.

73. పార్లమెంటుసభ్యుల, కేంద్రశాసనసమితి, అధ్యక్ష, ఉపాధ్యక్షుల, కేంద్రశాసనసభ (ప్రజాసభ) స్పీకరు, డిప్యూటి స్పీకరుల, వేతనములు, బత్తెములు.

74. పార్లమెంటునందలి ఉభయసభల, అందలి సభ్యుల, ఉపసంఘముల అధికారములు, హక్కులు, విశేషసౌకర్యములు. పార్లమెంటుచే నియమింపబడిన, ఉపసంఘములు, కమీషన్లయెదుట సాక్ష్యమునిచ్చుట, అవసరపత్రముల చూపించుటకై వ్యక్తులను హాజరు పరచుట.

75. భారతాధ్యక్షుడు, గవర్నర్ల సెలవుహక్కులు, వేతనము, బత్తెములు, ప్రత్యేక సౌకర్యములు. సమాఖ్య మంత్రుల వేతనములు, బత్తెములు, కంట్రోలర్ అండ్ ఆడిటరు జనరలు సెలవు హక్కులు, జీతబత్తెములు, ఉద్యోగనిబంధనలు.

76. సమాఖ్య యొక్క, రాష్ట్రముల యొక్క ఆదాయ వ్యయముల లెక్కల సరి జూచుట.

77. సుప్రీంకోర్టు నియామకము, అధికార వివరణము, అధికారధిక్కరణము చేయువారిపైన చర్య. అచ్చట గైకొనబడు రుసుములు, న్యాయవాదుల అర్హతలు.

78. ఉన్నత న్యాయస్థానముల నియామకము. అధికార వివరణము, అచ్చటి న్యాయవాదుల అర్హతలు. ఉన్నతోద్యోగుల, సేవకుల నియామకము ఇందులో చేరదు.

79. ఒక రాష్ట్రములో ప్రధానస్థావరముగల ఉన్నత న్యాయస్థానాధికారమును, ఇతర రాష్ట్రముల భాగములకు చెందజేయుట, కొన్ని ప్రాంతములపై అధికారమును తొలగించుట.

80. ఒక రాష్ట్రమునకు చెందిన పోలీసు దళము, ఇతర రాష్ట్రముల ప్రభుత్వముల అనుమతితో, వారి అధికార ప్రాంతములో తమ

అధికారముల వినియోగించుటకు అనుమతి. ఒక రాష్ట్రపు పోలీసు దళమునకు, రాష్ట్రము వెలుపలనున్న రైల్వే అధికార ప్రాంతములో తమ అధికారము వినియోగించుటకు అనుమతి.

81. ఒక రాష్ట్రమునుండి, మరియొక రాష్ట్రమునకు వలస, వివిధ రాష్ట్రములమధ్య నిర్బంధ వైద్యమునకై ప్రయాణీకుల నిలిపి వేయుట.

82. వ్యావసాయికాదాయముగాని యితర ఆదాయములపై పన్నులు.

83. ఎగుమతి, దిగుమతి సుంకములు.

84. దేశములో తయారగు పొగాకు, తదితర వస్తువుల తయారుపై సుంకము. జనులు త్రాగుటకుపయోగించు మద్యములు, నల్లమందు, గంజాయి తదితర మత్తుమందులు,మత్తుపదార్థములపై యీ సుంకములేదు. పై వస్తువులు కలిసిన ఔషధములు, అలంకరణ పదార్థములపై సుంకము గలదు.

85. పెద్ద పట్టణములలోగల కార్పొరేషనులు విధించు పన్నులు.

86. వ్యవసాయక భూములుగాని, వ్యక్తుల, కంపెనీల ఆస్తులపై పన్నులు. కంపెనీల మూలధనముపై పన్నులు.

87. వ్యవసాయకభూములుగాని, స్థిరాస్తిపై పన్ను (Estate Duty)

88. వ్యవసాయకభూములుగాని, ఇతరఆస్తులపై వారసత్వపుపన్ను.

89. రైల్వేలు, స్టీమర్లు, విమానములద్వారా గొనిపోవబడు సరుకులు, ప్రయాణీకులపై గమ్యస్థానపు పన్నులు (Terminal-Taxes)

90. స్టాక్ ఎక్స్చేంజి, ఫ్యూచరుమార్కెటు పత్రి వ్యవహారములపై, స్టాంపు రుసుముగాక, యితరపన్నులు.

91. రసీదులు, ప్రాక్సీలు, డిబెంచర్లు, వాటాల (Shares) మార్పు, భీమా పాలిసీలు, లెటర్ ఆఫ్ క్రెడిట్ (హుండీలు), బిల్ ఆఫ్ లేడింగు (సరకు రవాణా పత్రము), ప్రామిసరీనోట్లు, చెక్కులు, ఎక్స్ఛేంజి బిల్లులపై చెల్లించవలసిన స్టాంపు రుసుములు.

92. వార్తాపత్రికల కొనుగోలు, అమ్మకములపైనను, వాటిలో ప్రచురింపబడు ప్రకటనలపైనను, పన్నులు.

93. ఈ పట్టీలో వివరింపబడిన విషయములకు సంబంధించిన చట్టములకు వ్యతిరేకించిన అపరాధములు.

94. ఈ పట్టీలో వివరింపబడిన ఏవిషయములోనైనను సుప్రీంకోర్టు తప్ప, తక్కిన న్యాయస్థానముల అధికారములు, అధికార ప్రాంత నిర్దేశము. యుద్ధనౌకాశాఖ అధికారములు, అధికార ప్రాంత నిర్దేశము.

95. ఈ పట్టీలో వివరింపబడిన ఏవిషయములోనైనను గ్రహింపబడు రుసుములు. కోర్టురుసుములు ఇందులో చేరవు.

96. రెండవ, మూడవ పట్టీలలోచేర్చబడని విషయములు, పన్నులు.



# ఏడవ అనుబంధము

## ప్రభుత్వ అధికారాల రాష్ట్రపట్టిక

1. ప్రజాశాంతి (సమాఖ్య ఆధీనములోనున్న నావిక, సైనిక, వైమానిక దళములు లేక యితర సాయుధదళములు. సివిలు ప్రభుత్వమునకు, శాంతిస్థాపనకై చేయు సహాయము ఇందులో చేరదు).
2. పోలీసుశాఖ, రైల్వే, గ్రామ పోలీసులతో సహా.
3. న్యాయ పరిపాలన, సుప్రీంకోర్టు, హైకోర్టులు తప్ప. తదితర న్యాయస్థానముల, స్థాపన, పాలనలు. హైకోర్టు నందలి ఉన్న తాధికారులు, తదితర సేవకులు, సుప్రీంకోర్టు తప్ప, మిగతా కోర్టులలో తీసుకొనబడు రుసుములు. అద్దెకంట్రోలు, రెవిన్యూ (భూమ్యాదాయశాఖ), న్యాయ నములలో క్రమవిధానము
4. జైళ్లు, శిక్షణగృహములు, బాలుర కై 'ప్రత్యేకింప' బడిన శిక్షా గృహములు, ఇటువంటి యితర సంస్థలు. అందు నిర్బంధితులైన వ్యక్తులు. ఇతర రాష్ట్రములలోనున్న జైళ్ళను, శిక్షాగృహముల నుపయోగించుకొను పద్ధతి.
5. స్థానిక పరిపాలనము, అనగా పురపాలక సంఘముల నియామకము, వాటి అధికారములు, నగర అభివృద్ధి సంస్థలు, జిల్లా బోర్డులు, గనుల పరిసరములలో గ్రామ నిర్మాణము. గ్రామ పరిపాలనకు, స్థానిక స్వపరిపాలనకు తుపకరించు యితరసంస్థలు.
6. ప్రజారోగ్యము, పరిశుభ్రత, వైద్యశాలలు.
7. పుణ్యక్షేత్రములకు యాత్రలు (విదేశ యాత్రలు ఇందులో చేరవు.)

8. మద్యముల ఉత్పత్తి, తయారు, నిలవయుంచుట, రవాణా, అమ్మకము, కొనుగోలు.

9. వికలాంగులకు, అశక్తులకు, సహాయము.

10. శవదహనము లేక పూడ్చివేయుట. శ్మశానవాటికలు.

11. మొదటి పట్టీలోని 63, 64, 65, 66 అంశములు- మూడవ పట్టీలోని 25వ అంశమునకు వ్యతిరేకముగానంత వరకు విద్య. విశ్వవిద్యాలయములు.

12. రాష్ట్రకోశమునుండి సహాయము పొందుచున్న గ్రంథాలయములు, వస్తుప్రదర్శనశాలలు, జాతీయ ప్రాముఖ్యతలేని పురాతన, చారిత్రక కట్టడములు, శాసనములు.

13. మొదటిపట్టీలో వివరింపబడని రాకపోకల మార్గములు, అనగా రోడ్లు, వంతెనలు, బల్లకట్టులు మొదలగునవి. ట్రాంబండ్లు, తాళ్ళవంతెనలు, దేశమధ్యనున్న నీటిమార్గములు. మొదటి, మూడవ పట్టీలలో యీ విషయములకు సంబంధించిన నియమములకు లోబడి ప్రైవేటిపై ప్రయాణములు. యంత్రసహాయ లేకయే నడుపబడు బండ్లు.

14. వ్యవసాయము, వ్యవసాయవిద్య, పరిశోధన, పంటరోగముల నరికట్టుట, కీటకబాధనుండి పైరుల రక్షించుట.

15. పశుసంపద వృద్ధిచేయుట, పశురక్షణ, పశురోగ నివారణ, పశువైద్యశిక్షణ, పశువైద్యము చేయుట.

16. బందెలదొడ్లు, పశువులు చేలలో పడకుండా కాపాడుట.

17. నీటికి సంబంధించిన విషయములు, అనగా, చెరువులద్వారా' కాలవలద్వారా నీటి సరఫరా, మురికినీరుపోవు మార్గములు' కాలవగట్టులు, జలాశయములు. మొదటిపట్టీ 56 అంశమునకు లోబడి, నీటిని, యంత్రములు నడుపుటకుపయోగించుట.

18. భూసంబంధ విషయములు, అనగా, భూమిపై హక్కులు, కౌలుదారీవిధానము, భూస్వామి, కౌలుదారులమధ్యగల సంబంధము. కౌలు వసూలు. వ్యవసాయకభూముల విడుదల,మార్పు భూమి అభివృద్ధి, వ్యవసాయక ఋణములు, నేలావుని (Colonization) అనగా, గ్రామముల నిర్మించి, క్రొత్త భూముల సేద్యములోనికి తెచ్చుట.

19. అడవులు.

20. వన్యమృగ, పక్షి, సంపద, సంరక్షణ.

21. చేపల సంరక్షణ.

22. మొదటిపట్టీ 34 అంశముకులోబడి, మైనర్ల ఆస్తి సంరక్షణ శాఖ. తాకట్టులోనున్న, ప్రభుత్వస్వాధీనములోనున్న ఆస్తులు.

23. మొదటిపట్టీలో చేర్పబడి, సమాఖ్య ఆధీనములో లేని గనుల పర్యవేక్షణ, వాటి అభివృద్ధి.

24. మొదటిపట్టీ 52 అంశములో చేరని పరిశ్రమలు.

25. దీపములకు, వంటలకుపయోగించు గ్యాస్. దానినితయారుచేయు కేంద్రములు.

26. రాష్ట్ర సరిహద్దులలో వర్తక వ్యాపారములు. మూడవ పట్టీ 33 అంశమునకు ప్రతికూలము గానంతవరకు.

27. మూడవపట్టీ 33 అంశమునకు వ్యతిరేకముగానంత వరకు వస్తువులు, ఉత్పత్తి- సరఫరా, పంపకము.

28. సంతలు, బజారులు.

29. తూనికలు, కొలతలు. ప్రమాణనిర్ణయము ఇందులో చేరదు.

30. ఋణములు. ఋణదాతలు. వ్యవసాయకఋణవిమోచన.

31. సత్రములు. సత్రాధికారులు.

32. మొదటిపట్టీలో వివరింపబడని రిజిష్టర్డు వర్తకసంఘములప్రారంభము, పర్యవేక్షణ, ఉపసంహారము. రిజిష్టరు కానటువంటి వ్యాపార, సాహిత్య, వైజ్ఞానికాది తదితర సంఘములు, సమాజములు, సహాకార సంఘములు.

33. నాటకశాలలు, నాటక ప్రదర్శనములు. మొదటిపట్టీ 60 అంశముకు విరుద్ధములేకుండా చలనచిత్రములు (సినిమాలు), ఆటలు వినోదములు.

34. పందెములు, జూదము.

35. రాష్ట్రమునకు సంక్రమించిన లేక ఆధీనములోనున్న భూములు, గృహములు, నిర్మాణకార్యములు.

36. మూడవపట్టీ 42 అంశమునకు విరుద్ధముగాకుండా సమాఖ్య అవసరములకుగాక, ఆస్తుల స్వాధీనము జేసికొనుట. నిర్బంధముగ ఆక్రమించుకొనుట.

37. పార్లమెంటు చేసిన చట్టముల ననుసరించి, రాష్ట్రీయశాసనసభలకు ఎన్నికలు.

38 రాష్ట్రశాసనసభాసభ్యుల, స్పీకరు, డిప్యూటీ స్పీకరుల వేతనములు, బత్తెములు. రాష్ట్రశాసనసమితి యున్నచో, దాని అధ్యక్ష, ఉపాధ్యక్షుల, (సభ్యుల), వేతనములు, బత్తెములు.

39. రాష్ట్ర శాసనసభయొక్క, దాని సభ్యుల, ఉపసంఘముల అధికారములు, ప్రత్యేక హక్కులు, సౌకర్యములు. (శాసనసమితి యున్నచో, సమితియొక్క, దాని సభ్యులు, ఉపసంఘముల) ఉభయశాసనసభల ఉపసంఘముల సమక్షమున సాక్ష్యమునిచ్చుటకు అవసరమగు పత్రముల తెచ్చి చూపించుటకై వ్యక్తులను నిర్బంధముగ హాజరుపరుచుట.

40. రాష్ట్రీయ మంత్రుల వేతనములు బత్తెములు.

41. రాష్ట్రీయ ప్రభుత్వోద్యోగములు, రాష్ట్రీయ పబ్లిక్ సర్వీసు కమీషను.

42. రాష్ట్రప్రభుత్వములీయవలసిన ఉపకార వేతనములు, రాష్ట్ర సమష్టి నిధినుండి యీయవలసిన ఉపకార వేతనములు.

43. రాష్ట్రీయ ఋణములు.

44. ధననిక్షేపములు.

45. భూమిపన్ను. పన్ను విధించుట, వసూలుచేయుట, భూమికి సంబంధించిన అధికార పత్రముల జాగ్రత్తజేయుట. పన్నులు విధించు నిమిత్తము భూములకొలతలు (సర్వే), భూమిస్వగల హక్కుల రిజిష్టరు జేయుట, భూమ్యాదాయమును యితరులకు చెందజేయుట.

46. వ్యవసాయికాదాయముపై పన్ను.

47. వ్యవసాయక భూముల వారసత్వముపై పన్ను.

48. వ్యవసాయక భూములపై స్థిరాస్తి పన్ను (Estates Duty).

49. ఇండ్లపైనను, భూములపైనను పన్ను.

50. పార్లమెంటు విధించిన నిబంధనల కనుగుణ్యముగ గనులకు సంబంధించిన హక్కులపై పన్నులు.

51. రాష్ట్రములో తయారు చేయబడిన యీ క్రింది సరుకులపైగాని, ఇతర రాష్ట్రములలో తయారు కాబడి, వ్యాపార సమత్వము కొఱకు, అదేరేటు ప్రకారముగాని, అంతకు తక్కువ రేటు ప్రకారముగాని విధింపబడు పన్నులు.

(a) త్రాగుట కుపయోగించబడు మద్యములు.

(b) నల్లమందు, గంజాయి, ఇతర మత్తుమందులు, మత్తుపదార్థములు. పై వస్తువులు కలిసిన ఔషధములు, అలంకారసామగ్రికి పన్ను లుండవు.

52. స్థానిక ప్రదేశములలోనికి, వాడుక, అమ్మకము, స్వఉపయోగ మునకై తేబడు వస్తువులపై పన్నులు.

53. విద్యుచ్ఛక్తి వాడుక, అమ్మకముపై, పన్ను.

54. వార్తా పత్రికలు మినహా, ఇతర వస్తువుల, కొనుగోలు, అమ్మకములపై పన్ను.

55. వార్తా పత్రికలలోని ప్రకటనలుగాని యితరప్రకటనలపై పన్ను.

56. భూమధ్య నీటిమార్గముల పైనను, రోడ్లపైనను, గొనిపోవబడు సరకులపై పన్ను.

57. మూడవపట్టీ 35 అంశముకులోబడి, ట్రాంబండ్లపైనను, యంత్ర సహాయముతో లేక వేరువిధముగ రోడ్లపై నడుపబడుటకువీలగు వాహనములపై పన్ను.

58. పశువులమీద, పడవలమీద పన్ను.

59. రహదారి పన్నులు.

60. వృత్తులు, వ్యాపారములు, ఉద్యోగములు, ఇతర సంపాదన మార్గములపై పన్ను.

61. మనుష్యులపై వసూలుచేయుపన్ను (Capitation Tax)

62. విలాసవస్తువులు, వినోదములు, పందెములు, జూదముపై పన్నులు.

63. మొదటిపట్టీలో వివరింపబడనివిషయములలో స్టాంపురుసుములు.

64. ఈ పట్టీలోని విషయములకు విరుద్ధముగ నడిచిన, అపరాధములు.

65. ఈ పట్టీలో వివరింపబడిన విషయములపై, సుప్రీంకోర్టుతప్ప, యితర న్యాయస్థానముల అధికారముల, అధికారవిస్తీర్ణము.

66. ఈ పట్టీలో వివరింపబడిన విషయములలో, కోర్టురుసుములు తప్ప, ఇతరకోర్టు గ్రహింపబడగిన రుసుములు.

# ఎనిమిదవ అనుబంధము

## కేంద్ర మరియు రాష్ట్రప్రభుత్వముల

## సంయుక్తాధికారముల పట్టిక

1. ఈ రాజ్యాంగ చట్టములులోనికి వచ్చు సమయమున ఇండి యన్ పీనలు కోడు ( నేరనిర్ణయ శాసనము ) లో నున్న అన్ని విషయములతో సహా క్రిమినల్ లా. మొదటి, రెండవ పట్టీలలో నున్న విషయములు, నావిక, వైమానిక, సైనికదళ ములు, ఇతర సాయుధ దళములు, సివిలు ప్రభుత్వమునకు సహా యము చేయుట మినహా.

2. క్రిమినల్ ప్రొసీజరు, క్రిమినల్ ప్రొసీజరు కోడు ( నేరాన్వేషణ విధాన శాసనము)లో, యీ రాజ్యాంగ చట్టములులోనికి వచ్చు నాటికి వివరింపబడిన అన్ని విషయములతో సహా.

3. రాష్ట్ర భద్రత, శాంతి రక్షణ, జీవితావసరవస్తువుల సరఫరా. అట్టి పనులు కుంటుపడకుండు నట్టుల కాపాడుట కొరకై, దోష రహిత నిర్బంధన ( Preventive Detention), అట్లు నిర్బంధింపబడిన వ్యక్తులు.

4. నేరస్థులను, పై అంశములో చెప్పబడిన రీతిని దోషరహిత ముగ నిర్బంధింపబడిన వ్యక్తులను, ఒక రాష్ట్రమునుండి, యింకొక రాష్ట్రమునకు మార్చుట.

5. వివాహము, విడాకులు. పసిపిల్లలు. మైనర్లు, దత్తత, మరణ శాసనములు (వీలునామాలు), వారసత్వము, వారసులకు ఆస్తి సంక్రమించుట, సమిష్టికుటుంబము, ఆస్తి విభాగము, రాజ్యాంగ

చట్టమములులోనికివచ్చునాటికి, వ్యక్తిగత శాసనములకు సంబంధించిన సర్వవిషయములు (హిందూలా, ముస్లింలా వంటివి).

6. వ్యావసాయక భూములుగాని, యితర ఆస్తుల సంక్రమణ, దస్తావేజులు, తదితర పత్రముల రిజిస్టరీ.

7. భాగస్వామ్యము, ప్రాతినిధ్యము (Agency), రవాణా ఒడంబడికలు, వ్యవసాయక భూములతో సంబంధములేని యితరప్రత్యేక విధములగు ఒడంబడికలు.

8. చర్య తీసుకొనదగిన నేరములు.

9. దివాలా; అప్పులు చెల్లించ లేకపోవుట.

10. ట్రస్టులు, ట్రస్టీలు.

11. ప్రభుత్వ ట్రస్టీలు, అడ్మినిస్ట్రేటర్-జనరలు.

12. సాక్ష్యము, ప్రమాణములు. న్యాయచట్టములను, ప్రభుత్వ కార్యములను, పత్రములను, న్యాయవిచారణ సంబంధ చర్యలను గుర్తించుట.

13. సివిలు ప్రొసీజరు రాజ్యాంగచట్ట మములులోనికి వచ్చునాటికి సివిలు ప్రొసీజరుకోడు (న్యాయవిధాన శాసనము)లో చెప్పబడిన అన్నివిషయములు, మధ్యవర్తి తీర్పులు; లిమిటేషన్ శాసనము.

14. సుప్రీంకోర్టుతప్ప, మిగతా న్యాయస్థానముల అధికార ధిక్కరణ నేరము.

15. పనిపాటలులేక తిరుగుచుండుట. స్థిరనివాసములేకతిరుగుజాతులు.

16. పిచ్చి, మతిస్థయిర్యము లేకపోవుట; పిచ్చివారికి, మతిస్థయిర్యము లేనివారికి వైద్యశాలలు, నివాసగృహములు.

17. పశువులయెడల క్రూరత్వ నివారణ.

18. ఆహారపదార్థములు, తదితర దినుసులలో కల్తీ.

19. మొదటిపట్టీ 59 అంశములో నల్లమందును గురించి చెప్పబడిన దాని ననుసరించి; మందులు, విషములు.

20. ఆర్థిక, సాంఘికాభివృద్ధి ప్రణాళికలు.

21. ఏకైకవ్యాపార, పారిశ్రామిక సంస్థలు. వర్తక సంఘముల కలయికలు, ట్రస్టులు.

22. ట్రేడు యూనియన్లు (పనివారల సంఘములు), పారిశ్రామిక కార్మిక తగాదాలు.

23. సమాజభద్రత. సామాజిక భీమా. ఉద్యోగ నిరుద్యోగములు

24. కార్మికుల క్షేమ లాభములు, పనిచేయుస్థలములలోని స్థితిగతులు. ప్రావిడెంటుఫండ్లు, యజమానుల బాధ్యత, కార్మికులకు నష్టపరిహారము. వికలత్వ, వృద్ధాప్య ఉపకారవేతనములు, ప్రసూతిసౌకర్యములు.

25. కార్మికులకు వృత్తి విద్యా, సాంకేతిక శిక్షణలు.

26. న్యాయవాదము, వైద్యము, తదితరవృత్తులు.

27. ఇండియా, పాకిస్తాన్ డొమినియనులస్థాపన కారణముగా తమ నెలవులుతప్పిన నిర్వాసులకు సహాయము. వారి పునరావాసము.

28. ధర్మములు, ధర్మ సంస్థలు. ధర్మ, మతవిషయక నిధులు, మత సంస్థలు.

29. మనుష్యుల, జంతువుల, మొక్కల అంటురోగములను, కీటక సంతతిని, ఒక రాష్ట్రమునుండి, మరియొక రాష్ట్రమునకు వ్యాపింపకుండ జేయుట.

30. జనన మరణములకు సంబంధించిన లెక్కలు, జనన మరణముల నమోదుచేయించుట.

31. పార్లమెంటుచే అంగీకరింపబడిన, ప్రముఖ నౌకాశ్రయములు గాక, తక్కిన నౌకాశ్రయములు.

32. భూమధ్య జలమార్గములపై యంత్రసహాయమున నడుపబడు నౌకలు, నౌకాయానము; యానమునకు సంబంధించిన నిబంధనలు. మొదటి పట్టీలోని నిబంధనలననుసరించి, పై జలమార్గములపై మనుషుల, సరకుల రవాణా.

33. సమాఖ్య అధ్వర్యమున నడుపబడు పారిశ్రామిక వస్తువుల ఉత్పత్తి, సరఫరా, పంపిణి. ( వర్తకవ్యాపారములు )

34. ధరల కంట్రోలు.

35. యంత్రసహాయమున నడుచుబండ్లు, వాటిపై పన్నులు విధించు సూత్రముల నిర్ణయము.

36. ఫ్యాక్టరీలు.

37. బాయిలర్లు

38. విద్యుచ్ఛక్తి

39. వార్తాపత్రికలు, పుస్తకములు, ముద్రణాలయములు.

40. జాతీయ ప్రాముఖ్యతలేని, పురాతత్వస్థలములు, శిథిలములు.

41. శాసనరీత్యా ప్రకటింపబడిన, వ్యావసాయిక భూములతోసహా, కాందిశీకుల ఆస్తి స్వాధీనము, రక్షణ, విక్రయము.

42. భూస్వాధీన చట్టప్రకారము, ఆక్రమింపబడిన భూముల కీయవలసిన ప్రతిఫల నిర్ణయము; ముట్టజెప్పు విధానము.

43. రాష్ట్రేతర ప్రాంతములలో చెల్లింపవలసిన, భూమిపన్ను బాకీలు, భూమిపన్నువలె వసూలు చేయదగిన యితర బాకీలు, పన్నులు. ప్రభుత్వపు బాకీలను, రాష్ట్రములో వసూలుచేయుట.

44. స్టాంపుడ్యూటీల ప్రమాణ నిర్ణయము మినహా, కోర్టు స్టాంపుల ద్వారా వసూలుచేయబడు రుసుములుతప్ప, యితరరుసుములు.

45. రెండుమూడు పట్టీలలో వివరింపబడిన విషయములపై సమాచార సేకరణ, తత్సంబంధమైన లెక్కలు ( Statistics ).

46. ఈ పట్టీలో వివరింపబడిన విషయములపై, సుప్రీంకోర్టుతప్ప, ఇతర న్యాయస్థానముల యధికార వివరణము.

47. కోర్టురుసుములు మినహా, ఈ పట్టీలో వివరింపబడిన విషయములలో, వసూలు చేయతగిన రుసుములు.

# తొమ్మిదవ అనుబంధము

## భారతీయ భాషలు

1. అస్సామీ, 2. బెంగాలీ, 3. గుజరాతీ, 4. హిందీ, 5. కన్నడము, 6. కశ్మీర్, 7. మళయాళము, 8. మహారాష్ట్రము, 9. ఓరియా 10. పంజాబీ, 11. తమిళము, 12. తెలుగు, 13. సంస్కృతము 14. ఉర్దూ.

పద్మశాలి ప్రింటింగ్ ప్రెస్, రాజమొహల్లా, హైదరాబాదు - దక్షిణ.